# ప్రతీకారం

అనువాదం :

శ్రీనివాస చక్రవర్తి.

పాటలు :

తాంభట్ల కృష్ణమూర్తి.



# పీఠిక

ఇదిగో ఇంకో పుస్తకం! ఇదే ఆఖరి పుస్తకం కూడానూ! దీనిని - దీనిని బయట పెట్టాలని నాకే కోశానా లేదు. గాని మొదటి గ్రంథానికి ఇంత ఆదరణ చూపినపుడు ఊరుకోవడం భావ్యంకాదని తోచింది. గ్రామంలో నన్ను చూసి అపుడే నవ్వడం ప్రారంభించారు. "ముసిలాడికి మతి పోయింది" అంటున్నారు. "ముసలితనంలో చిన్నపిల్లల ఆట వస్తువులతో సర్దాగా కాలక్షేపం చేస్తున్నాడు!" నిజం! విశ్రాంతి తీసుకోవలసిన సమయం వచ్చింది. నేను ముసిలివాడి లాగా నటిస్తున్నానని ప్రియమయిన పాఠకులు ఊహిస్తున్నా రనుకుంటాను. పళ్ళు అన్నీ ఊడిపోయి బోసినోరయిన తరవాత

ఇంకా నటన! మెత్తని పదార్థాలయితే నవలగలనుగాని గట్టివి నవలడం శక్యంగాదు. అందుకనే ఇదుగో. ఇంకో పుస్తకం! నన్నుమాత్రం తిట్టిపోయకండేం. ఇక నాదారి నాది, మీదారి మీది! మళ్ళీ ఇంతలో కలుసుకుంటామో లేదో? అటువంటపుడు తిట్టడం భావ్యంకాదు. తెలిసిందా? ఇందులోని కథలు చెప్పినవాళ్ళల్లో ఒక్క ఫోమా గ్రిగొర్యెవిచ్‌ని తప్ప ఇంకెవరినీ మీరు ఎరిగిఉండరు. ఆ బఠాణీ పచ్చరంగుకోటు పెద్దమనిషి బహు పసందుగా మాటాడుతాడు. మాస్కోనుంచి వచ్చిన మహామహావాళ్ళే అర్థం చేసుకోలేరు. అతను చాలాకాలంబట్టి ఇక్కడ ఉండడంలేదు. మనందరితో పోట్లాడిన తరవాత మళ్ళీ ఇటుకేసి తొంగిజూడలేదు. ఈ విషయం మీతో చెప్పలేదుగదూ, చెప్పనా? అదో తమాషా!

కిందటి సంవత్సరం వేసంగిలో నా పుట్టినరోజు పండుగనాడు నన్ను అభినందిస్తానికి చాలామంది వచ్చారు. ఇరుగూ పొరుగూ ఈ ముసిలాడిని మరిచేపోలేదు. భగవంతుడు ఆయురారోగ్యాలు వానికి ప్రసాదించుగాక! యాభ్భయి ఏళ్ళ నుంచి పుట్టినరోజు పండుగ చేసుకొంటున్నానుగాని నా వయసెంతో నాకూ తెలీదు, మా ముసిలిదానికీ తెలీదు. సుమారు డబ్భయి ఏళ్ళు ఉంటాయి. డికాంకాలోని ఫాదరీ ఖర్లాంపీకి నేను ఎపుడు పుట్టిందీ తెలుసు. కాని పాపం! అయన యాభ్భయిఏళ్ళ కితమే చనిపోయాడు. నన్ను అభినందించడానికివచ్చిన వాళ్ళువీళ్ళు: జకాల్ కిరిలోవిచ్ ఛుకోపుపెంకో, స్తెపాన్ ఇవనోవిచ్ కురోచ్కా, తారాస్ ఇవనోవిచ్ స్మాచ్నెన్కీ, కార్లంపీ కిరిలోవిచ్ ఖ్లోస్తా. ఇంకొకతను,

అరె! పేరు మరిచేయూను. ఆం-ఓసిప్,ఓసిప్—మిర్గొరోడ్ లో అతనిని ప్రతి ఒక్కడూ ఎరుగున్నాడు. మాట్లాడడానికి మొదలుపెట్టేటప్పుడు లేచి వేళ్ళు విరుచుకుని. చేతులు నడుం మీాద పెట్టుకుంటాడు. సరే. మరేం పరవాలేదు! పేరు ఇపుడే జ్ఞాపకం చేసుకుంటాలెండి. పోల్టావా పెద్దమనిషి, మీారందరూ ఎరుగున్నారుగా, ఆయనకూడా వచ్చారు. ఫోమా గ్రిగొర్యెవిచ్ మనలోవాడికింద లెక్కేగదూ. ఆయనా వచ్చాడని వేరేచెప్పాలా? అందరూ మాట్లాడారు. అల్లాటప్ప విషయాలను గురించి మేమెన్నడూ మాటాడుకోం. యుక్తసంభాషణంటే నాకు తగని ఇష్టం. ఒక దెబ్బకు రెండు పిట్టలన్నారుగదూ! సంతోష దాయకంగానూ ఉండాలి, లాభదాయకంగానూ ఉండాలి. అందుకని ఆపిలుపళ్ళు ఎలా ఊరనేయూలనే విషయం చర్చించాం. మా ముసిలిది, ముందు శుభ్రంగా కడిగి, ఆపైన బీరులో నానేసి, ఆతరవాత—

"అబ్బే! అదేంలాభంలేదు!" అంటూ అడ్డువచ్చాడు పోల్టావానుంచి వచ్చిన పెద్దమనిషి, బటాణీ పచ్చనోటు జేబులోచేయి పెట్టుకుని గంభీరంగా గదిలో పచార్లుచేస్తూ. "కాస్తంతయినా లాభంలేదు! ముందుగా వాటిమీాద" సుగంధపాల వేళ్ళరసం చల్లాలి. ఆ తరవాత—కాని, ప్రియమయిన సోదరులారా! ఆపిలు పళ్ళమీాద సుగంధపాల వేళ్ళ రసం చల్లడం ఎన్నడయినా విన్నారా అని అడుగుతున్నా? సామాన్యంగా నల్లద్రాక్ష ఆకులు, పందివేరు, త్రయిపత్రం వాడడం ఎరుగున్నాంగాని సుగంధపాలరసం చల్లడం ఎన్నడూ వినలేదు. ఈ విషయూలలో మాముసిలిదానికి తెలిసి

నంత ఎవరికీ తెలీదు. సరే, ఎలాగయినా ఇరుగు పొరుగు వాళ్ళం గదా. నెమ్మదిగా పక్కకు తీసుకువెళ్ళి "సరేగాని, మాకార్ నజరోవిచ్! నవ్వులపాలు చేసుకోకు! నువేం సామాన్యుడివా? గవర్నరుగారి పక్కన కూర్చుని విందారగించానని నువేచెప్పితివిగా! ఇలాగే అక్కడా మాట్లాడివుంటే నవ్విపోయేవాళ్ళు!" దీనిమీద అతను ఏమన్నాడో తెలుసా? మాటాడకుండా నేలమీద ఉమ్మేసి, టోపీ తీసుకుని చక్కాబోయాడు. పోనీ ఎవరితోనో ఒకరితో వెళ్ళొస్తానని చెప్పచ్చా, లేదూ తల ఊపచ్చా! ఊహుఁ - అవేం చేయలేదు. గేటుదగ్గిరికి బగ్గీ రావడం, అందులో ఎక్కి అతను వెళ్ళిపోవడంమాత్రం వినిపించింది. పీడా వదిలింది! అటువంటివాళ్ళు అసలు రాకుండా ఉండడమే మంచిది. ఈ గొప్పింటివాళ్ళంత అధ్వాన్నమయినవాళ్లు ప్రపంచంలో లేరనుకోండి. అతని మేనమామ ఒకప్పుడు కమీసార్ పని వెలిగించాడు. ఇంకేం. ఈయనగారు అందరిమీద ధుమధుమ లాడతాడు. కమీసార్ ఉద్యోగంకంటె పెద్దఉద్యోగాలు లేనట్టు! కమీసార్లకంటె గొప్పవాళ్లు తప్పకుండా ఉన్నారు. ఊహుఁ - నాకు ఈ గొప్పింటివాళ్ళంటె సరిపడదు. ఉదాహరణకి థోమా గ్రిగొర్యెవిచ్‌నే తీసుకుందాం. అతను గొప్పింటివాడు కాదు. కానీ అతనికేసి చూడండి. మొహంలో అచ్చమయిన శ్రీవి గోచరిస్తుంది. మామూలుగా నశ్యం పీలుస్తున్నప్పుడయినా సరే, గౌరవించకుండా ఉండలేం. చర్చిలో పాడుతూంటే పాట మనసును చూరగొంటుంది. కరిగిపోతున్నామా అనిపిస్తుంది. ఇక ఆ రెండో ఆయన ఊఁ- ఆయనతో ఏమిటిగాని!

కథలు చెప్పకపోతే మన పుట్టెద్దో మునిగిపోతుందని అనుకుం టాడు. ఇదిగో, ఆయనగారి కథలులేని పుస్తకం!

ఈ సంపుటంలో నా కథకూడా ఒకటి వేస్తానని మీకు మాట ఇచ్చినట్లు జ్ఞాపకం. కాని నాకథ ఒక్కటే ఇలాంటి పుస్తకాలు మూడవుతుంది. విడిగా అచ్చువేయిద్దామని నిశ్చ యించుకున్నానుగాని మళ్ళా వేయకుండా ఉంటేనే బాగుంటుం దని తోచింది. నాకు తెలుసు ఈ ముసలాడిని చూసి నవ్వు తారుగదూ! ఊహుఁ - అయినా అచ్చువేయించను. శెలవు. మళ్ళీ కలుసుకోవడమంటూ తటస్థిస్తే ఇంతలోకాదు. కాని నేను పుట్టిక ఉండకపోతేమాత్రం మీకువచ్చిన నష్టమేమిటి? సంవత్సరాలకి సంవత్సరాలు గడిచిపోతాయి. ఈ ముసిలి తేనెకాపరి ఎవరికీ జ్ఞాపకం ఉండడు. ఉన్నా విచారపడరు.

గింగర్ పాంకో.





# భోగి పండుగ

భోగి పండుగ? పగలు గడిచింది. రాత్రి అయింది. శీతాకాలం నిర్మలంగా ఉంది. చుక్కలు తొంగిచూస్తున్నాయి. కొల్యాడ్కి * పాటలుపాడుతూ, క్రీస్తు ప్రభువును ప్రస్తుతిస్తూ ప్రపంచమంతా ఆనందించడానికి అనువుగా చంద్రుడు రాజ

---

* కొల్యాడ్కి అనేపాటలు క్రిస్మస్ పండుగ ముందురోజు రాత్రి కిటికీలకింద పాడడం మాలో ఆచారం. ఆ ఇంటి యజమానో, యజమానురాలో లేక ఆ సమయంలో ఇంట్లో ఉన్నవారు పాటకుని సంచిలో కూరో, రొట్టో, డబ్బులో లేకపోతే ఇంకేదయినానో వేయడం మామూలు. పూర్వకాలంలో కొల్యాడా అని తెలివితక్కువ దద్దమ్మ ఒకడు ఉండేవాడట. అతనిని భగవంతుడని భావించేవారు. అతని పేరు మీదుగానే ఈ పాటలకు కొల్యాడ్కి అని పేరు వచ్చిందట. కాని ఇది నిజమో అబద్ధమో ఎవరికి తెలుసు? దీని విషయంలో అభిప్రాయం

శీవితో ఉదయించాను. ఉదయంకంటె గట్టిగా మంచు గడ్డ కట్టుకుపోతోంది. ఎక్కడా చడీచప్పుడూలేదు. బూటుకింద మంచుగడ్డల గరగరమ శబ్దం అరమైలువరకు వినిపిస్తోంది. కిటికీల కిందకు ఇంకా పిల్లలజట్టు ఒకటీ చేరలేదు త్రొందరగా తెముల్చుకుని గరగరలాడే మంచుమీద పరుగులుతీయండి అని అలంకరించుకుంటున్న బాలికలను పిలుస్తున్నాడాఅన్నట్లు చంద్రుడు కుటీరాలలోకిదొంగచాటుగాతొంగిచూస్తున్నాడు. సరిగ్గా ఆ సమయానికి ఒక కుటీరం పొగగొట్టంలోనుంచి పొగ గుప్పు గుప్పుమంటూ లేచి మేఘంలాగా ఆకాశంలో తిరగ జొచ్చింది. చీపురుకట్టమీద కాళ్ళు పంగటించుకుని ఒక మంత్రగత్తె ఆ పొగతోబాటు పైకి లేచింది. గొర్రెపిల్ల చర్మం అంచుటోపీ పెట్టుకుని, నల్ల ఆస్ట్రాఖాన్ అంచుల ముదురు నీలికోటు పెద్దది తొడుగుకుని, దెయ్యంలాంటి జడల కొరడా ఆడిస్తూ మూడు అద్దెగుర్రాల బగ్గీలో వెళ్లే సుంకాధికారి ఆమెను తప్పకుండా గమనించి ఉంటాడు. సారోచిన్ట్సీ సుంకాధికారి కళ్ళల్లో కారం కొట్టగలిగిన మంత్రగత్తె ఇంతవరకు పుట్టలేదు. ఎవరిపంది ఎన్నిపిల్లల్ని పెట్టిందీ, ఎవరిపెట్టెలో ఎన్ని గజాలబట్ట ఉందీ, ఆదివారం నాడు సారాదుకాణంలో ఎవరెవరు ఏఏవస్తువులు తాకట్టు

---

ఇవ్వడం మాబోటి సామాన్యులకి సాధ్యంకాదు. కిందటి సంవత్సరం ఈ కొల్యాడ్కీ పాటలు పొలాలలో పాడడానికి వీల్లేదనీ, అలా పాడితే సైతాన్‌ను గౌరవించినట్టే అవుతుందనీ ఫాదరీ ఒసిప్ చెప్పాడు. కాని నిజానికి కొల్యాడ్కీ పాటలలో కొల్యాడానిగురించి ఒక్కముక్కయినా లేదు. క్రీస్తు పుట్టుకనుగురించి ఆపాటలలో పాడతారు. చివరకు ఆ ఇంటిలో వారందరికీ శుభం చేకూరాలని ఆశీర్వదిస్తాడు—తేనెకాపరి.

పెట్టిందీ అతనికి కరతలామలకమే! కాని సారోచిన్‌ట్సీ సుంకాధికారి ఆవైపుకు వెళ్ళలేదు. అతనికి అక్కడేంపని? స్వంత జిల్లా సంగతి చూసుకోవాలాయె ఈలోపున మంత్రగత్తె పైకి ఎగిరీ ఎగిరీ నల్లటి నలుసుగా కనిపించ సాగింది. ఆ నలుసు కనిపించినపుడల్లా నక్షత్రాలు ఒకటొకటీ మాయంగాజొచ్చాయి. కాసేపటికి మంత్రగత్తె ఒడినిండా నక్షత్రాలు ఏరి వేసుకుంది మూడు నాలుగు నక్షత్రాలు మాత్రమే ఇంకా ప్రకాశిస్తున్నాయి. హఠాత్తుగా ఇంకో నలుసు ఎక్కడినుంచో తయారయింది. అది క్రమేపీ పెద్దది గాజొచ్చింది. చత్వారం మనిషి బండిచక్రాలంత అద్దాలు పెట్టుకున్నా అది ఏమిటో తెలుసుకోలేడు. ముందు భాగంచూస్తే అచ్చంగా జర్మనీవాడులా * ఉంది. చిన్న కోలమొహం ఎపుడూ అడ్డంగా తిరుగుతూ ప్రతివాడినీ అనుమానంతో చూస్తున్నట్టుంది. పందిముట్టెల్లాంటి గుండీలు, కాళ్ళు అతిసన్నం. అంత సన్నకాళ్ళు యాలెస్కీ పెద్దకే గనక ఉంటే కోసక్‌నాట్యం ప్రారంభించగానే విరిగి ఊరుకుంటాయి. వెనకనుంచి చూస్తే అచ్చంగా న్యాయవాది! ఈ రోజుల్లోని కోట్ల తోకల్లాగా, పొడుగ్గా బాణంలా తోక ఉంది. మేకగడ్డం, నుదుటిమీది కొమ్ములు, పొగగొట్టం తుడిచేవాడి రంగు. చూస్తే జర్మనీవాడూగాదు, న్యాయవాదీ గాదు, దెయ్యంఅని ఇట్టే చెప్పచ్చు. ఈ విశాల ప్రపంచమం

---

* ఫ్రాన్సునుంచిగాని, హంగిరీనుంచిగాని స్వీడెన్‌నుంచిగాని మరే విదేశంనుంచిగాని వచ్చినవారిని జర్మనీవాడనడం మాకు పరిపాటి. —రచయిత.

తటా తిరుగుతూ పుణ్యపురుషులను పాపాలు చేయమని ప్రోత్స హించడానికి ఈ ఒకరాత్రి ఆదెయ్యానికి మిగిలింది. ఇక తెల్లవారిఉదయ ప్రార్థనలకు గంటలు మోగగానే తోక ముడుచుకోవలసిందే.

ఈ లోపున దెయ్యం దొంగచాటుగా చంద్రుడి దగ్గిరికి వెళ్ళి పట్టుకుందామని చేయిజాచింది. కాని వెనువెంటనే కాలి నట్టు వెనక్కులాక్కుని వేళ్ళు నోట్లోపెట్టుకు చప్పరిస్తూ గెంతులువేసింది. మళ్ళీ ఇంకోవేపు నుంచి పరుగెత్తుకుంటూ వెళ్లి చంద్రుడిని పట్టుకోబోయి చేయి వెనక్కు లాక్కుంది. అయితే ఇన్నిమార్లు యత్నించి విఫలమయినా జిత్తులమారి దెయ్యం విరమించుకోలేదు. పరుగెత్తుకుని వెళ్లి హఠాత్తుగా రెండు చేతులతోనూ చంద్రుడిని పట్టివేసింది. పైపులో వేయడానికి రైతు వట్టి వేళ్ళతో నిప్పు తీసుకున్నట్టు దెయ్యం ఒక చేతిలోనుంచి ఇంకొకచేతిలోకి చంద్రుడిని వేసు కుంటూ మొహం ముడుచుకుని ఊదసాగింది. చివరికి తొందర తొందరగా జేబులో పెట్టుకుని ఏమీ ఎరగనట్టు పరిగెత్తింది.

దెయ్యం చంద్రుడిని ఎత్తుకుపోయిందని డికాంకాలో ఎవరూ గమనించలేదు. జిల్లా గుమాస్తా పాక్కుంటూ సారా దుకాణంలోనుంచిబయటికివచ్చాడు. అకారణంగా చంద్రుడు ఆకాశంలో ఆడిపోవడం చూసి ఒట్టేసుకుని ఆ విషయం అంద రికి చెప్పినమాట వాస్తవమేగాని ఎవరూ నమ్మలేదు. తలలు ఆడించి వేళాకోళం చేసారు. అయితే ఈ చట్టవిరుద్ధ చర్యకు దెయ్యం ఎందుకు పూనుకున్నట్టు? ఎందుకా? ఇందుకు! బాండారి ధనిక కోసక్ చబ్‌ను ఆరాత్రి విందుకు పిలిచాడని

దెయ్యానికి తెలుసు. ఆ విందులో గోధుమ పాయసమేగాక ఘాటువోడ్కా, పచ్చవోడ్కా ఇంకా రకరకాల భోజ్యాలు! భాండారి దయాదికూడా ఆ విందుకు వస్తాడు. అతను బిషప్పు గారి సంగీత మేళంలోవాడు బాగా మంద్రంగా పాడతాడు. అతనినిగాక మునసబును, కోసక్ స్వర్చిగుజ్‌ని తదితరులను కూడా ఆహ్వానించాడు. విందు జరుగుతూంటే చబ్ కూతురు ఒక్కతే ఇంటిదగ్గర ఉంటుంది. ఆమె ఆ గ్రామంలోకల్లా అందగత్తె. కమ్మరి కుర్రవాడు ఆమెను చూడడానికి తప్ప కుండా వెళతాడు. అతను మాంచి బలశాలి. యువకుడు. అత నంటే దెయ్యానికి పరమ ద్వేషం. ఆ కమ్మరి కుర్రవాడు తీరుబడి సమయాలలో చిత్రాలు గీస్తుంటాడు. ఆ చుట్టుపక్కలకల్లా మంచి చిత్రకారుడని పేరు పొందాడు. కోసక్ అధికారి తన ఇంటికోరడికి రంగువేయడానికి ఒకమారు అతనిని పిలిపించాడు. డికాంకాలోని కోసక్ పులుసు గిన్నెలకు రంగు వేసింది ఈ కమ్మరే! భక్తిపరుడు. తరుచు దేవతా విగ్రహాలకు రంగులు వేస్తూండేవాడు. ఇప్పటికీ అతను చిత్రించిన లూక్ చిత్రం టీ చర్చిలో కనిపిస్తుంది. కాని అతని ఉత్తమచిత్రంగా పరిగణించతగింది గర్భగుడిలో ఎడమవేపు గోడమీాదిచిత్రం. అందులో 'విచారణదినం'నాడు సెయింట్‌పీటరు చేతితో తాళంచెవులు పట్టుకుని దెయ్యాన్ని నరకలోకంలోనుంచి తరిమివేస్తున్నట్టు చిత్రించాడు. ఆ దెయ్యం భయపడిపోయి రాబోయే గతిని ఊహించుకుని గంతులు వేస్తుంది. వదలి వేయబడిన పాపులను దాని వెంటతరిమి కొరడాలతోను,కొయ్య ముక్కలతోను, చేతికి ఏదిదొరికితే వాటితో కొడుతున్నాడు.

కమ్మరి కుఱ్ఱవాడు ఈచిత్రం పెద్ద కొయ్యచెక్కమీద గీస్తుంటే దెయ్యం ఎన్ని విఘ్నాలు కల్పించాలో అన్నీ కల్పించింది. కంటపడకుండా చేతిని కదిపింది. కొలిమిలో నుంచి బూడిద తెచ్చి చిత్రంమీద చల్లింది. ఇంత చేసినా చిత్రం పూర్తి అయింది. చర్చిలోకి తీసుకువచ్చి పక్కగుడిగోడకు పెట్టారు. దానిమీద దెయ్యం కమ్మరి కుఱ్ఱవాడిమీద పగ తీర్చుకుంటానని ప్రతినచేసింది.

ఆ దెయ్యానికి భూమ్మీద తిరగడానికి ఇక ఒక్కరోజే వ్యవధిఉంది. రాత్రికి కమ్మరి కుఱ్ఱవాడిమీద పగ తీర్చుకోవడం ఎలాగా అని యోచించింది. ముసలిచబ్ సోమరిపోతు. చురుకుకాదు. బండారికుటీరందూరం రోడ్డుఊరిబయటి మిల్లులు, గోరీలదొడ్డిమీదుగా కనుమనుచుట్టి వెళుతుంది. వెన్నెలరాత్రి ఘాటు వోడ్కా పచ్చవోడ్కాపడితే చురుకు పుట్టి చబ్ విందుకు బయలుదేరతాడు. చీకటయితే స్టోవ్ మీదినుంచి దిగి బయటికి వచ్చేటట్టు చేయడం ఎవరితరమూ గాదు. చబ్ కి కమ్మరి కుఱ్ఱవాడికి సరిపడడంలేదు. అటువంటప్పుడు కమ్మరి కుఱ్ఱవాడు ఎంత బలశాలి అయినా తండ్రి ఇంటో ఉండగా కూతురిని చూడడానికి వచ్చేందుకు సాహసించడు.

దెయ్యం చంద్రుడిని జేబులో దాచేయగానే ప్రపంచమంతటా చీకటి వ్యాపించింది. సారా దుకాణానికి దోవ కనిపించటం లేదు. ఇక బాండారి ఇంటిదోవ కనిపించటంలేదని వేరే చెప్పాలా? చుట్టూ చీకటిచూసి మంత్రగత్తె కెవ్వుమంది. దెయ్యం చిరునవ్వు నవ్వుతూ వంగివంగి వెళ్ళి ఆమెచేయి

పట్టుకుని, సాధారణంగా మొగవాళ్ళు ఆడవాళ్ళ చెవిలో ఏది చెపుతారో అదే చెప్పింది. మన ప్రపంచంలో ఏర్పాట్లు చిత్రంగా జరిగిపోతూంటాయి. అందులో నివసించేవారంతా ఒకరినొకరు అనుకరించాలని యత్నిస్తారు. పూర్వం మిర్గో రోడ్‌లో న్యాయాధిపతి, మేయరు- వీరిద్దరే శీతాకాలంలో అంచులకు గొర్రెచర్మం కుట్టిన నూలుఓవరు కోట్లు వేసుకునే వారు. చిన్న ఉద్యోగస్తులంతా సాదా గొర్రెచర్మం కోట్లు తొడిగేవారు. కాని ఇపుడు సుంకాధికారి, మేజిస్ట్రేటుకూడా ఆస్ట్రాఖాన్ చర్మం అంచుల కొత్తనూలుకోట్లు వేసుకుంటున్నారు. ఆ కిందటి సంవత్సరం కచేరీగుమాస్తా, జిల్లా గుమాస్తా గజం అరవయికో పెక్కులు పెట్టి ముదురునీలి నూలుగుడ్డకొన్నారు. భాండారి వేసవికని ముతకనూలు గుడ్డ పంట్లాం, చారల ఉన్ని వేస్టుకోటూ కుట్టించుకున్నాడు. క్లుప్తంగా చెప్పాలంటే, ప్రతీవారూ ఇంకొకరిలా కనిపించాలనే యత్నం! జనం ఇటువంటి ఆడంబరం ఎపుడు విడనాడుతారోగదా! దెయ్యంకూడా ఈ విధంగా తయారయిందంటే చాలామందికి ఆశ్చర్యం వేస్తుంది. ఇంతకీ వచ్చినచావు ఎక్కడుందంటే ఆ దెయ్యం రూపం మహావికారంగా ఉంటుంది. కాని తానేదో మహాఅందమయిన దానినని అనుకుంటుంది. దానిమొహం, ఫోమా గ్రిగొర్యెవిచ్ చెప్పినట్లు బహు అసహ్యాంగా ఉంటుంది. అయితేనేం రాసిక్యం వెలిగించబోతుంది. కాని ఆకాశంలో, ఆకాశంకిందా కారుచీకటి వ్యాపించింది. ఆ రెంటిమధ్యా జరిగేదంతా మరుగుపడిపోయింది.

"అయితే బాండారి ఇంట్లో విందుకు వెళ్ళలేదన్న మాట ?" అన్నాడు కోసక్ చబ్ బయటికివచ్చి సన్నగా పొడుగ్గాఉండే ఒకరైతును చూసి. ఆరైతు విరిగిన కొడవలి ముక్కతో గడ్డం గీచుకోలేదు. దుబ్బుగా పెరిగింది. రైతులు మంగలి కత్తికి బదులు కొడవలి ముక్కతో సాధారణంగా గడ్డం చేసుకుంటూంటారు. "యివాళ రాత్రి అక్కడ జల్సా జరుగుతుంది !" అంటూ కొనసాగించాడు చెబ్ ఇకిలిస్తూ. "ఆలస్యం కాలేదనుకుంటాను ?"

ఆ మీాదట చబ్ బిగుతుగాఉన్న నడుం పటకా సరి చేసుకుని, తలమీాద టోపీ గట్టిగా అణిచిపెట్టుకుని కొరడా తీసుకున్నాడు. ఈ కొరడాచూస్తే ప్రయాసపెట్టే కుక్కలకు హడలు. ఆకాశంకేసి చూసి చబ్ మళ్ళీ ఆగిపోయాడు.

"అరే, దీం తస్సాగొయ్యా ! చూడు ! చూడు ! పానాస్ !"

"యేమిటి?" అని అడిగాడు అతని మిత్రుడు తనూ ఆకాశంవంక చూస్తూ.

"యేమిటీ? చంద్రుడేడీ?"

"అరే! నిజం, చంద్రుడు లేడే!"

"అదిగదీ సంగతి. లేడు." మిత్రుని చలించని ఉపేక్షా భావానికి నొచ్చుకుంటూ చబ్ అన్నాడు.

"నీకేం?"

"నేనుమాత్రం యేంచెయ్యను?"

"యేదో దెయ్యం," అన్నాడు చబ్ విూసాలు కోట చేతితో తుడుచుకుంటూ. "చేసిన పనేయిది. దానినోట్లో మన్నుపడ! మనల్ని యెగతాళి పట్టించాలనా ఆలోచన. లోపల కూర్చుని కిటికీలోనుంచి చూసా, బయట మనోహరంగావుంది. వెన్నెల, వెన్నెట్లో మంచు మెరిసిపోతోంది. పట్టపగలులా వుంది. కాని బయటికి అడుగు పెట్టేసరికి కళ్ళు పొడుచుకున్నా కనిపించడంలేదు.!"

చబ్ నసుగుతూ తిడుతూ చాలాసేపు ఏంచేయాలా అని ఆలోచించాడు. భాండారి ఇంటో తగని ఖాతాఖానీ కొట్టాలని ఉవిళ్ళూరిపోతున్నాడు. అప్పటికే మునసబు వచ్చి కూర్చుని ఉంటాడు. మంద్రస్వరంలోపాడే ఆ పాటకుడు, తారు వ్యాపారస్తుడు. మికిటాకూడా వచ్చేఉంటాడు. మికిటా పదిహేను రోజులకొక మారు వ్యాపారంమీద పోల్తావా వెళ్ళి వస్తూంటాడు. అతని హాస్యపు మాటలకి గ్రామస్తులు పొట్టలు చేత్తోపట్టుకుని విరగబడి నవ్వుతారు. చబ్ మనో నేత్రానికి మేజామీద ఘూటు ఘూటు వోడ్కా గోచరించింది. ఇదంతా ప్రలోభ పరుస్తోంది గాని చీకటి! చీకటి సోమారి తనంలోని పసందును జ్ఞప్తికి తెస్తోంది. కాళ్లు ముడుచుకున్న స్టోవ్మీద పడుకుని నింపాదిగా పైపుకాల్చుకుంటూ దివ్యమయిన నిద్రమగతలో కిటికీలకింద జట్లుజట్లుగాచేరిన 'బాల బాలికలు పాడేపాటలు, కొల్యాడ్కీ వింటూంటే ఎంత బావుండును! ఒక్కడేఅయితే ఆపని చేసేవాడే. కాని తోడు ఉన్నాడేమో చీకటిలోవెళ్ళినా భయం ఉండదు. అంతేగాదు

తాను పిరికివాడనీ సోమారిఅనీ నలుగురూ అనుకుంటే? తిట్టడం అయినాక మళ్ళీ మిత్రుడికేసి తిరిగి,

"ఊం- చంద్రుడు లేడన్నమాటేగా, నేస్తం!"

"లేడు."

"చిత్రంగావుందే! యేదీ ఒక్కపట్టు నశ్యం. నీ నశ్యం బలేబావుంటుంది, యెక్కడినించి తెస్తావ్?

"బలే బావుంటుందేం?" అని జవాబిచ్చాడు. అతని మిత్రం రావిబెరడు పొడుండబ్బా మూసివేస్తూ.

"ముసలమ్మలకి కూడా తుమ్మురాదు."

"నాకు జ్ఞాపకం" అన్నాడు చబ్. "సారా దుకాణాదారు జుజుల్యా ఒకమాటు నెజిన్‌నించి నశ్యం తెచ్చిపెట్టాడు యేంనశ్యం, యేంనశ్యం! బలే! అలావుండాలి. సరేగాని చీకటి, మరి?"

"యేవుందీ, యింటిదగ్గిర వుండిపోవడం మంచిదనుకుంటా" అని జవాబిచ్చాడు మిత్రుడు తలుపు పిడి పట్టుకుంటూ.

స్నేహితుడే గనక ఆమాట అనకపోయినట్లయితే చబ్ ఇంటిదగ్గర ఉండిపోవడానికి నిశ్చయించుకునేవాడే. కాని ఇపుడు అందుకు విరుద్ధంగా చేయమని ఏదో ప్రోద్బలపరిచింది.

"ఉహుం- నేస్తం, వెళదాంపద! ఉహుం- అదేంపనికి రాదు. వెళ్ళవలసిందే."

ఈ మాటలు అంటూనే అలా ఎందుకో అన్నామురా అని పశ్చాత్తాపం చెందాడు. అటువంటి రాత్రి కాలు కదపడం అత నికి ఏమాత్రం ఇష్టంలేదు. అయితే ఒకళ్ళ సలహామీద కాకుండా తన నిర్ణయంప్రకారం నడుచుకుంటున్నానని ఆత్మ సంతృప్తిమాత్రం కలిగింది.

అతని స్నేహితుడు చుట్టూచూసి కొరడాపిడితో బుజాలు గోక్కొని ఇంటోనయితేనేం బయట అయితేనేం అనుకునేవాడిలా మొహంలో ఏమాత్రం చీదర కనిపించనీయ లేదు.' స్నేహితులిద్దరూ బయలుదేరారు.

ఇక చెబ్ కూతురు ఆ అందగత్తె, ఒంటరిగా ఏం చేస్తోందో చూదాం. ఆమెకు పదిహేడో ఏడు రాకపూర్వమే డికాంకాకు ఆవేపునా ఈ వేపునా ఉన్న ప్రపంచమంతా ఆమె అందాన్ని గురించే చెప్పుకోసాగింది. ఆ గ్రామంలో ఇంత అందగత్తె ఇంతవరకు పుట్టలేదు, పుట్టబోదు అని ఏక కంఠంతో పలికారు. ఒకాసినా, ఆ అమ్మాయిపేరు, ఇదంతా వింది. అంతా గ్రహించింది. అందరి అందగత్తెల మనసు లాగానే ఆమెమనసూ సిలకడ లేనిది. గళ్ళలంగా బదులు శ్రీమంతురాలిలాగా వేషం వేసుకుంటే నౌకర్లను పెట్టు కోదు. ఇక కుర్రకారు ఆమె వెంట పడ్డారు. కాని విసుగెత్తి ఒకొక్కడూ ఆ టక్కులాడిమీద ఆశవదులుకొని ఆమె అంత అద్దాన్నంగాని ఆడపిల్లలవెంట పడ్డారు. ఒక్క కమ్మరికుర్ర వాడుమాత్రం, తక్కినవాళ్ళని లాగా తోసి రాజన్నా విర మించుకోలేదు.

తండ్రి బయటికి వెళ్ళగానే బాగా ముస్తాబయి సత్తు చట్రపు అద్దంముందు సవరించుకుంటూ చాలాసేపు గడిపింది ఒకాస్సెనా. తన్నుతాను వర్ణించుకోడానికి ఆమెకు మాటలు చాలలేదు.

"నేను అందగత్తెననేమాట నాలుగు మూలలా వ్యాపింపజేయాలని వీళ్ళకి యెందుకు బుద్ధి పుట్టిందో?" అనుకుంది పరధ్యాసగా, తనలోతాను ఏదో ఒకటి అనుకోవాలని. "అబద్ధం! నేనేం అందగత్తెనుకాను!"

కాని ఆ అద్దంలో ప్రతిబింబించిన ముహం నవనవలాడుతూ ప్రథమయవ్వనంతో, మెరిసిపోయే నల్లకళ్ళతో, మాటలకు అందక 'ఆత్మను ఉర్రూత లూగించే మనోహర మందహాసంతో నువు అందగత్తెవే, అందగత్తెవే!' అని చెప్తుతూంది.

"నా నల్లకనుబొమలు, నాకళ్లు" అంటూ ఇంకా కొనసాగించింది ఆ ఆందగత్తె అద్దంలోచూసుకుంటూ. "ప్రపంచంలోకల్లా అందమయినవా! నా మొనతేలిన ముక్కులో, పెదవుల్లో యేవంత అందంవుంది? నా నల్లటి జడలు సొగసుగా వున్నాయా? పొడుగాటి పాముల్లాగా నా తలచుట్టూ చుట్టుకుంటాయి. సాయంత్రంపూట చూస్తే యెవరికయినా భయంవేయక మానదు." అద్దం కొంచెం దూరంగా పట్టుకుని "అవునవును, నేను అందగత్తెనే, ఓ-ఏమందం, ఏమందం! అద్భుతం! నన్ను పెళ్ళాడేవాడు యెంత సంతోషిస్తాడో. నా భర్త యెంతగా పొగుడుతాడో? సంతోషంతో ఒళ్ళు మరిచేపోతాడు. వుక్కిరిబిక్కిరి అయేటట్టు ముద్దెట్టుకుంటాడు"

"బలే చిన్నది!" అనుకున్నాడు. మెల్లగా ఆ కమ్మరి కుర్రవాడు చప్పుడు చేయకుండా లోపలకు వస్తూ "కాస్త గర్వంకూడా తలకెక్కింది. గంటసేపటినించీ అద్దంలోచూసు కుంటూ అలాగే నిలబడివుంది. అడుగు కదపదు. పైగా బిగ్గరగా తన్నుతానే పొగుడుకుంటోంది!"

"మీ మొహాలకి నేనా? చూడండి!" అంటూ మళ్ళీ మొదలుపెట్టింది ఆ కులుకులాడి.

"ఎంత సొగసుగా అడుగువేస్తానో చూడండి! నా జాకెటుమీది యెర్రపట్టు బుటాలు చూడండి! తలమీది రిబ్బన్లు! ఓహో! మీ జన్మలో అంత అందమయిన జడ చూడలేరు. ప్రపంచంలోకల్లా చక్కనివాడికిచ్చి నన్ను పెళ్లి చేయాలని యివన్నీ మానాన్న కొనిపెట్టాడు." ఇలా అని కులుకుతూ వెనక్కి తిరిగేసరికి ఎదురుగుండా కమ్మరి కుర్రవాడు!

ఆమె కెవ్వుమని అతనికి ఎదురుగా ముభావంగా నిలబడింది.

కమ్మరి చేతులు నిరాశతో పక్కలకు వాలాయి.

ఆ అందగత్తె మొహంలో ఎటువంటి భావాలు వెల్లివిరిసాయో వర్ణించి చెప్పడం కష్టం. అందులో కాఠిన్యం, ఆ కాఠిన్యంలో కంగారుపడ్డ ఆ కమ్మరి కుర్రవాడంటే ఎగతాళి గోచరించాయి. అంతేగాదు కనిపించీ కనిపించని చిరాకు కూడా సున్నితంగా ఆమె మొహంలో పొడగట్టింది. ఈభావాలన్నీ మిళితమయి మాటలకు అందని అందాన్ని మొహానికి

చేకూర్చాయి. ఆ సమయంలో చేయదగిందల్లా ఓ లక్ష ముద్దులు ఆమెకు బహూకరించడమే!

"యెందుకు వచ్చావ్?" అంటూ ఒక్సానా ప్రారంభించింది. "మెడమీద కర్రవేసి బయటికి గెంటేయాలా? మహా తెలివిగలవాడివి. మొగాళ్ళు యింటోలేని సమయం నిమిషంలో కనిపెట్టేస్తావే! నీ సంగతి నాకు బాగా తెలుసు. సరే గాని నా పెట్టె తయారయిందా?"

"కిస్‌మిస్ పండగ దాటేసరికి తయారవుతుంది. అది తయారుచేయడానికి యెంత కష్టపడుతున్నానో నీకేం తెలుసు? బయటికి వెళ్ళకుండా యేకబిగిని రెండురాత్రిళ్ళు కార్ఖానాలో పని చేసాను. అంతెందుకు అటువంటి పెట్టె యెవరి దగ్గిరా లేదు. పోల్టావాలో ఆ అధికారి బగ్గీకి వేసిన యినపరేకుల కంటె శ్రేష్ఠమయిన రేకులు నీ పెట్టెకు వేసాను. ఇక రంగు వేస్తాను చూడు! నీ తెల్లటి చిరుపాదాలతో తిరుగుతూ యీ చుట్టుపట్ల ఎంత గాలించినా అటువంటి పెట్టె నీకు కనిపించదు. పెట్టెమీద ఎఱ్ఱనివి. నీలానివి పువ్వులు చిత్రిస్తాను. నిప్పులాగా వెలిగిపోవాల్సిందే! అందుకని నామీద కోపగించకు. నీతో కాస్త మాటాడనన్నా మాటాడనియ్, నీకేసి కాస్త చూడనన్నా చూడనియ్!"

"నీయిష్టం వచ్చినంతసేపు మాటాడచ్చు. నీయిష్టం వచ్చినంతసేపు చూడొచ్చు. యెవరూ అభ్యంతరపెట్టరు."

బల్లమీద కూర్చుని అద్దంలో మొహం మళ్ళీ తేరిపార జూసుకుని ఆమెజుట్టు సవరించుకోసాగింది. మెడ చూసుకుంది. ఎఱ్ఱపట్టు బుటాల కొత్తజాకెట్టు చూసుకుంది. ఆమె

పెదవులమీద, నవనవలాడే చెంపలమీద సంతృప్తి అతి లలితంగా గోచరించి నేత్రాలలో ప్రతిఫలించింది.

"నీపక్కన కూర్చోనిద్దూ!" అన్నాడు కమ్మరి.

"సరే, కూర్చో" అంది ఒక్సానా, ఆమె పెదవుల మీద, సంతృప్తనేత్రాలలో అదే ఉద్వేగం ఇంకా గోచరిస్తూనే ఉంది.

"బలే, అందాల ఒక్సానా, ముద్దెట్టుకోనా?" అన్నాడు కమ్మరికుర్రవాడు ధైర్యం పెంచుకుని. ఒక్కముద్దు కొట్టేద్దామనే ఆలోచనతో ఆమెను దగ్గిరికి లాక్కున్నాడు. అతని పెదవులు ఆమె చెంపను సమీపించాయి. ఆమె మొహం తిప్పేసుకుని అతనిని దూరంగా తోసేసింది.

"యింకేమన్నా కావాలా? తేనె కనిపిస్తే చాలు తాగాలనిపిస్తుంది! వెళ్లు. నీచేతులు చూసుకో, యినుం కన్నా గట్టిగా వున్నాయ్. నీ దగ్గిర పొగవాసన. నీవంటి మసి నాకూ యింత పూసినట్టున్నావు."

అద్దం తీసుకుని మళ్ళీ సవరించుకుంది!

"యీమె నన్ను ప్రేమించడం లేదు" అని కమ్మరి కుర్రవాడు తనలోతాను అనుకున్నాడు తల వంచుకుని. "పిచ్చి మొద్దులాగా యీమెముందు నిలబడి చూపు మళ్లించుకోలేకుండా నేనుంటే యీమెకు అంతా ఆటగావుంది. పిల్లికి చెలగాటం, యెలకకు ప్రాణసంకటం! చిత్రమయిన పిల్ల! యీమె మనసులో యేమున్నదీ, యెవరిని ప్రేమిస్తున్నదీ తెలుసుకోవడానికి యేంకావలిస్తే అది యిస్తాను. కాని

యీామె యెవరినీ ప్రేమిస్తున్నట్టు లేదు. తనుతానే మెచ్చు కుంటుంది. నన్నుమాత్రం వేధించుకుతింటోంది. యిక నాపనో, విచారంతో ప్రపంచమంతా శూన్యంగా కని పిస్తోంది. నే నీమెను ప్రేమించినంతగా యీా ప్రపంచంలో యింతవరకు యెవరూ యెవరినీ ప్రేమించలేదు, ప్రేమించ బోరు.”

“మీా అమ్మ మంత్రగత్తె అటగా? నిజమేనా?” అని ఒకాృనా నవ్వింది. కమ్మరి కుర్రవాడికి తనలో అణువణువూ నవ్వుతున్నట్లు అనిపించింది. ఆనవ్వు అతని హృదయంలో, నెమ్మదిగా జలదరించిన నరాలలో మారుమోగింది. అయినా మధురమధురంగా మందహాసంచేసే ఆమొహం ముద్దిడుకునే భాగ్యం లేకపోయిందే అని అతని ఆత్మ కొట్టుకుపోయింది.

“మాఅమ్మ యెలాపోతే నాకేం! నువ్వే నాకు తల్లివి. తండ్రివి. నాసర్వస్వానివి. వారే గనక నన్ను పిలిపించి ‘కమ్మరి వకులా, నా రాజ్యంలో వున్న దేదయినాసరే కోరుకో యిస్తాను! బంగారంతో కొలిమి, వెండి సమ్మెటలు చేయించి పెడతాను’ అంటే నేనేమంటానో తెలుసా? ‘నాకు నీ బంగా రపు కొలిమీా వద్దు, వెండి సమ్మెటలూ వద్దు, ఆఖరికి నీ రాజ్యమూావద్దు! నా ఓకాృనాను నాకు యిప్పించు. అంతే చాలు! అంటాను.”

“ఊం బలేవాడివే! మాానాన్న తెలివితక్కువవాడేం గాదు. మీాఅమ్మని పెళ్ళాడకుండా వుంటే నీకే తెలుస్తుంది!” అంది ఒకాృనా వికటంగా చిరునవ్వు నవ్వుతూ. “పిల్లలు యింకారాలేదు. యెందుకనో? యెపుడో కొల్యాడ్కి పాడడం

ప్రారంభించాల్సింది. కాచుకు కూచునీ కూచునీ విసుగెత్తు తోంది."

"పోనీ రాకుండా వుంటేనే మంచిది. అందాల చిన్న దానా!"

"ఉహుఁ - వాళ్ళతో పాటు మొగపిల్లలు కూడ వస్తా రనుకుంటా. అపుడుంటుంది తమాషా. యెటువంటి కథలు చెపుతారో నే నూహించుకోగలను."

"వాళ్ళతో సరదాగా గడపాలని వుందన్నమాట!"

"నీతోకంటె వాళ్ళతోనే యెక్కువ సరదాగా వుంటుంది. ఆఁ - యెవరో తలుపు కొడుతున్నారు. వాళ్ళే అయివుండవచ్చు."

"యిక నేనుండి లాభమేమిఁటి?" అని కమ్మరి కుర్ర వాడు తలపోసాడు." నన్ను వేళాకోళం చేస్తోంది. తుప్పట్టిన గుర్రపునాడం యెంతో యీామె దృష్టిలో నేనూ అంతే. అందుకని యితర్లుకూడా నన్ను చూసి నవ్వే అవకాశం యివ్వ కూడదు. నన్ను నాకంటె యింకెవరినయినా యెక్కువ ప్రేమిస్తున్నట్టు రూఢి అయితే వాడిని యీ ఛాయలకు రాకుండా చేస్తాను."

తలుపుకొట్టిన చప్పుడు, 'తెరు' అనేమాటపొగగొట్టంలో ఘుంగుమని అతని ఆలోచనలకు అంతరాయం కల్పించాయి.

"ఆఁ- వచ్చే" అంటూ కమ్మరి కుర్రవాడు బయటకు వెళ్ళాడు, విసుగెత్తి అక్కడ ఎవడుంటే వాడి పక్కఎముకలు విరగతన్నాలనె తలంపుతో.

చలి అధికమయింది. దెయ్యం చలిబాధ భరించలేక ఒక డొక్కమీదనుంచి ఇంకో డొక్కమీదకు ఉరుకుతూ, బిగుసుకుపోయిన చేతులకు వెచ్చగలిగించడానికి పిడికిళ్ళలోకి ఊదుకోసాగింది. దెయ్యం చలికి వణికిపోయిందంటే పెద్ద ఆశ్చర్యపడవలసిందేంలేదు. మనలోకంలో శీతాకాలంలో ఉన్నంతచలి నరకలోకంలో ఉండదు. దెయ్యం అక్కడ సాదావిడిగా తిరిగేదిగదా! నిజంగా వంటమనిషిలా టోపీ పెట్టుకుని పొయ్యిముందు కూర్చుని రైతువనితలు కిస్‌మిస్ పండుగనాడు మాంసంకూర వేయించినట్లు పోపులను పొయ్యి మీద వేయించేది.

వెచ్చటిదుస్తులు వేసుకున్నా మంత్రగత్తెకుకూడా చలివేసింది. అందుకని చేతులు పైకెత్తి, ఒంటికాలిమీద నిలచి, రెండోకాలు పైకెత్తి ఒక్కకండరంకూడా కదిలించకుండా పందెం వేసుకుని మంచుమీద జారేవానిలాగా భంగిమం పట్టి, మంచు సులోబీకిందకు జారినట్లు గాలిలోనుంచి తన ఇంటి పొగగొట్టంలోపలికి జారింది.

దెయ్యంకూడా ఆవిధంగానే ఆమెను అనుసరించింది. కాని అది చాలా చురుకయిందేమో పొగగొట్టంమీదికి చేరేసరికి ఆ మంత్రగత్తె మెడమీద వచ్చిపడింది. ఇద్దరూ పొగగొట్టంలోనుంచి కుండలమధ్యఉన్న గాడిపొయ్యిలోకి దిగారు.

మంత్రగత్తె గాడిపొయ్యి తలుపుతీసి తనకొడుకు వకులా ఎవరినయినా కొంపకు తీసుకువచ్చాడేమోనని దొంగచాటుగా చూసింది. నేలమీద బస్తాలు తప్ప ఇంకేమీ కనిపించక పోయేసరికి పొయ్యిలోనుంచి బయటికివచ్చి వెచ్చని కోటు

తీసి పారవేసి, సవరించుకుంది. నిమిషంముందు ఆమె చీపురు కట్టమీద స్వారీ చేసిందని ఎవరూ గ్రహించలేనంతగా మారి పోయింది.

వకులా తల్లికి నలభై ఏళ్ళకంటె ఎక్కువ ఉండవు. ఆమె అందగత్తెకాదు, కురూపీకాదు. అంత వయసులో అందంగా వుండడం సాధ్యంకాదు. నిజమే! కాని ఎంతటిగట్టి మనసు కోసక్ నయినా మరులుకొలపడంలో అందెవేసిన చేయి. అసలు కోసక్ లకు అందచందంతో పనిలేదు. గ్రామ పెద్ద సబు, చర్చిబాండారి ఓసిల్ నికి ఫారోవిచ్, (అదయినా నా భార్య ఇంటిదగ్గర లేనపుడు), కోసక్ కోర్నిచబ్, కోసక్ కాస్వాన్ స్వేర్చిగుజ్ ఆమెకోసం వస్తూండేవారు. అంతేగాదు ఒకడూ ఆమెను తానుగాక ఇంకో ప్రియుడు ఉన్నాడని కలలోకూడా అనుమానించకుండా నేర్పుగా ఆమె వారితో నిర్వహించుకు వస్తోంది. ఎంతపెద్దమనిషి అయినా చేతుల్లేని పడుగునోటు తొడుకుని ఆదివారంనాడు చర్చికి వెళ్ళేటపుడు, వాతావరణం బాగుండకపోతే చర్చికివెళ్లే బదులు సారా దుకాణానికి వెళ్ళేటపుడు సోలోఖా (మంత్రగత్తె పేరు) ను దర్శించుకుని, వెన్న, ఆవడలు మెక్కి కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి మరీవెళ్లేవాడు. ఇక కోసక్ లు చుట్టుతిరిగి ఆమె ఇంటిమీదుగా సారా దుకాణానికి వెళుతూ, 'యేదో దోవబోతూ' ఆమె దర్శనం చేసుకునేవారు. సోలోఖాగళ్ళ లంగా కట్టి దానిమీద బంగారు చుటాలు కుట్టిన ముదురు నీలి లంగా ఇంకొకటి వేసుకుని చర్చికివెళ్ళి పాటకులకు దగ్గిరిగా కుడిపక్కన నిలబడినపుడు బాండారి తప్పకుండా దగ్గి ఆమెకేసి కళ్ళు కుంచించుకుచూసే

వాడు. గ్రామ మునసబు మీసాలు సవరించుకునేవాడు. చెబ్ వెనక పిలకతిప్పి పక్కనున్న వారితో 'ఓ- నిజమయిన ఆడది. బలే ఆడది !' అనేవాడు. సొలోఖా ప్రతి ఒక్కరికీ వంగి నమస్కరించేది. పాపం పిచ్చివాళ్ళు. ప్రతిఒక్కడూ ఆమె తన ఒక్కడికే నమస్కరించిందని అనుకొనేవాడు.

ఇతరుల వ్యవహారాలలో తలదూర్చాలని కుతూహల పడేవారందరికీ కోసక్ చబ్ మీద సోలోఖా ఎక్కువ అను గ్రహం చూపేదని ఇట్టే తెలిసిపోతుంది. చబ్ విధురుడు. ఎనిమిది బస్తాల ధాన్యం ఎప్పుడూ అతని కుటీరంముందు పడి ఉంటాయి. రోడ్డుపక్కన కొట్టాంలోంచి బలిష్టమయిన ఎడ్లజతలు రెండు తలలను బయటపెట్టి తను ప్రాణస్నేహితుడో, ఆవో బాబాయో అటువెళ్ళినపుడల్లా అరిచేవి. ఒక గడ్డం మేకపోతు ఇంటిపై కప్పుమీదికి ఎక్కి పెరడులో ఎత్తెత్తి అడు గులు వేసుకుంటూ తిరిగే సీమకోళ్ళను వెక్కిరించడానికా అన్నట్టు మేయరులాగా బొంగురుగొంతుకుతో 'మా' అని అరుస్తూంటుంది. దాని గడ్డాన్ని వేళాకోళం పట్టించే బాలుడు కనిపించాడా వెనుదిరిగేది. చబ్ పెట్టెలలో కావలసి నంతగుడ్డ, కోట్లు, బంగారపు లేసుకుట్టిన పాతకాలపుదుస్తులు ఉన్నాయి. అతని భార్యకు మంచి మంచి దుస్తులంటే అమిత మమకారం వంటింటితోటలో పోస్తు, కాబేజీ, పొద్దుతిరు గుడు పువ్వులేగాక ప్రతి సంవత్సరం రెండు మళ్ళల్లో పొగాకు వేసేవాడు. ఇదంతా తన ఆస్తిలో కలిపేసుకోవడం తప్పుగా దని ఆమె భావించింది. తన చేతికి ఆస్తి అంతా వస్తే ఇంకా ఎంతబాగుపడ్డును అనుకుని ముసిలిచబ్ మీద పూర్వాంకంటె

రెట్టింపు అనుగ్రహం చూపసాగింది. తన కొడుకు వకీలా అచబ్ కూతురిని పెళ్ళాడి ఆ ఆస్తినంత తన స్వంతం చేసుకో కుండా చేయాలనే ఉద్దేశంతో (వకులా ఆమెను ఏ విషయం లోనూ జోక్యం చేసుకోనీయడని అమెకు తెలుసు) సామాన్యంగా వయసుపైబడిన స్త్రీలు అవలంబించే విధానమే అవలంబించింది. సాధ్యమయినపుడల్లా చెబ్ కి తన కొడుకుకి కజ్జా పెట్టింది. బహుశా ఈ జిత్తులమూలంగానే గ్రామంలోని ముసలమ్మలు ఏ పండగకో పబ్బానికో తెగతాగినపుడు సాలోఖా మంత్రగత్తె అని చెప్పుకునేవారు. కిజ్యేలు పెంకో అనే కుర్రవాడికి పంటకోల అంత పొడుగుతోక ఆమెకు వెనక కనిపించిందట! ఇటీవలనే అంటే మొన్నటి గురువారంనాడు నల్లపిల్లి రూపంలో ఆమె రోడ్డుకు అడ్డంగా పరుగెత్తిందట! ఇంకోమాటు ఫాదరీ భార్యాదగ్గిరికి పరుగెత్తుకుంటూ వెళ్ళి కోడిలాగా కూసి, ఫాదరీ కొంగ్రాట్ టోపీ ఆమె నెత్తిమీద పెట్టి మళ్ళీ పరుగుచ్చుకుని వెళ్ళిపోయిందట!

ముసలమ్మలు ఇలా మాట్లాడుతూండగా టిమిష్ వారొస్త్యావి అనే గొడ్లకాపరి అక్కడికి వెళ్ళడం తటస్థించింది. వేసవిలో ఇంత గడ్డి తలకింద పెట్టుకుని నిద్రపోదామని గొడ్లసావడిలో పడుకుని ఉండగా మంత్రిగత్తె తల విరబోసుకుని లంగామాత్రం కట్టుకుని ఆవులను పాలు పితుకుతూ వాడికి కన్పించిందట! కదలలేకపోయాడు. మంత్రించినట్లు అయిపోయాడు. ఆ మంత్రగత్తె అతని పెదవులమీద ఏదో అసహ్యమయిన పదార్థం పూసింది. ఆ రోజల్లా ఒకటే ఉమ్మి! కాని వీళ్ళు చెప్పినదంతా అనుమానాస్పదమే. సొరొచిచెట్సు

సుంకాధికారికి ఒక్కడికే మంత్రగత్తె కనిపిస్తుంది. అందుకని ఈ కాకమ్మ కథలు విని కోసక్ పెద్దలు ఓర్పుపట్టలేక చేతులు ఊపుతూ "పచ్చి అబద్ధాలు ఆడుతున్నారు, లంజెలు!" అనడం మామూలు.

స్టోలోవ్ నుంచి బయటకుపాక్కుంటూ వచ్చి, సవరించుకుని సోలోఖా ఇల్లు శుభ్రంగా ఊడ్చి అన్నీ సర్దింది. కాని బస్తాలనుమాత్రం ముట్టుకోలేదు. 'వాటిని వకులాలోపలికి తెచ్చాడు. వాడే వాటిని బయటకు తీసుకుపోతాడు. నాకేం పట్టింది!' అనుకుంది. పొగగొట్టంలోకి దూకుతూ దెయ్యం వెనకకు తిరిగిచూసింది. చూసేసరికి చబ్, అతని పొరుగింటి ఆసామి ఒకరిచేతులు ఒకరు పట్టుకుని వారి ఇంటికి చాలా దూరంలో కనిపించారు. కనిపించగానే దెయ్యం పొగ గొట్టం లోనుంచి బయటికి ఎగిరి, వారి దారిని అడ్డగించి పేరుకున్న మంచుకుప్పను పైకి ఎగరగొట్టసాగింది మంచువాన కురిసింది. ఏదిచూసినా తెలుపే! ముందూ వెనకా మంచు సుళ్ళు తిరిగింది. ఆ స్నేహితు లిద్దరికళ్ళూ, నోళ్లు, చెవులు మంచుపడి మూసుకుపోయే ప్రమాదం తటస్థించింది. 'చబ్ తన స్నేహితుడితో ఇంటికి తిరిగి వెళ్ళిపోతాడు, అక్కడ కమ్మరి కుర్రవాడు తారసిలతాడు, తారసిలగానే చబ్ వాడి మక్కలు విరగగొడతాడు. యింతలో కమ్మరి కుర్రవాడు కుంచె పుచ్చుకుని వెధవ వ్యంగ్య చిత్రాలు గీయలేడు' అనే గట్టినమ్మకంతో దెయ్యం తిరిగి పొగగొట్టంలో ప్రవేశించింది.

మంచువాన కురుస్తూ గాలివచ్చి మొహాలకి కొట్టుకునేసరికి చబ్ ఎందుకు బయలుదేరామా అని పశ్చాత్తాపించి

నెత్తిమీది ఉన్నిటోపి మొహంమీదికి లాక్కుంటూ తన్ను, తన స్నేహితుడిని, దెయ్యాన్ని తిట్టిపోసాడు. కాని బాధ పడుతున్నట్టు నటించాడేగాని నిజంకాదు. మంచుతుపాను రావడం అతనికి సంతోషదాయకంగానే ఉంది. బాండారి ఇంటికి చేరుకోవాలంటే వచ్చిన దూరంకంటె ఇంకా ఎని మిది రెట్లు దూరం వెళ్లాలి. అందుకని ఇద్దరూ వెనకకు తిరి గారు. గాలివచ్చి వారి తలలవెనక కొడుతోంది. సుళ్ళు తిరుగుతున్న మంచులో వారి కేమీ కన్పించడంలేదు.

“ఆగు, నేస్తం! దోవ తప్పినట్టున్నాం!” అన్నాడు చబ్ కొద్ది అడుగులువేసి, “ఒక్క గుడిసా కనిపించడంలేదు. అరె! ఎటువంటి మంచుతుపాను! అటు కాస్త వెళ్ళి రోడ్డు కనిపిస్తుందేమోచూడు, నేను యీవేపున చూస్తాను. యిటు వంటి తుపానులో బయటకి రావడమేమిటి బుద్ధిలేకగాని, సరే, రోడ్డు కనిపిస్తే పిలు. మరిచేబోకు, అరె! కళ్ళల్లోకి వచ్చి ఎంత మంచుపడిందనుకున్నావ్!”

రోడ్డు కనిపించలేదు. చబ్ స్నేహితుడు ఎత్తుబూట్లతో అటూ ఇటూ తిరిగీ తిరిగీ సరాసరి సారాదుకాణం చేరు కున్నాడు. ఇంకేం అదృష్టం కలిసివచ్చిందనే సంబరంతో అంతా మరిచేబోయి, మంచును దులిపివేసుకుని, మిత్రుడు విషయం ఏమాత్రం పట్టించుకోకుండా సారాదుకాణంలోకి చొరబడ్డాడు. ఈ లోపల చబ్ రోడ్డు కనిపించిందనే భ్రమతో ఆగి గొంతెత్తి స్నేహితుడిని పిలిచాడు. స్నేహితుడు రాక పోయేసరికి ఒంటరిగానే వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. కొద్దిదూరం నడిచేసరికి అతని కుటీరం కనిపించింది. దాని

కప్పుమీాద మంచుపెళ్లులుపడి ఉన్నాయి. బిగుసుకుపోయిన చేతులు చరుచుకుని తలుపుతట్టుతూ తెరవమని గట్టిగా కేకలు వేస్తూ కూతురిని పిలిచాడు.

"యేంకావాలి?" అంటూ డబాయించాడు కమ్మరి కుర్రవాడు బయటికివస్తూ.

చబ్ కమ్మరికుర్రవాడిని గుర్తుపట్టి ఒకడుగు వెనకకు వేసి, "అయితే యిది నా గుడిసె కాదన్నమాట!" అని తనలోతాను అనుకున్నాడు. "యిది నా గుడిసే అయితే యీా కమ్మరాడు వచ్చేవాడుగాదు. కాని బాగా పరిశీలనగాచూస్తే యిది కమ్మరివాడిదీ కానట్టుంది. మరి యెవరిదయివుంటుంది? ఆఁ- తెలిసింది. గుర్తు పట్టలేకపోయాను. యిది ఆకుంటి లెవ్ చెంకో గుడిసె. యీామధ్య పడుచుపిల్లను పెళ్ళాడాడు. నా గుడిసెవంటి గుడిసె వీడి ఒక్కడికేవుంది. నేనింత తొందరగా కొంపకి చేరుకోవడం చిత్రంగానేవుంది. కాని లెవ్ చెంకో యిపుడు బాండారి యింట్లో వుంటాడు. అయితే యీా కమ్మరివాడు యిక్కడికి యెందుకు వచ్చినట్టు? ఆఁ- పడుచు పిల్లని చూస్తానికి వచ్చివుంటాడు. అదిగదీ సంగతి! సరే, అర్ధమయింది."

"యెవరు నువ్వు? యిక్కడ తచ్చాడుతున్నావెందుకు?" అని ఆ కమ్మరి కుర్రవాడు ఇంకా గట్టిగా డబాయించాడు, దగ్గిరికి వెళుతూ.

"నే నెవడినో వీడి కెందుకు చెప్పాలి?" అనుకున్నాడు చబ్ "లొంజకోడుకు, నన్ను పట్టుకు చితకదన్నొచ్చు." ఇలా

అనుకుని గొంతుమార్చి "నేనే, యేదో మీా కిటికీలకింద కొల్యాడ్కి పాడదామని వచ్చా" అన్నాడు.

"కొల్యాడ్కీనీ నిన్నూ తగలేయా!" అని గద్దించాడు కమ్మరి కుర్రవాడు కోపంతో. "యిక్కడ నిల్చున్నావేం ? వినపడలా ? పోపో."

చబ్ కి చల్లగా జారుకోవాలనే ఉంది. కాని ఆకమ్మరి కుర్రవాడిమాటలకి తల వొగ్గవలసిరావడం కష్టం కలిగించింది.

"యెందుకట్లా గొంతుచించుకుంటావ్ ?" అదే కృత్రిమ స్వరంతో అన్నాడు. "కొల్యాడ్కి పాడాలని వచ్చాను. అంతే ?"

"ఒహో ! మాటలతో లాభంలేదన్నమాట !" ఆ తరవాత చబ్ బుజంమీాద గట్టిగా దెబ్బతగిలి నెప్పి పుట్టింది.

"కజ్జాకి దిగుతున్నావే ?" అన్నాడు చబ్ ఒక అడుగు వెనకకువేసి.

"పో, పో !" అంటూ కమ్మరి కుర్రవాడు చెబ్ ను ఇంకోతోపు తోసాడు.

"యేవిటీపని ?" అన్నాడు చబ్. అతని స్వరంలో బాధ, భయం, విచారం ధ్వనించాయి. "నిజంగానే కజ్జా పెట్టుకోదలిచావన్నమాట. సరే. గట్టిగా కొట్టావు."

"పో, పో !" అని అరిచి కమ్మరి కుర్రవాడు తలుపు వేసేసాడు.

"గట్టిగాదబాయించాడే!" అనుకున్నాడు చబ్ బయట ఇంటరిగా నిలబడి. "దగ్గిరికి వెళ్ళితే యింకేమన్నా వుందా!

వెధవ! తనేదో గొప్పవాడినని అనుకుంటున్నాడు. ఫిర్యాదు చెయ్యలేననుకున్నావా? తిన్నగా కమిసార్ దగ్గిరికి వెళతాను. బుద్ధి చెప్పిస్తాను. నువు కమ్మరివి. ముచ్చెవాడివి అయితే నాకేం? వీపు, బుజాలు చూసుకోవాలి. కమిలిపోయినట్లు న్నాయి. వెధవ! గట్టిగా దంచినట్లున్నాడు, చలిగా వుంది. కోటు తీసేయాలనిలేదు. సరేలే, కాచుకో, కమ్మరి వెధవా! నీవూ నీకొలిమి మండిపోను! నిన్ను ఒకఆట ఆడిస్తాను, చూడు. వీడు యింటికి వెళ్ళివుండడు. సొలోఖా యిక్కడే వుంటుంది. ఊఁ! – అట్టేదూరంలేదు. వెళ్ళడం మంచిది. యీతుఫానులో యెవరూ అక్కడికి వచ్చి చావరు. అవకాశం దొరకొచ్చు – అబ్బ! వెధవ కమ్మరాడు చచ్చే దెబ్బకొట్టాడు!"

వీపు నిమురుకుంటూ చబ్ ఇంకోవేపు బయలుదేరాడు. సొలోఖాని ఒంటరిగా కలుసుకునే అవకాశం చిక్కిందనే సంతోషంలో నెప్పి కొంచెం తగ్గింది. తుపాను హోరు మంటోంది. అన్ని రోడ్లమీదమంచు పెళ్ళుపెళ్ళు మంటోంది. అయినా అతనికి మంచు అనిపించలేదు. ముక్కుపట్టుకుని మంగలి గడ్డానికీ మీసానికీ సబ్బు పులిమినప్పటికంటె తొందరగా తుపాను మంచుపులిమినా అతని మొహం మధ్య మధ్య వెగటు కొలిపేటంత ఇంపుగా ఉంది. కాని మంచు లేగడంగా ఏదీ గోచరించలేదు గాని, లేకపోతే చబ్ ఆగి వీపు నిమురుకుంటూ 'వెధవకమ్మరివాడు చచ్చేదెబ్బ కొట్టాడు' అని చాలాసేపు గొనుక్కుకు తిరుగుదారి పట్టడం అందరికీ కనిపించేది.

మేకగడ్డం, తోకదెయ్యం పొగగొట్టంలోనుంచి బయటికి ఎదిగి తిరిగిరావడంలో పక్కపటకాను వేలాడుతున్న సంచి దేనికో తగిలి తెరుచుకుంది. దానిలో ఉన్న చంద్రుడు ఇదే తగినసమయం అనుకుని పొగగొట్టంలోనుంచి ఎగిరి ఆకాశంలోకి చక్కాబోయాడు. ఇంకేం పిండారబోసినట్లు వెన్నెల! అసలు మంచుతుపాను పట్టినట్టే అనిపించలేదు. మంచు తళతళా మెరిసిపోతోంది. నక్షత్రాల్లాంటి స్ఫటికాలు పొదిగిన తెల్లటి మైదానంలా ఉంది, సర్వప్రపంచం! చలి తగ్గింది. సంచులు పట్టుకుని బాలబాలికలు గుంపులు గుంపులుగా బయలుదేరారు. సంగీతం హోరెత్తుతోంది. ప్రతి కిటికీకింద కొల్యాడ్కి పాటకులు గుంపుగా చేరారు.

వెన్నెల ఎంత దివ్యంగాఉంది! నవ్వుతూ పాడుతూ విహరించే బాలికలతో, ఉల్లాసంగా మందహాసం చేసే నిశాకాంత సూచించే కొంటెచేష్టలకు సన్నద్ధులయే బాలురతో జతకట్టడం ఎంత సంతోషంగా ఉంటుంది! పై ఉడుపులకింద వళ్ళు వెచ్చగాఉంది. మంచు కప్పినప్పటికంటె చెంపలు ఇంకా మెరిసిపోతున్నాయి. అటువంటపుడు జిత్తులమారి దెయ్యం ఏదో కొంటెచేష్ట చేయమని ప్రోత్సహిస్తుంది.

సంచులు పట్టుకుని బాలికలు గుంపులు గుంపులుగా చబ్ కుటీరంలోకి చొరబడి ఒక్సానాచుట్టూ చేరారు. కేకలు, నవ్వులు, కథలతో కమ్మరి కుర్రవాడి చెవులు గింగురుమన్నాయి. ఆ అందగత్తెకు ఊళ్లో కబుర్లన్నీ చెప్పారు. సంచులువంచి ఖాళీచేసి పాటలుపాడి తాము సంపాదించిన రొట్టెముక్కలు, కూరలు, ఆవడను చూపించారు. ఒక్సానాను

సంతోషించినట్టే కనిపించింది. వరసగా అందరితోనూ మాటా డింది. ఎడతెగకుండా నవ్వింది.

ఇక కమ్మరి కుర్రవాడికి ఈ వేడుకలు అసూయను రగిల్చాయి. విసుగెత్తింది. కొల్యాడ్కీ పాటలు పాడడం అత నికి ఎంత ఇష్టమయినా వాటిని ఇంత తిట్టిపోసాడు.

"ఓ ఒడార్కా !" అని పిలిచింది ఆ అందగత్తె ఒక బాలిక కేసి తిరిగి, "నీ ముచ్చెలు కొత్తవిలాగున్నాయే. ఓ - యేమందం ! పైన బంగారంపూత కూడానూ ! అదృష్టవంతు రాలివి, ఒడార్కా ! నీకు కావలసిందల్లా కొనిపెట్టే మొగాడు దొరికాడు. అటువంటి ముచ్చెలు నాకు కొనిపెట్టేవాడేడీ?"

"మరేం విచారపడకు, ఒక్సానా !" అన్నాడు కమ్మరి. "అపురూపమయిన ముచ్చెలు తెచ్చి నీకు సమ ర్పించుకుంటా !"

"నువా ?" అంది ఒక్సానా, అతనివంక కోపంతో వేగంతో చూస్తూ. "నా పాదాలకు తగిన ముచ్చెలు యెక్కడ తేగలవ్ ? జారినా తొడుక్కునే ముచ్చెలే పట్టుకు వస్తా వనుకుంటా !"

"యెటువంటి కోరికో, అమ్మాయికి !" అంటూ బాలి కలు నవ్వారు.

"అవును !" అంది ఆ అందగత్తె గర్వంతో. "మీరంతా సాక్ష్యం ! యీ కమ్మరి కుర్రవాడు వకులాంటే గనక జారినా తొడిగే ముచ్చెలు తెచ్చి నాకిస్తే, యిదిగో ప్రమాణం చేస్తున్నా, ఆరోజునే యితడిని పెళ్ళి చేసుకుంటా!"

ఆ చపలచిత్తతో కలిసి బాలికలు బయటకు వెళ్లారు.

"సరే నవ్వండి, యేంచేస్తాం !" అనుకున్నాడు కమ్మరి కుర్రవాడు వారివెనకే బయటికి వెళుతూ. "ననుచూసి నేనే నవ్వుకుంటున్నా. యింత తెలివితక్కువ దద్దమ్మ నయిపో యానేం? నామీద దానికి ప్రేమలేదు. లేకపోతేనేం? యీ ప్రపంచంలో ఒక్సానాతప్ప అందగత్తెలు యింకెవరూ లేరా యేం? ఆమాటకొస్తే యీవూళ్ళో అంత అందగత్తెలు సవా లక్షమంది వున్నారు. అసలు ఒక్సానా యెంత, దాని అంద మెంత? పైగా సంసారం దిద్దుకోవడం యెలాగో దీనికి తెలీదు. తెలిసిందల్లా బాగా ముస్తాబు చేసుకోవడం! యిక కట్టిపెట్టే యాలి. నవ్వులపాలు గాకుండా జాగర్త పడాలి!"

ఈవిధంగా కమ్మరి కుర్రవాడు గట్టిగా నిలబడాలని నిశ్చయించుకుంటూంటే, ఏదో దెయ్యంలాంటిది 'జారినా ముచ్చెలు తీసుకురా, నిన్ను పెళ్ళి చేసుకుంటా' అని నవ్వుతూ అపహాస్యం చేసినప్పటి ఒక్సానా రూపం అతని కళ్ళముందు తారాడేటట్టు చేసింది. అతనిలో అణువణువు చలించింది. ఒక్సానాను గురించి తప్ప వేరే ఆలోచన పోలేదు.

కొల్యాడ్కీ పాటకుల గుంపులు, ఒక జట్టులోనుంచి బాలురు, ఇంకో జట్టులోనుంచి బాలికలు, వీధివీధీ తొందరతొందరగా తిరగసాగారు. కాని కమ్మరి కుర్రవాడు మాత్రం ఒకప్పుడు అందరికంటె ఎక్కువ సరదాపడ్డా ఇప్పుడు మాత్రం ఆ వేడుకలలో చేరలేదు.

ఇక సోలోఖా గుడిసెలో దెయ్యం సరసాలకి దిగింది. సుంకాధికారి ఫాదరీ కూతురి చేతిని దర్జా ఒలకిస్తూ ముద్దు

పెట్టుకున్నట్లుగా దెయ్యం సాలోఖాచేయి ముద్దు పెట్టుకుంది. గుండెమీద చేయివేసుకొని నిట్టూర్చి తన 'కోరికతీర్చి ప్రేమకు ప్రతిఫలం ముట్టచెప్పకపోయినట్లయితే దేనికయినా తయారే - నీళ్ళల్లోపడి ఆత్మని తిన్నగా నరకలోకంలోకి పంపించేస్తాను' అని మొండిగా చెప్పింది. సాలోఖా కూడా ఏమంత కఠినురాలుకాదు. పైగా దెయ్యం ఆమెతో చేతులు కలిపి పనిచేసిందాయె. చుట్టూ నలుగురిని తిప్పుకోవాలని ఆమెకి సరదా. ఎవరో ఒకరు పక్కన లేకుండా ఉండేదికాదు. అసాయంకాలం గ్రామంలోని ప్రముఖులంతా బాండారి ఇంటికి వెళతారు. ఒంటరిగా ఉండాలే అనుకుంది. కాని అలా జరగలేదు. దెయ్యం అలా మొరపెట్టుకుందో లేదో హఠాత్తుగా తలుపు కొట్టిన చప్పుడు, గ్రామమునసబు గొంతు వినిపించాయి. సాలోఖా తలుపు తీయడానికి పరుగెత్తింది. ఇక జిత్తులమారి దెయ్యం నేలమీద పడిఉన్న గోనెసంచెలో దూరింది.

గ్రామమునసబు, టోపీమీది మంచు దులిపివేసుకుని, సాలోఖా స్వయంగా ఇచ్చిన వోడ్కా తాగి, 'మంచు తుపాను మూలంగా బండారి ఇంటికి వెళ్ళడం పడలేదు. నీ గుడిసెలో దీపం కనిపించేసరికి యీ సాయంత్రం నీతో గడుపుదాంగదా అని వచ్చాను' అని చెప్పాడు.

గ్రామమునసబు ముగించాడో లేదో మళ్ళీ తలుపు కొట్టిన చప్పుడు, బాండారి గొంతు వినిపించాయి.

"నన్నెక్కడయినా దాచిపెట్టు" అన్నాడు గ్రామ మునసబు మెల్లిగా "యిప్పుడు బాండారికి కనిపించడం మంచిది కాదు."

అంత బొద్దుమనిషిని ఎక్కడ దాచడమాఅని సొలోఖా కొంతసేపు ఆలోచించి, పెద్ద బొగ్గులసంచి తగిపోతుందని నిశ్చయించి బొగ్గులు పీపాలో పోసింది. గ్రామమునసబు, మీసాలు, టోపీ, పై ఉడుపులతోసహా ఆ సంచిలోకి దూరాడు.

గొంతు సవరించుకుంటూ, చేతులు రుద్దుకుంటూ బాండారి లోపలకు దయచేసాడు. 'ఎందుకు ఒక్కడూ రాలేదు. నిన్ను చూసే అవకాశం చిక్కినందుకు చాలా సంతోషంగా వుంది. మంచుతుపాను చూసి నేను భయపడలేదు,' అని చెప్పాడు. ఆ తరవాత ఆమెకు దగ్గిరగా వెళ్ళి దగ్గి, వికారంగా నవ్వి, పొడుగాటి వేళ్ళతో ఆమె బొద్దుబోసి చేతిని తాకి చమత్కారం సంతృప్తి రెంటినీ వెల్లడించే ధోరణిలో అన్నాడు:

"యిక్కడేవుంది సోలోఖా ?" ఇలాఅని ఒకడుగు వెనకకు వేసాడు.

"యేమిటా ? నాచేయి ఓసిప్ నికి ఫొరోవిచ్ !" అని జవాబిచ్చింది.

"ఓ-నీచేయి ! హేహేహే!" అంటూ నవ్వాడు బాండారి. సంభాషణ బాగా మొదలుపెట్టానని అపరిమితానందంతో గదిలో అటూఇటూ పచార్లు కొట్టాడు.

"యిక్కడేవుంది. సొలోఖా ! రత్నాల భరిణా !" అని ఆడిగాడు అదే ధోరణిలో, ఆమెకు దగ్గిరసా వెళ్ళి సుతిమెత్తనగా ఆమెమెడ తాకి మళ్ళీ వెనకకు దుమికి.

"పాపం! నీకు కనిపించనట్లు? ఓసప్ నికి ఫొరోవిచ్!" అని జవాబిచ్చింది సొలోఖా.

"నా మెడ, మెడలో హారం!"

"హుం - మెడలో హారం! హేహేహే!" అలా అని భాండారి చేతులు రుద్దుకుంటూ గదిలో మళ్ళీ పచార్లు చేసాడు.

"యిక్కడేవుంది? సొలోఖా! సౌందర్య దేవతా!" పొడుగాటి వేళ్ళతో ఏమి తాకేవాడో చెప్పలేంగాని ఇంతలో తలుపుకొట్టిన చప్పుడు, కోసక్ చబ్ గొంతు వినిపించాయి.

"ఆరి దేవుడా, పానకంలో పుడకలా వీడెవడో దాపరించాడు!" అన్నాడు భాండారి భయంతో. "యిక్కడే గనక పట్టుబడితే? అందులోనూ యింత హోదావాణ్ని! ఫాదర్ కొన్ద్రాట్ చెవిని పడకుండా వుంటుందా? కొంప మునుగుతుంది."

కాని నిజానికి భాండారి భయానికి కారణం ఇది కాదు. తన చేష్టలు తన అర్ధాంగికి తెలిసిపోతాయేమోనని అసలు భయం. ఇప్పటికే సగం జుట్టు ఊడగొట్టింది!

"నీకు పుణ్యముంటుంది, సొలోఖా! పుణ్యాత్మురాలా!" అంటూ మొదలుపెట్టాడు నిలువెల్లా వణికిపోతూ. "లోకాసువార్త అధ్యాయం ముప్ఫయి - అదుగో మళ్ళీ తలుపు కొడుతున్నారు! తలుపు కొడుతున్నారు! యెక్కడయినా దాచిపెడుదూ!"

సాలోఖా ఇంకో బొగ్గులసంచి ఖాళీచేసింది. బాండారి, పెద్ద లావుకాదుగా, సునాయాసంగా ఆ సంచిలోదూరి అడుగున బైఠాయించాడు. అతనిమీద ఇంకా అరబస్తా బొగ్గు తేలికగా పడుతుంది.

"సాలోఖా!" అంటూ లోపలికి చక్కావచ్చాడు చబ్. "నేను వస్తానని అనుకోలేదుగదూ నువ్వు. అవును. అనుకోలేదు. అనుకున్నావా? నేను అడ్డం రాలేదుగదా!" అంటూ ప్రారంభించాడు చబ్. మొహం హుషారుగా, భావగర్భితంగాఉండి, ఏదో వ్యంగ్యంగా, ఉల్లాసంగా పరియాచకమాడాలని అతను మనసు తయారు తింటోందని సూచిస్తోంది. "బహుశా యెవరో సరసుడితో కులాసాగా గడుపుతున్నట్టు న్నావ్? యీపాటికి దాచేసి వుంటావులే, యేం?" తన మాటలకు తనే సంతోషించుకుంటూ చబ్ నవ్వాడు. తను ఒకడే ఆమె అనుగ్రహానికి పాత్రడనయానని పాపం! మన సులోగర్వం! "సరేగాని, సాలోఖా! యేదీ కాస్త వోడ్కా తెచ్చివ్వు. యీ వెధవ చలికి నాగొంతుక మూసుకుపోయినట్టుంది. కిస్మిస్ పండుగకి యిలాంటి మంచేవిటి? అబ్బ! యేంమంచు! యేంమంచు! సాలోఖా! నా చేతులు బిగుసుకుపోయాయి. కోటు గుండీలు వూడదీసుకోలేకపోతున్నా. అబ్బ! యేంమంచు!"

"తలుపు తెరు" అని వీధిలో ఒకగొంతు ఖంగుమంది. గొంతువెంబడే తలుపుకొట్టిన చప్పుడు వినిపించింది.

"యెవరో తలుపు కొడుతున్నారు!" అన్నాడు చబ్ నిర్ఘాంతపోయి.

"తెరు" అని కేక ఇంకా బిగ్గరగా మోగింది

"బాబో కమ్మరికుర్రాడు!" అన్నాడు చబ్ టోపీ తీసుకుంటూ. "సొలోఖా!" నన్నెక్కడో అక్కడ దాచిపెట్టు. ఆ లంజాకొడుకు కంట యేమయినాసరే పడను. వాడికళ్ళు లొట్టబడిపోను. దెయ్యపు వెధవ!"

సొలోఖాకూడా భయపడిపోయి పిచ్చిదానిలా తిరుగుతూ, ఏంచేస్తున్నదీ మరిచి, బాండారికూర్చున్న సంచిలో దూరమనీ చబ్ కి సైగచేసింది. ఇంకేముంది కోసక్ చబ్ భారీమనిషి. సంచిలోకిదూరి బాండా మొఖానికి రెండువేపులా చలికి బిగుసుకుపోయిన బూట్లుపెట్టి తలమీాద కూర్చున్నాడు. అంత భారీమనిషి కూర్చున్నా బాండారి కిక్కురమన లేదు, దగ్గలేదు, మూలగలేదు.

ఇక కమ్మరి కుర్రవాడు ఒక్కమాటయినా మాటాడకుండా, టోపీ తీసివేసుకోకుండా లోపలికి చక్కావచ్చి బల్లమీాద పడ్డాడు. మనసేమీా బాగుండలేదు.

సోలోఖా తలుపు మూాయబోతూంటే మళ్ళీ తలుపు కొట్టిన చప్పడయింది. ఈతడవ తలుపుకొట్టింది కోసక్ స్వేర్బిగుజ్. ఇతనిని సంచిలో దాయడానికి వీల్లేదు. అతను పట్టేటంత సంచి ఎక్కడా దొరకదు. గ్రామమునసబుకంటె లావు. చబ్ పక్కఇంటి పానాస్ కంటె పొడుగు. అందుకని అతను చెప్పతలచిందేమిటో వినడానికి పెరడులోకి తీసుకుపోయింది.

వాకలు కట్టుతున్న సంగీతం మధ్యమధ్య వింటూా ఆ కమ్మరి కుర్రవాడు పరధ్యాసతో తనగుడిసె నాలుగుమూాలలా

చూసాడు. చివరికి అతనిదృష్టి సంచులమీద పడింది. "ఆ సంచులు అక్కడ పడివున్నాయెందుకు ? యెన్నడో వాటిని తీసుకు వెళ్ళవలసింది ! యీ పిచ్చిప్రేమవల్ల నామతి మంద గించింది. రేపు క్రిస్మస్ పండగ. యింటో నానా చెత్తా! తీసుకువెళ్ళి కొలిమిదగ్గర పడేస్తాను."

ఇలా అనుకుని కమ్మరి కుర్రవాడు పెద్దపెద్ద సంచుల దగ్గర వంగి వాటిని గట్టిగా బిగించికట్టి బుజాలమీదికి ఎక్కించుకోవడానికి సిద్ధం చేసాడు. కాని అతని ఆలోచనలు మాత్రం ఎక్కడ విహరిస్తున్నాయో దేవుడికే తెలియాలి. అలా కాకపోతే సంచీకట్టిన తాడుతో జుట్టు పెనవేసుకునే సరికి చబ్ రొప్పడం, బొద్దు మునసబు స్పష్టంగా వినిపించే టట్టు ఎక్కిళ్ళు వేయడం కమ్మరికి వినిపించేదే!

"ఆ దిక్కుమాలిన ఒక్సానాను నా మనసులోనుంచి తరిమేయలేనా ?" అనుకున్నాడు కమ్మరి కుర్రవాడు! "దాన్ని గురించి ఆలోచించ కూడదు, అనుకుంటూనే అదేపనిగా ఆలోచిస్తున్నా. యింకేవిషయంమీదా ఆలోచనపోవడంలేదు. వద్దంటూంటే నా మనసులోకి ఆమెమీది ఆలోచనలే వస్తాయేం? ఛీ! సంచులుపూర్వంకంటె బరువెక్కినట్టున్నాయే! బొగ్గులేకాకుండాయింకేవో వున్నట్టున్నాయి. వట్టిదద్దమ్మని! యిపుడు ప్రతీదీ నాకు బరువనిపిస్తోందనే విషయమే మర్చి పోయాను. యిదివరకయితే నాణెంకానీ, గుర్రపునాళానిగానీ ఒంటిచేతితో వంచేయగలిగేవాడిని, వంపు తీసేయగలిగే వాడిని. యిపుడో వెధవ నాలుగుబస్తాలు యెత్తలేకపోతున్నా. యిక ఉఫ్ అంటే యెగిరిపోతానేమో! ఉహుఁ–" అన్నాడు

కాసేపు అయింతరువాత ధైర్యం తెచ్చుకుని, "నాకు సత్తువ తక్కువేం లేదు. నవ్వులపాలవుతానా! యింకా పదిసంచులున్నా అన్నీ యెత్తేస్తాను!" ఇలా ధైర్యం తెచ్చుకొని ఇద్దరు బల శాలురుకూడా మోయలేని ఆ సంచులను సునాయాసంగా బుజాలమీదికి ఎత్తుకున్నాడు. "యిదికూడా తీసుకుపోతా" అనుకుని దెయ్యం ముడుచుకుపడుకున్న చిన్న సంచికూడా పైకి ఎత్తుకున్నాడు. "యిందులో నా పనిముట్లు పడేసివుంటా. "పెళ్ళీవద్దు పెళ్ళాంవద్దు!" అనిపాడుకుంటూ గుడిసెలోనుంచి బయటికి నడిచాడు.

వీధుల్లలో పాటలు, నవ్వులు, కేకలు ఇంకా బిగ్గరగా వినిపించసాగాయి. ఒకరినొకరు తోసుకుంటూ కోలాహలం చేస్తున్న జనసందోహానికి తోడుగా పక్క గ్రామాలనుంచి కూడా జనం వచ్చి కలిసారు. మగపిల్లల కొంటెచేష్టలకు అంతు లేదు. కొల్యాడ్కి పాటలలో మధ్య మధ్య ఏ పడుచుకోసమో అప్పటికప్పుడు అల్లినపాట వినిపించేది. మధ్యలో హఠాత్తుగా జనంలోనుంచి ఎవరో ఒకరు కొల్యాడ్కి పాటకుబదులు ఉగాది పాట గొంతెత్తి ఆలపించేవారు.

పండుగవిందు – బలేపసందు
మొహమాటాలకు – లేదిట పొద్దు
ఇదుగో భక్ష్యం – పులుసూ కూరా
ఆరగించండి – కోరికతీరా

అతగాడి మీద నవ్వుల వర్షం భోరున కురిసేది. చిన్న చిన్న కిటికీలు తెరుచుకునేవి. ముసలమ్మల (ఇంట్లో మిగిలిం

దల్లా ముసలమ్మలు, శాంతి స్వభావంగల తండ్రులు) బక్క చిక్కిన చేతులు బయటికివచ్చి ఇంత కూరో రొట్టెముక్కో పడేసేవి.

సంచులుపట్టి ఆ బహుమతులు అందుకోడానికి మగ పిల్లలు ఆడపిల్లలు పోటీలుపడ్డారు. ఒకచోట నాలుగు వేపుల నుంచీ వచ్చి మొగపిల్లలు ఆడపిల్లలను చుట్టుముట్టేవారు. ఇక ఒకటే కోలాహలం! ఒకడు మంచుముద్దలు విసిరివేసే వాడు. ఇంకొకడు మంచిమంచి పదార్థాలతో నిండిన సంచీ లాక్కుపోయేవాడు. ఆడపిల్లలు మాత్రం తక్కువ తిన్నారా! ఇంకోచోట ఆడపిల్లలు ఏ మొగపిల్లవాడినో పట్టుకుని కాలికి మెలికవేసి సంచితోసహా మంచులోకి వెళ్ళి పడేటట్లు చేసే వారు. రాత్రిరాత్రంతా వేడుకతో గడపడానికి తయారుగా ఉన్నట్లు కనిపించారు. ఇక రాత్రో, దివ్యంగా ఉంది! మంచు తళతళతో పోలిస్తే వెన్నెల ఇంకా ప్రకాశమానంగా ఉంది.

కమ్మరి కుర్రవాడు సంచులు బుజాన వేసుకునే కదల కుండా నిలబడ్డాడు. ఆడపిల్లల గుంపులో ఒక్సానా గొంతు, నవ్వు వినిపించాయి. రక్తం ఉడుకెక్కింది. సంచులు నేలమీద నభేలున పడవేసాడు. పడవేసేసరికి బాండారికి దెబ్బ తగిలి మూలిగాడు. గ్రామమునసబు ఎక్కిలి వేసాడు. కమ్మరి మాత్రం చిన్నసంచి బుజానే ఉంచుకుని కొంతమంది మొగ పిల్లలతో కలిసి ఆడపిల్లలవెంట పడ్డాడు. ఆ ఆడపిల్లలమధ్యనే ఒక్సానా ఉంది.

"ఆఁ- అదే! నల్లటి కళ్ళు మెరిసిపోతుంటే ఓ – రాణీ లాగా నిలబడింది. యెవడో అందగాడు ఆమెకేదో చెబుతు

న్నాడు. బహుశా ఆ చెప్పింది తమాషాగా వుండివుంటుంది. అందుకే నవ్వుతోంది. కాని యెపుడూ నవ్వుతూనే వుంటుం దిగా?" అనుకోకుండానే, ఎలాగా తెలియకుండానే కమ్మరి కుర్రవాడు గుంపులోనుంచి దోవ చేసుకుని వెళ్ళి ఒకాసనా పక్కన నిలబడ్డాడు.

"ఓ - యిక్కడున్నావా, వకులా!" అంది ఆ అంద గత్తె చిరునవ్వు నవ్వుతూ. ఆ చిరునవ్వుకు కమ్మరి కుర్రవాడికి మతిపోయినట్టయింది! "సరేగాని పాటలుపాడి యేమాత్రం సంపాదించావ్! యిస్, సంచి యింత చిన్నగావుందేం? జారినా తొడిగే ముచ్చెలు తెచ్చావా? ఆ ముచ్చెలు, తెచ్చిస్తే నిన్ను పెళ్ళాడతాను!" ఇలాఅని నవ్వుతూ తక్కిన బాలికలతో కలిసి పరుగెత్తుకు వెళ్ళిపోయింది.

కమ్మరి కుర్రవాడు నేలను అంటుకుపోయినట్లు నిలబడ్డాడు. "ఉహుఁ - యిక భరించలేను! నా తరంకాదు!" అని గొణుక్కున్నాడు. "భగవంతుడు దీనికి యింత పాపిష్టిఅందం యెందుకు యివ్వాలి? దానికళ్ళు, మాటలు, ఒకటేమిటి ప్రతీదీ నా మనసును దహించేస్తోంది! దహించేస్తోంది! ఉహుఁ-యిక నిలవదొక్కుకోలేను. దీనినంతటినీ ముగించడం మంచిది. వెళ్ళి మంచుబొరియలో మునిగిపోతే సరి అంతా ముగిసిపోతుంది!"

దృఢనిశ్చయంతో బయలుదేరి ఆ ఆడపిల్లల జట్టును కలుసుకున్నాడు. ఒకాసనా పక్కకు వెళ్ళి దృఢస్వరంతో. "శెలవు, ఒకాసనా! శెలవు! నీకిష్టమయిన ప్రియుణ్ణి చూసుకో!

వాడిని పిచ్చిపుల్లాయిని చేసి కూర్చోబెట్టు! కాని యిక నన్ను మాత్రం యీ భూప్రపంచంలో చూడవు!"

ఆ అందగత్తె ఆ మాటలకు ఆశ్చర్యపడి ఏదో చెప్ప బోయిందిగాని కమ్మరి కుర్రవాడు చేయిఊపి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

"యెక్కడికి వెళుతున్నావ్. వకులా?' అని కేకలు పెట్టారు, అంతా కమ్మరి కుర్రవాడు పరుగెత్తడం చూసి.

"శెలవు. నేస్తాలు!" అని కమ్మరికుర్రవాడు వారికి జవాబుగా కేక పెట్టాడు. "భగవంతుడి దయవుంటే స్వర్గంలో కలుసుకుందాం. కాని యీ ప్రపంచంలో మనం కలిసి వేడుకగా తిరిగే యోగం లేదు. శెలవు! నన్ను గురించి చెడ్డగా చెప్పుకోకండేం! యీ పాపాత్ముడి ఆత్మకు శాంతి గలగడానికి ప్రార్థన చేయమని ఫాదరీ కొండ్రాటికికి చెప్పండి. నేను పాపాత్ముడిని. యీ యిహలోక సుఖాలు చూసుకుంటూ పరమ పురుషుల విగ్రహాలకు, మేరీమాత విగ్రహాలకు రంగువేయడం పూర్తి చేయలేదు. నా పెట్టెలో వున్నదంతా చర్చికి యిచ్చే యండి. శెలవు!"

ఇలా చెప్పి కమ్మరికుర్రవాడు సంచి తీసుకు పరుగెత్తాడు.

"మతిపోయింది!" అన్నారు బాలురు.

"పాపాత్ముడు!" అని దారిబోయే ఒక ముసలమ్మ గొణిగింది. "కమ్మరి కుర్రాడు వురేసుకుని చచ్చాడని చెప్తా."

చాలా వీధులవెంట పరుగెత్తి కాస్త అలసట తీర్చుకోడానికని వకులా ఆగాడు.

“కొంప మునిగిపోయినట్టు యెందు కిలా పరుగెత్తడం!” అనుకున్నాడు. “యింకోసారి యత్నిస్తా. ఆ జపరోజియను పాంచీపాట్స్యూక్‌ని కలుసుకుంటూ. ‘అతనికి దెయ్యాలన్నీ తెలుసు. యేం చేయదలచుకుంటే అది చేయగలడు’ అంటారు. అతని దగ్గిరికే వెళదాం, యెలాగో నా ఆత్మ బండలయి పోయిందిగా!”

చాలా సేపటినుంచీ సంచిలో కదలకుండా పడుకున్న దెయ్యం ఈ మాటలు విని సంతోషంతో ఎగిరి గంతువేసింది. కాని ఆ కమ్మరి కుర్రవాడు తానే సంచిని గుంజడంవల్ల కదిలిందని భ్రాంతిపడి పిడికిలితో సంచిని పొడిచి బుజాలమీద ఊపి పాంచీపాట్స్యూక్‌ను కలుసుకోవడానికి బయలుదేరాడు.

పాట్స్యూక్ ఒకప్పుడు జపరోజియేలో ఉన్న కోసక్. అతనిని అక్కడనుంచి తరిమివేసారో లేక అతనంతట అతనే జపరోజియేనుంచి పారిపోయి వచ్చాడో ఎవరికీ తెలియదు.

చాలాకాలంనుంచీ, పది పదిహేను సంవత్సరాలనుంచీ అతను డికాంకాలో నివసిస్తున్నాడు. మొదటలో అచ్చంగా జపరోజియేవాడి లాగానే జీవితం గడిపాడు. పనీపాటా చేసే వాడుగాదు. రోజుకు ఇరవయి గంటలు నిద్రపోయేవాడు. ముప్పూటలా మూడుతవ్వలు తినేవాడు. ముంతెడు వోడ్కా ఒక్క గుక్కలో తాగేసేవాడు. పొడగరి కాదుగాని విపరీత మయిన లావు. ఇక పట్లూంసంగతి వేరేచెప్పాలా? ఎంతపెద్ద అంగ వేసినా కాలుజాడే కనిపించేదికాదు. సారా పీపా వీధి వెంటనడిచి వెళుతున్నట్లుండేది. బహుశా అందుకనే అతనికి ‘ఎలుగుబంటు’ అని మారుపేరు పెట్టారు. ఈ గ్రామం చేరు

కున్న కొద్దిరోజులకే అతను మాంత్రికుడని అందరికీ తెలిసిపో యింది. ఎవరికి జబ్బుచేసినా నయం చేయడానికి పాట్స్యాక్‌ని పిలిచేవారు! రోగిచెవిలో పాట్స్యాక్ నాలుగు ముక్కలుచెపితే చాలు రోగం మాయమయ్యేది. ఎవరికయినా చేప ఎముక గొంతుక పట్టితే పాట్స్యాక్ అతని వీపుమీద నేర్పుగా చరిచే వాడు. దాంతో గొంతుకకు ఏమీ అపాయం జరగకుండా ఎముక కిందికి దిగిపోయేది. కొద్ది సంవత్సరాలుగా అతను ఎక్కువగా బయటికి రావడంలేదు. కారణం బద్ధకం అయి ఉండవచ్చు. లేదా ఏడాది ఏడాదికీ లావెక్కిపోతున్నాడు. గుమ్మం పట్టడంలేదు. బయటికి రాకపోవడానికి ఇదీ కారణ మయి ఉండవచ్చు. అతనిసాయం కావలసినవారు అతని ఇంటికే వెళ్ళడం మొదలుపెట్టారు.

భయపడుతూ భయపడుతూ కమ్మరి కుర్రవాడు తలుపు తెరిచాడు. ఆ సమయానికి పాట్స్యాక్ పద్మాసనం వేసుకుని చిన్న తొట్టెముందు నేలమీద కూర్చున్నాడు. తొట్టెమీద గిన్నెలో బొండాలున్నాయి. గిన్నె అతని మూతికి సమమట్టంలో కావాలని పెట్టినట్లుగాఉంది. వేలయినా కదపకుండా తల గిన్నెవైపుకువంచి పులుసు జుర్రాడు. మధ్య మధ్య బొండాలు వేళ్ళతో తీసుకుని తింటున్నాడు.

"బాగానేవుంది!" అనుకున్నాడు వకులా తనలోతాను. "చబ్‌కంటె బద్ధకస్తుడు. చబ్ చెంచాతో పట్టుకుని తింటాడు. యిక యీాయనగారో చేయికూడా కదపడు!"

పాట్స్యాక్ బొండాలు తినడంలో మునిగిపోయినట్లు న్నాడు. కమ్మరి కుర్రవాడు లోపలకు అడుగు పెట్టడం;

అడుగుపెట్టగానే వంగి సలాంచేయడం అతను గమనించినట్లు లేదు.

"సహాయం కోరివచ్చాను" అన్నాడు వకులాత్రిక్రిగి వంగి నమస్కరిస్తూ.

బొద్దు పాట్న్యాక్ తల పైకెత్తి చూసి మళ్ళీ బోండాలు తినసాగాడు.

"అంతా అంటారు – మరేం అనుకోకండి" అన్నాడు కుమ్మరి కుర్రవాడు ధైర్యంతో "మిమ్మల్ని అవమానపరుద్దామనేంగాదు – అంతా మీరు దయ్యంతో సమానమయిన వారంటా!రు"

ఈ మాటలు అంటూంటే వకులాకి భయంవేసింది. 'మోటుగా మాట్లాడాను, భాషలో మృదుత్వం లేదు' అనుకున్నాడు. పాట్న్యాక్ గిన్నెతోసహా తొట్టి పైకెత్తి తన నెత్తిమీదవేసి కొడతాడేమోనని అనుమానం వేసి కొద్దిగా పక్కకు తిరిగి వేడివేడి పులుసు వచ్చి పడకుండా చొక్కా చేయి మొహానికి అడ్డం పెట్టుకున్నాడు. కాని పాట్న్యాక్ తిరిగి తల పైకెత్తి చూసి గాని ఏమీ అనకుండా మళ్ళీ బోండాలు మింగసాగాడు.

దీనితో కమ్మరికుర్రవాడికి ప్రోత్సాహం లభించినట్లయి సంభాషణ కొనసాగించాలని నిశ్చయించుకున్నాడు.

"మీ దర్శనం చేసుకోవడానికి వచ్చాను. పాట్న్యాక్! భగవంతుడు మీకు సమస్తమూ ప్రసాదించుగాక! కుప్ప కుప్పలుగా రకరకాల వస్తువులు, తగినంత రొట్టె" (కమ్మరి

కుర్రవాడికి మధ్య మధ్య చమత్కారంగా మాటాడడం తెలుసు. పొట్లావాలో అధికారి దడికి రంగువేసేటప్పుడు అలవర్చుకున్నాడు.) "యిక నాకు సర్వనాశనం తప్ప మరేం లేదు. పాపాత్ముడిన్ని! యెవరెంత సాయపడ్డా లాభంలేదు. యేంజరగాలో అదే జరుగుతుంది! యిక దెయ్యాన్ని సాయం అడగదల్చుకున్నాను. పాట్స్యాక్!" అన్నాడు కమ్మరి అతను మౌనవ్రతం వదలకుండా ఉండడంచూసి "యేంచేయ మంటావ్?"

"దెయ్యం సాయం కావల్సివస్తే దెయ్యం దగ్గిరికి వెళ్ళు." అని జవాబిచ్చాడు పాట్స్యాక్ తలపైకెత్తి చూడకుండా బోండాలు మింగుతూ.

"అందుకే మీ దర్శనానికి వచ్చాను" అని జవాబిచ్చాడు కమ్మరి ఇంకోమారు వంగి నమస్కరిస్తూ. "అతని దగ్గిరికి వెళడానికి" దారి మీకుతప్ప యీ భూప్రపంచంలో యెవరికీ తెలీదు.

పాట్స్యాక్ జవాబు చెప్పకుండా మిగిలిన బోండాలు తినసాగాడు.

"కాస్త దయదలచండి. కాదనకండి" అని హఠం చేసాడు కమ్మరి. "మాంసం, గోధుమ, జొన్నలు, ఒకటేమిటి మీకు యేదికావల్సివుంటే అది సమర్పించుకుంటా. యెదో మామూలుగా! దెయ్యందగ్గిరికి వెళ్ళడానికి రోడ్డు యెటుందో చెప్పి పుణ్యం కట్టుకోండి."

"బుజంమీద దెయ్యాన్ని పెట్టుకుని మెక్కడికో పోవడం దేనికి ?" అన్నాడు పాట్స్యాక్ ముభావంతో కూర్చున్న చోటునుంచి లేవకుండా.

ఆ మాటలఅర్థం మాంత్రికుడి నుదుటిమీద వ్రాసి పెట్టి ఉన్నదా అన్నట్లు వకులా అతని ముహంమీద దృష్టి నిలిపాడు.

"యేమిటి యితగాడి వుద్దేశం ?" అని వకులా మొహం అడుగుతున్నట్టుంది. బోండా మింగడానికి తయారయినట్టుగా మొదటి మాటను మింగడానికా అన్నట్టు నోరు సగం తెరుచుకుంది.

కాని పాట్స్యాక్ మాత్రం నోరు కదపలేదు.

ముందు బోండాలుగాని రొట్టెగాని లేకపోవడం వాటి స్థానే నేలమీద రెండు కొయ్యగిన్నెలు ఉండడం వకులా గమనించాడు. ఒకదాని నిండా చపాతీలు, రెండోదానినిండా మీగడ ఉన్నాయి. అతని ఆలోచనలు, కళ్ళు ఆ పదార్థాల మీదకు అప్రయత్నంగానే మళ్ళాయి. "చూదాం" అనుకు న్నాడు తనలోతాను. "చపాతీలు పాట్స్యాక్ యెలాతింటాడో ! బోండాలు మింగడానికి ముందుకు వంగుతాడనుకోను. ముందుగా చపాతీలు మీగడలో ముంచాలిగా !"

వకులా ఇలా అనుకున్నాడో లేదో పాట్స్యాక్ నోరు తెరచి చపాతీలవంక చూసి నోరు ఇంకా పెద్దగా తెరి చాడు. వెంటనే గిన్నెలోనుంచి ఒక చపాతీ టపీమని పైకి లేచి మీగడలో పడింది. రెండోవైపుకు తిరిగి పైకి ఎగిరి

తిన్నగా వెళ్ళి పాట్స్యూక్ నోట్లో పడింది. పాట్స్యూక్ ఆచపాతీని తినేసి మళ్ళా నోరు తెరిచాడు. మళ్లా ఇంకో చపాతీ అదే విధంగా వచ్చి అతని నోట్లో పడింది. పాట్స్యూక్ పడ్డ శ్రమ అల్లా నమలడం, మింగడం!

"అరే! ఆశ్చర్యం!" అనుకున్నాడు కమ్మరి కుర్రవాడు. ఆశ్చర్యంతో నోరు తెరుపుకు పడింది. ఇంతలో ఒక చపాతీ అతని నోటిమీదకువచ్చి పడింది. పెదవులకు మీగడ అంటింది. చపాతీని తోసిపారవేసి, పెదవులు తుడుచుకుని 'అరే యీ ప్రపంచంలో యెటువంటి చిత్రాలు జరుగుతుంటాయి!' దెయ్యం మనిషిచేత యెటువంటి పనులయినా చేయిస్తుంది. యీ పాట్స్యూక్ ఒక్కడే నాకు సాయం చేయగలిగినవాడు' అని ఆలోచించసాగాడు.

"యింకోమాటు వంగి నమస్కరిస్తాను, యేమో సరిగ్గా చెప్పేయొచ్చు. అరే! యివాళ వక్కపొద్దు. చపాతీలు తింటున్నాడు!పిచ్చిపుల్లాయిని, యిక్కడ నుంచుని పాపానికి తయారవుతున్నాను. తిరిగివెళ్ళడం మంచిది" అని అనుకుని కమ్మరి కుటీరంలోనుంచి బయటికి పరుగెత్తాడు.

కాని సంచిలో కూర్చున్న దెయ్యం అప్పటివరకు వకులా తనచేతికి చిక్కాడని సంతోషిస్తోంది. ఇక ఇపుడు చేతికి చిక్కినవాడు జారిపోవడం భరించలేకపోయింది కమ్మరి కుర్రవాడు సంచి నేలమీదకు దింపగానే దెయ్యం దాంటోనుంచి బయటకు ఉరికి అతని మెడ నులమసాగింది.

కమ్మరికుర్రవాడు ఆపాదమస్తకం కంపించిపోయాడు. తెల్లబోయాడు. భయపడిపోయాడు. ఏమిచేయడానికి తోచ

లేదు. శిలువగుర్తు వేయబోయాడు. కాని దెయ్యం తన సారాకంపునోరు వకులా కుడి చెవిదగ్గర పెట్టి, "నేనే నేస్తం! స్నేహితులకోసం యేమయినా చేస్తా. నీకు కావలసినంత డబ్బియిస్తా" అని ఎడమచెవిలో చెప్పింది. "యివాళే ఓకాన్సానాను నీదానిని చేస్తా." మళ్ళీ కుడిచెవిలో ఆమాటే చెప్పింది.

కమ్మరికుర్రవాడు ఆలోచిస్తూ కదలకుండా నిలబడ్డాడు.

"సరే" అన్నాడు చిట్టచివరకు. "ఒకాన్సానాను నాదాన్ని చేస్తే నేను నీవాడని కావడానికి తయార్."

దెయ్యం సంతోషంతో చేతులుఊపి కమ్మరి కుర్రవాడి మెడమీద పైకీ కిందకీ గెంతసాగింది. "యిక యీ కమ్మరి కుర్రాడిపని అయిపోయింది." అనుకుంది తనలోతాను "ఊఁ— దెయ్యాలను వెక్కిరిస్తూ బొమ్మలుగీసావుగదూ, అంతకు అంతా ముట్టజెపుతానుచూడు! యీ గ్రామంలో కల్లా మంచివాడు నా చేతిలో చిక్కాడంటే, నా సహచరులేమంటారో చూడాలి!"

నరకంలోని పొడుగుతోక దెయ్యాలను ఎలా వేళాకోళం చేయదలంచిందీ, దెయ్యాలలోకల్లా జిత్తులమారి ఆ కుంటిదెయ్యం ఎలా మండిపడేదీ ఊహించుకుంటూ సంతోషంతో నవ్వింది మన దెయ్యం.

"సరేగాని వకులా!" అంది దెయ్యం అతని మెడమీదనుంచి దిగకుండానే. దిగితే తప్పించుకుపోతాడేమోనని భయం. "కరారునామా లేకపోతే యేంచేయడానికీ లేదని నీకు తెలిసిందేగా!"

"ఓ తయారుగా వున్నా" అన్నాడు కమ్మరి.

"మీలో కరారునామా మీద సంతకాలు నెత్తురుతో పెడతారని విన్నా. వుండు, జేబులోనించి మేకుతీస్తా."

ఇలా అని చేయి వెనకకుపెట్టి దెయ్యంతోక పట్టుకున్నాడు.

"నువు బలే హాస్యగాడివిలా వున్నావే!" అంది దెయ్యం నవ్వుతూ. "పద, వెళదాం. హాస్యాలయిక చాల్లే"

"కాస్త తమాయించు నేస్తం!" అన్నాడు కమ్మరి. "యేవిటిది?" ఏవిఁటిది అని అడుగుతూనే శిలువగుర్తు వేసాడు. దాంతో దెయ్యంపిల్లిలా అయిపోయింది. "కాస్త తమాయించు" అంటూ కమ్మరి తోక పుచ్చుకుని నేల మీదకు దెయ్యాన్ని పడవేసాడు. "మంచివాళ్ళనీ, నిజాయితీ పరుల్ని పాపాలకు ప్రేరేపించకుండా నీకు బుద్ధిచెప్తా."

కమ్మరి కుర్రవాడు దెయ్యంమీదికి ఉరికి రెండు కాళ్ళతోనూ పట్టేసి శిలువగుర్తు వేయడానికి చేయిఎత్తాడు.

"దయజూడు, వకీలా!" అని దెయ్యం దయపుట్టేటట్టు ఏడ్చింది. "నువేం చేయమంటే, అది చేస్తా. చేస్తా ప్రాణాలతో వదిలిపెట్టుబాబు. ఆ శిలువగుర్తు నామీద వేసి చంపకు!"

"ఆఁ- వరసమార్చావన్నమాట! జర్మన్ వెధవ! యేం చేయాలో నాకు తెలుసులే. నీ వీపుమీద నన్ను మోసుకు వెళ్ళు. వినిపించిందా? పక్షివేగంతో యెగిరిపోవాలి!"

"యెక్కడికి?" అని దెయ్యం ఏడుపు మొహంపెట్టి అడిగింది.

"పీటర్స్‌బర్గ్‌కి. తిన్నగా జారినా దగ్గిరికి తీసుకెళ్ళు!" గాలిలో ఎగురుతూన్నట్టు అనిపించగానే కమ్మరి కుఱ్ఱవాడికి భయంవల్ల మూర్ఛవచ్చినంత పనయింది.

కమ్మరికుఱ్ఱవాడి మాటలనే తలుచుకుంటూ ఒక్సానా చాలాసేపు నిలబడిపోయింది. అతనిని అతిక్రూరంగా చూసానని అంతరాత్మ చెప్తోంది. "యేదో విపరీతానికి దిగాలని అతను నిశ్చయించుకుంటే? ఆశ్చర్యపడవలసిన పనేం లేదు! బహుశా యీ విచారంతో యింకో అమ్మాయిని ప్రేమించవచ్చు. ఈవూళ్ళోకల్లా అందమయినదానివని దాన్ని పొగడవచ్చు. ఊహుం— అతను నన్నే ప్రేమిస్తున్నాడు. నా అందం యింతా అంతానా? యేమయినాసరే నన్నుమాత్రం వదులుకోడు యిదంతా ఒక ఆట, నటన! పదినిమిషాల్లో వచ్చి నట్లు తిరిగొస్తాడు. కాని నేనుమాత్రం అతిఖచ్చితంగా వుంటే యెట్లా! నాకు యిష్టంలేనట్లు నటించి ముద్దెట్టుకో నీయాలి. సంతోషించడూ!" ఇలా అనుకుని అ అందగత్తె చెలికత్తెల దగ్గరకు వెళ్ళి మళ్ళీ హాస్యాలలోకి దిగింది.

"వుండు" అంది ఆ బాలికలలో ఒకామె.

"కమ్మరికుఱ్ఱాడు సంచులు మరిచేబోయాడు అబ్బ! యెంత పెద్దవో! పాటలుపాడి మనకంటె యెక్కువే సంపాదించాడు. యింతంత గొఱ్ఱెమాంసం ఒకొక్కళ్ళు పడేసి

వుంటారు. యిక రొట్టెలకు జజ్జీలకి లెక్కవున్నట్టులేదు. బలే! యీవారం అంతా విందుచేసుకోవచ్చు."

"కమ్మరికుర్రాడి సంచులా?" అనిఅడిగింది ఒక్సానా "మా కుటీరానికి లాక్కుపోదాం. త్వరగా పదండి. అందులో యేవున్నాయో చూదాం."

బాలికలు అందరూ నవ్వుతూ అంగీకరించారు.

"కాని మనం వీటిని యెత్తలేం!" అన్నారు జట్టు జట్టంతా సంచులను కదపాలని యత్నిస్తూ.

"ఒక్క నిమిషం ఆగండి" అంది ఒక్సానా.

"సరుగుడుబండి తెచ్చి దానిమీద వీటిని వేసుకు వెళదాం!"

బండికోసం బాలికలు పరుగెత్తారు.

ఖైదీలకి సంచులలో కూర్చునీ కూర్చునీ విసిగెత్తి పోయింది. బాండారి బయటి ప్రపంచాన్ని చూడడానికని సంచికి పెద్దకన్నం పెట్టాడు. చుట్టుపక్కల ఎవరూ లేనట్లయితే ఏదోవిధంగా బయటపడాలని యత్నించేవాడే. కాని పది మందీ చూస్తుండగా సంచిలోనుంచి బయటపడడం - నవ్వుల పాలయిపోడూ! ఈ ఆలోచన వచ్చి ఆటకాయించింది. సరే, యేంచేస్తాం యిలాగే పడివుండి వేచిచూదాం అని నిశ్చ యించుకున్నాడు. చబ్ బూట్లువచ్చి తాకుతూంటే మూలుగు మొదలు పెట్టాడు.

చబ్ కి ఎపుడు బయటపడదామా అనే ఉంది. సదు పాయంగా కూర్చోలేకపోతున్నాడు. కాని కూతురి ఆలోచన

చెవినిపడగానే ఇక తనంతట తానే బయటికి రావడం మంచిది కాదని నిశ్చయించుకున్నాడు, గుడిసె వందా రెండువందల అడుగులు దూరం ఉంటుంది. బయటికి రాదలిస్తే ఎంతో సవరించుకోవాలి – గొర్రెచర్మపు కోటుకు గుండీలు పెట్టుకోవాలి, నడుం పటకా బిగించుకోవాలి – అవస్థ! అంతేకాదు టోపీ సాలోఖా ఇంటో ఉండిపోయింది. బండిలో తీసుకు వెళ్ళనీయడమే మంచిదని తలపోసాడు, చబ్.

కాని చబ్ అనుకున్నట్లుగా జరగలేదు. బండికోసం బాలికలు పరుగెడుతూంటే పానాస్ సారాదుకాణంలోనుంచి బయటికి వచ్చాడు. అతని మనసు ఏమీ బాగుండలేదు. సారాదుకాణం పెట్టిన యువతి అప్పుపెట్టడానికి అంగీకరించలేదు. దేవుడిలాగా ఏ పెద్దమనిషో వచ్చి ఇంత తాగిస్తాడనే ఆశతో సారాదుకాణంలోనే కూర్చుండిపోదామని ఆలోచించాడు. కాని దురదృష్టవశాత్తూ పెద్దమనుషులంతా ఇంటి దగ్గరే ఉండిపోయి ఇంటివారితో కలిసి వరి అన్నం, తేనె ఆరగిస్తున్నారు. మంచీ మర్యాదా నానాటికీ ఎలా తగలడిపోతున్నదీ, సారాదుకాణం యజమానురాలి మనసు ఎంత కఠినమయినదీ ఆలోచిస్తూ బయటికివచ్చి సంచుల్ని చూసి ఆశ్చర్యంతో ఆగిపోయాడు.

"రోడ్డుమీద యెవరో సంచులు పారేసుకున్నారే!" అన్నాడు చుట్టూ చూస్తూ. "వీటిల్లో తప్పకుండా పంది మాంసం వుండివుంటుంది. యెవడో అదృష్టవంతుడు పాటలు పాడి రకరకాల బహుమానాలూ పొందివుంటాడు. యేం సంచులు, యేంసంచులు! పాతగోధుమరొట్టెలతోను, బిస్కట్ల

తోనూ నిండివున్నాయనుకో! అయితేనేం? వట్టి రొట్టె ముక్కలున్నా చాలు. ఒక్కొక్క రొట్టెముక్కకి వోడ్కా ఒక్కొక్క డ్రాము యిస్తుంది. యెవరికంటా పడకముందే వీటిని తొందర తొందరగా తీసుకు వెళ్ళాలి."

చబ్, బొండారి కూర్చున్న సంచి బుజానికి ఎత్తుకున్నాడు. బరువు అనిపించింది.

"ఒకడినీ మోసుకువెళ్ళడం కష్టం!" అనుకున్నాడు.

"అదృష్టం అంటే యిలావుండాలి. అదిగో సాలి ఒస్లాప్ యిలాగే వస్తున్నాడు. నమస్తే ఒస్లాప్!"

"నమస్తే!" అన్నాడు ఒస్లాప్ ఆగి.

"యెక్కడికి వెళుతున్నావ్?"

"ముక్కుకు సూటిగా!"

"కాస్త సాయంపట్టు పుణ్యముంటుంది. యెవరో పాటలుపాడి యిక్కడ పారేసుపోయారు. చెరిసగం పంచుకుందాం!"

"సంచులు! యేంసంచులు! గోధుమరొట్టెవేనా? యిం కేమన్నానా?"

"ఒకటేమిటి? రకరకాలు?"

వారిద్దరూ తొందరతొందరగా కోరడిలోనుంచి కర్రలు పెరికి, వాటిమీద ఒక సంచివేసి మోసుకుంటూ బయలుదేరారు.

"యెక్కడికి మోసుకువెళదాం? సార్గాదుకాణానికా?" అని ఒస్కాప్ అడిగాడు.

"నేనూ అదే అనుకుంటున్నా, కాని ఆవెధవముండ మనల్ని నమ్మ్చావదు. యెక్కడో యెత్తుకొచ్చామంటుంది. పైగా నేను సారాదుకాణాన్నుంచి యిప్పుడే వస్తున్నా. అందు కని నాగుడిసెకి తీసుకువెళదాం. నా పెళ్లాం యింటిదగ్గరలేదు. యిక మనకు అడ్డేంవుండదు."

"నీ పెళ్ళాం యింటిదగ్గిర లేదని నీకు గట్టి నమ్మక మేనా?" అని ఒస్కాప్ తెలివిగలవాడేమో అడిగాడు.

"నేను పిచ్చిమొద్దును యింకా కాలేదు" అన్నాడు పానాస్. "యిక్కడెక్కడా లేదు. తెల్లవారేదాకా వాళ్ళ ఆడమళయాళంతో కలసి తిరుగుతూంటుంది."

"యెవరక్కడ?" అని పానాస్ భార్య కేక పెట్టింది. స్నేహితులిద్దరూ సంచితో బయటిగదిలో చేరిన అలికిడి విని. పానాస్ నిర్ఘాంతపోయాడు.

"చచ్చామురా దేవుడా!" అన్నాడు పానాస్ నిరా శతో.

పానాస్ భార్యవంటి స్త్రీరత్నం ఈ భూప్రపంచంలో అపురూపమేమీ కాదు. భర్త మాదిరిగానే ఆమెకూడా ఎక్కువగా ఇంటిపట్టున ఉండేదికాదు. ప్రతిరోజూ స్నేహితు రాండ్రఇళ్ళకీ, బాగా ఉన్న ముసలమ్మలఇళ్ళకీ వెళ్ళి వాళ్ళని పొగడి కడుపునిండా బేవారసుగా మెక్కి వచ్చేది. ఉదయం పూట మాత్రమే సామాన్యంగా భర్తదర్శన మయ్యేది. అలాంటపుడల్లా ఏదోఒక పోట్లాట పెట్టుకునేది. వాళ్ళగుడిసె జిల్లాగుమాస్తా పంట్లాంకంటె పాతది. గుడిసెమీాద గడ్డికూడా

సరిగాలేదు. కొరడి ఉండిఉండనట్టుగా ఉంది. జనం బయటికి వెళ్ళేటప్పుడు కుక్కల్ని తరమడానికి కర్రలుకూడా తీసుకు వెళ్ళేవారుకాదు. పానాస్ కొరడ ఉందిగదా, అవసరమయితే దాంటోనుంచి ఒక కర్రముక్క పీకవచ్చు అనుకునేవారు. ఒకొక్కపుడు వరసగా మూడేసి రోజులపాటు ఇంటిపొయ్యి రాజేయడమే జరిగేదికాదు. అక్కడక్కడా తాను సంపాదించుకున్న పదార్థాలు భార్య భర్తకంట పడకుండా దాచేది. తరుచు భర్త తాగుడికి తగలేయకుండా సంపాదించింది ఇంటికి తెస్తే అదీ భార్య కాజేసేది. పానాస్‌కి శాంతం ఎక్కువ, అయినా భార్యకి లొంగిపోవడం ఇష్టముండేదికాదు. అందుకని ప్రతిరోజూ గుడ్డల్లో నీళ్ళు కుక్కుకుని బయటికి వెళ్ళిపోతూండేవాడు. ఇక అతనిఅర్థాంగి ముక్కుతూ మూలుగుతూ భర్తచూపే అనాదరణగురించీ, కొట్టే దెబ్బలనుగురించీ ముసలమ్మలకు వర్ణించి చెప్పడానికి అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళేది.

తలవనితలంపుగా ఈ పెనుభూతం ప్రత్యక్షమయేసరికి సాలిబస్కాప్, పానాస్ ఎంత కంగారుపడి ఉంటారో మీరే ఊహించుకోండి. సంచి నేలమీద పడవేసి, దానిముందు నిలుచుని కోట్లతో కప్పివేసారు. కాని ఏంలాభం? పానాస్ భార్యకి మామూలుగా చత్వారం అయితేనేం సంచిమాత్రం కంటపడింది.

"బలే!" అంది. మొహంలో డేగసంతోషం గోచరించింది. "బలే! పాటలుపాడి, చాలా సంపాదించారే! నోరు మంచిదయితే వూరు మంచిదవుతుందంటారు. ఉహుఁ - యిది

యెక్కడనుండో మీరు యెత్తుకుచ్చి వుంటారు. సంచిలో యేవుందో చూపించండి, వినిపించిందా? ఊc-చూపించండి''

''ఆ బట్టతల దెయ్యం చూపించాల్సిందేగాని మేం మాత్రం చూపెట్టం!'' అన్నాడు పానాస్ దర్జాగా.

''ఆ గొడవంతా నీకెందుకు?'' అన్నాడు ఒస్టాప్.

పాటలుపాడి సంపాదించింది, మేం. నువేంకాదు!''

''ఊc- చూపించవేం, తాగుమోతు దద్దమ్మా!'' అంటూ కెవ్వుమని, ఆమెభర్తని గడ్డంమీద పిడికిలితో ఒక్క పోటుపొడిచి సంచిదగ్గరకు బయలుదేరింది. కాని సాలిఒస్టాప్, పానాస్ మొగసిరి చూపించి సంచిని ఆమె చేతికి చిక్కనీయ లేదు. ఆమె వెనకడుగు వేయకతప్పలేదు. కాని కాస్త కోలు కునేసరికి భార్య మళ్ళీ ఒక పటకారు తీసుకుని పరుగెత్తు కుంటూ వచ్చింది. లాఘవంగా భర్తచేతులమీద, ఒస్టాప్ వీపుమీద పటకారుతో కొట్టి సంచిదగ్గరకు చేరుకుంది.

''సంచి దీనిచేతికి చిక్కనిచ్చావేం?'' అన్నాడు సాలి ఒస్టాప్ తమాయించుకుని.

''చిక్కనిచ్చావేం!''అన్నాడు పానాస్ ముభావంగా.

''మీ పటకారు యినపపటకారు!'' అన్నాడు ఒస్టాప్ కొంచెం ఆగి వీపు తడుముకుంటూ.

''నా పెళ్ళాం కిందటి సంవత్సరం సంతలో యిరవయి అయిదు కోపెక్కులకు ఒక పటకారు కొంది. పటకారు బహుమంచిది. నెప్పిపుట్టేదికాదు.''

ఇంతలో పానాస్ భార్య విజయగర్వంతో కుండ దీపం నేలమీదపెట్టి, సంచి ఊడదీసి చూసింది. సంచిని చూడగలిగిన కళ్ళు ఈ తడవ మోసం చేసాయి.

"ఓం పంది!"అని కేకవేసింది సంతోషంతో చప్పట్లు కొడుతూ.

"పంది! వినిపించిందా! పంది!"అని ఒస్టాప్ పానాస్‌ను మోచేతితో పొడిచాడు. "తప్పంతా నీదే!"

"యేం చేస్తాం, రాత!" అని జవాబిచ్చి పానాస్ బుజాలు ఎగరవేసాడు.

"యేంచేస్తామా? ఆగడం దేనికి? సంచి తీసుకుపోదాం పద. ఊం–రా రా– యిదిగో యిదిమాది, యిక నువ్వు దయ చెయ్" అని అరిచాడు ఒస్టాప్ ముందడుగు వేస్తూ.

"పో పో! దెయ్యపుముండ! యిది నీముల్లెంకాదు!" అన్నాడు పానాస్ దగ్గరకు వెళుతూ.

అతని భార్యారత్నం మళ్ళీ పటకారు పైకెత్తింది. కాని ఆ సమయానికి చబ్ సంచిలోనుంచి బయటపడి అప్పుడే నిద్రనుంచి లేచినవాడిలాగా ఒళ్ళు విరుచుకుంటూ గదిమధ్యన నిలబడ్డాడు. పానాస్ భార్య కెవ్వుమని కేకవేసింది. అందరూ నోళ్ళు తెరుచుకుని ఆశ్చర్యంతో చూడసాగారు.

"పంది అని చెప్పిందేం! పిచ్చిమొద్దు! పందీకాదు గిందీకాదు!" అన్నాడు పానాస్ నోరుతెరుచుకుని తేరిపార జూస్తూ.

"అరే! సంచిలో మనిషి!" అన్నాడు సాలెబస్టాప్ భయంతో వెనకడుగువేసి. "మీరు యేదన్నా అనండి. గొంతు చించుకుని అరవండి, యిదిమట్టుకు దెయ్యంపనే. సందేహం లేదు. గుమ్మంపట్టని మనిషి సంచిలో పట్టాడంటే—"

"మరెవరూకాదు, చబ్!" అని అరిచాడు పానాస్ పరీక్షగా చూసి.

"మరెవరనుకున్నా?" అన్నాడు చబ్ నవ్వుతూ.

ఊం— మీకు బలేగా టోపీవేసాగదూ? పందిమాంసం అనుకుని నన్ను మెక్కాలని చూస్తారా? కాస్త ఆగండి, నోరు తియ్యబడుతుంది. సంచిలో యింకేదో పందో పంది మాంసమో, మరింకేదో జంతువు వుంది. నా కాళ్ళకింద యేదో మెదిలింది."

సాలెబస్టాప్, పానాస్ సంచీదగ్గరకు ఉరికారు. ఇంటి యజమానురాలు సంచి రెండువైపులా పట్టుకుంది, మళ్ళీ యుద్ధం అయిపోయేదేగాని ఇంతలో శాండారి ఎలాగో బయటపడిపోతాం అని తనంతట తానే సంచిలోనుంచి బయటపడ్డాడు.

ఆమె నిర్ఘాంతపోయి శాండారిని సంచిలోనుంచి బయటకు లాగడానికి పట్టుకున్న కాలు వదిలేసింది.

"అరె! యింకోడు!" అన్నాడు ఒస్టాప్ భయంతో.

"యిదేం పాపకర్మం! నాతల తిరిగిపోతోంది చిత్రం! రొట్టెముక్కలకు, కూర్లకు బదులు సంచులలో మనుషుల్ని పడేస్తున్నారు!"

"అరే! బాండారి!" అన్నాడు చబ్ అందరికన్నా ఎక్కువగా ఆశ్చర్యపోతూ, "సరే, తెలిసింది! ఊం-సాలోఖా! బలే అసాధ్యురాలివి! గుడిసెనిండా సంచులుంటే ఒకదాంట్లో నను దాచిందనుకున్నా, యిపుడు తెలిసింది. సంచికి యిద్దర్ని చొప్పున దాచింది! నన్నొక్కడినే ప్రే—లంజ!"

ఒకసంచి కనిపించకపోయే సరికల్లా ఆ బాలికలు కొద్దిగా ఆశ్చర్యపోయారు.

"పోనిద్దురూ, పోతేపోయింది. వున్నది చాల్లే!" అంటూ సణిగింది ఒకామె.

సంచి పైకెత్తి బండిమీద పడేసారు.

'సంచి ఊడదీసి బయట పడేయండి అని కేకపెట్టానా, ఈ పిల్లలు సంచిలో దెయ్యం ఉందని పారిపోవచ్చు, మర్నాటి వరకు వీధిలో పడుండాలి' అని ఆలోచించి గ్రామమునసబు నోరు మెదపకుండా ఉండడానికి నిశ్చయించుకున్నాడు. ఇక బాలికలు ఒకరిచేతులు ఒకరు పుచ్చుకుని బండివెనక గరగర లాడే మంచుమీద సుడిగుండంలాగా పరుగెత్తజొచ్చారు. కొంతమంది తమాషాకి బండిఎక్కి కూర్చున్నారు. మరి కొంతమంది గ్రామమునసబు నెత్తిమీద కూర్చున్నారు. కుయ్యిమనకుండా ఓర్చుకోవాలని మునసబు నిశ్చయించు కున్నాడు.

చివరికి ఎలాగయితేనేం గుడిసెను చేరుకుని బయటి గదితలుపు బార్లా తీసి నవ్వుతూ పేలుతూ సంచి లోపలికి లాక్కువెళ్ళారు.

"లోపల యేంవుందో చూదాంపట్టండి" అని అంతా అరిచారు. సంచి ఉడదీయడానికి ఆతృతపడుతూ.

అప్పటివరకు మునసబును వేధిస్తున్న ఎక్కిళ్ళు ఇంకా ఎక్కువయిపోయాయి. ఇంకా ఎక్కువ బిగ్గరగా ఎక్కిళ్ళు, దగ్గు ప్రారంభమయినాయి.

"బాబోయ్, సంచిలో యెవరో వున్నారు!" అంటూ అరుస్తు భయపడిపోయి బయటికి పరుగెత్తారు బాలికలు.

"యేమిటి గొడవ? దెయ్యం పట్టినవాళ్ళలాగా యెక్కడికి పరుగెత్తుతున్నారు?" అన్నాడు చబ్ లోపలకు వస్తూ.

"నాన్నా!" అంది ఒక్సానా. "ఆ సంచిలో యెవరో వున్నారు. నాన్నా!"

"సంచిలోనా? యీ సంచి యెక్కడనించి తెచ్చారు?"

"కమ్మరికుర్రాడు రోడ్డుమీద పారేసిపోయాడు" అని అందరూ ఒకేసారి చెప్పారు.

"ఓ-అదా సంగతి! నే చెప్పలా?" అని తనలో తాను అనుకున్నాడు చబ్.

"భయం యెందుకు? చూద్దాం పట్టండి. రాండి, సామీ - పేరుపెట్టి పిలవలేదని కోపం పెట్టుకోకండి!"

గ్రామమునసబు సంచిలోనుంచి బయటపడ్డాడు.

బాలికలు కెవ్వుమన్నారు.

"మునసబుగారుకూడా ఒక సంచిలో దూరారు అన్న మాట!" అనుకున్నాడు చబ్ ఆశ్చర్యపోతూ, మునసబును

ఎగాదిగా చూస్తూ, "సరే, సరే!" ఆ పైన మాటాడలేక పోయాడు.

గ్రామమునసబుకూడా కంగారుపడ్డాడు. ఏమనాలో తోచలేదు.

"చలిగా వుందనుకుంటా!" అన్నాడు చబ్‌ని సంబోధిస్తూ.

"అవును. కొద్దిగా శీతలంగా వుంది" అని జవాబిచ్చాడు చబ్. "మీరు బూట్లకు బాతుకొవ్వు పూస్తారా, తారు పూస్తారా?" నిజానికి ఈ ప్రశ్న అడుగుదామనుకోలేదు. "యీ సంచిలోకి యెలా వచ్చావ్?" అని అడుగుదామనుకున్నాడు. కాని ఎందుకనో అందుకు పూర్తిగా విరుద్ధమయిన ప్రశ్న వేసాడు.

"తారే సయం!" అన్నాడు గ్రామమునసబు." సరే, వెళ్ళి వస్తా, చబ్!"టోపీ మొహంమీదికి లాక్కుని గుడిసెలో నుంచి వెళ్ళిపోయాడు.

"యింత పిచ్చిపుల్లాయినయి 'బూట్లుకి యేంపూస్తావు' అని అడిగానేవిఁటి?" అన్నాడు చబ్ మునసబు వెళ్ళిన గుమ్మంకేసి చూస్తూ. "యింతకీ సొలోఖా బలే అసాధ్యురాలు! అంత భారీమనిషిని సంచిలోకి యెక్కించింది! అది ఆడదికాదు, దెయ్యం! యిక నేను పిచ్చిపుల్లాయిని – ఆసంచి యేదీ?"

"ఆమూల పారేసాను. అందులో యింకేమీ లేదు." అంది ఒక్సానా.

"దాని సంగతి పూర్తిగా నాకు తెలుసు. అందులో యేమీలేదు. నిజం! యిలా తీసుకురా, యింకోడు వుండాలి.. బాగా దులుపు, యేమిటి? యేమీలేదూ? పాపిష్టిముండ! మహా పతివ్రతలాగా నటించింది!"

ఇక మనం చబ్ని తీరుబడిగా కూర్చుని ఇష్టంవచ్చిన తిట్టమని వదిలేసి కమ్మరి కుర్రవాడి సంగతేవయిందో చూదాం. అప్పుడే ఎనిమిది గంటలు దాటింది.

మొదట్లో, అందులోనూ ముఖ్యంగా బాగా పైకి వెళ్ళినపుడు వకులాకి భయంవేసింది. కింద ప్రపంచం కనిపించడంలేదు. ఈగలాగా చంద్రుడి కిందగా ఎగిరిపోతున్నాడు. తల వంచుకున్నాడు గాని లేకపోతే టోపీ చంద్రుడి తగిలేదే! కాని కొద్దిసేపటికే ధైర్యం వచ్చింది. దయ్యాన్ని వేళాకోళం చేయడం ప్రారంభించాడు. మెడలోనుంచి తమాల మాలను, శిలువను తీసి దగ్గర పెట్టేసరికి దెయ్యం తుమ్మడం, దగ్గడం వకులాకి ఎంతో తమాషాగా ఉంది. వకులా కావాలని తల గోక్కునేందుకు చేయి పైకెత్తితే పాపం! దెయ్యం శిలువ గుర్తు వేస్తాడేమోననే భయంకొద్దీ ఇంకా వేగంగా ఎగిరిపోసాగింది. ఆ ఎత్తున బాగా వెలుతురుగా ఉంది. వెండిలాంటి పొగమంచులో స్నానమాడి వాయు దేవుడు స్వచ్ఛంగా ఉన్నాడు. ప్రతీదీ స్పష్టంగా గోచరిస్తోంది. కుండలోకూర్చుని సుడిగుండంలాగా ఎవరో మంత్రగత్తె విసురుగా వెళ్ళిపోవడం కూడా కనిపించింది. దాగుడుమూత లాడుకోవడానికి నక్షత్రాలు గుమిగూడుతున్నాయి. మేఘంమీద కూర్చుని పిశా

చాలు గిర్రున తిరుగుతూ పోతున్నాయి. ఒక దెయ్యం వెన్నెల్లో నాట్యంచేస్తూ కమ్మరికుర్రవాడు కనిపించగానే టోపీ తీసేసుకుంది. ఒక చీపురుకట్ట మంత్రగత్తెను గమ్య స్థానానికి చేర్చి తిరిగి వెళ్ళిపోతోంది. ఇంకా అనేక అసహ్యా మయినవి కనిపించాయి. అవన్నీ కమ్మరి కుర్రవాడిని చూడ డానికి ఒక క్షణంఆగి మళ్ళీ ప్రయాణం సాగించాయి. ఇలా కమ్మరికుర్రవాడు ఆకాశంలో వెళ్ళగా వెళ్ళగా పీటర్స్‌బర్గ్ మెరుపులా గోచరించింది. దీపాలతో జిగేల్ జిగేల్‌మం టోంది. (ఆరోజున నగరమంతా దీపాలతో అలంకరించారు.) దెయ్యం నగర సింహద్వారం మీదుగా ఎగురుతూ గుర్రంగా మారిపోయింది. వీధిమధ్య పొగరుమోతు గుర్రంమీద కమ్మరి కుర్రవాడు కూర్చుని ఉన్నాడు.

బలే! ఏమి గొడవ, గందరగోళం! కళ్ళు మిరుమిట్లు గొలిపే దీపాలు! రోడ్డుకు రెండునేపులా నాలుగేసి అంతస్తుల మేడలు! గుర్రాల డెక్కలచప్పుడు, బండిచక్రాల బరబర మారుమోగిపోతున్నాయి. అడుగడుగికీ ఇళ్ళు భూమిలో నుంచి మొలిచినట్టున్నాయి. వంతెనలు గడగడలాడిపోతు న్నాయి. బళ్ళు పరుగెత్తుకు పోతున్నాయి. బళ్ళవాళ్ళు, గుర్రపుసవారీలు పెడబొబ్బలు పెడుతున్నారు. నలుదిక్కుల నుంచీ వచ్చేబోయే బళ్ళకింద మంచు గరగర లాడుతోంది. కాలినడకన వెళ్ళేజనం ఒకరినొకరు దగ్గరగా చేరుకుంటు న్నారు. ఇళ్ళదీపాలు చిన్నవి. బాటసారుల కీసీడలు గోడలమీద సాగిపోతున్నాయి: తలను కప్పులను, పొగ గొట్టాలను తాకుతున్నాయి.

కమ్మారి కుర్రవాడు విస్మయంతో చుట్టూ చూసాడు. ఇళ్ళన్నీ లెక్కలేని కళ్ళున్న చేసి తననే కనిపెట్టి చూస్తున్నట్లు అతనికి తోచింది. నూలు ఓవరుకోట్లు వేసుకుని అనేకమంది పెద్దమనుష్యుల్లా కనిపించారు. ఎవరికి నమస్కరించాలో బోధపడలేదు. "అరే! యెంతమంది పెద్దమనుషులు!" అనుకున్నాడు కమ్మారి. "వున్నికోటు వేసుకున్న వాడల్లా సుంకాధికారిలా వున్నాడే! గాజు కిటికీల బగ్గీలలో వెళ్ళేవారంతా మేయర్లో కమీసార్లో, లేకపోతే అంతకంటె గొప్పవాళ్ళో అయివుంటారు!" దెయ్యం పలకరించింది. దాంతో ఈ ఆలోచనలు తెగిపోయాయి.

"తిన్నగా జారినా దగ్గిరికి తీసుకువెళ్ళనా?"

"ఊహూ! నాకు భయంవేస్తోంది" అనుకున్నాడు కమ్మారి. "ఆకురాలుకాలంలో డికాంకా మీదగా యిక్కడికి వచ్చిన జపరోజియే కోసక్‌లు యిక్కడెక్కడో మకాంచేసివుంటారు. జారినా కివ్వడానికి యేదో కాగితాలు తెచ్చారు. వారి సలహా తీసుకోవడం మంచిదనుకుంటా."

"యెయ్, సైతాన్! నా జేబులో కూర్చుని జపరోజియే వాళ్ళదగ్గిరకు తీసుకువెళ్లు."

ఒక్క నిమిషంలో దెయ్యం నలుసంత అయిపోయి కమ్మారికుర్రవాడి జేబులో దూరింది. చుట్టూ చూదామనుకున్నాడు. కాని ఇంతలో పెద్ద ఇంటిముందున్నట్టు తోచింది. మెట్లు ఎక్కి పైకి వెళ్ళాడు. ఏమిచేస్తున్నదీ తెలుసుకోకుండానే ఒక తలుపు తెరిచాడు. అతి అందంగా అలంకరించిన గది, ధగధగ లాడే వెలుతురుచూసి ఒక అడుగు వెనకకు

వేసాడు. డింకాకా మీదుగా ప్రయాణం చేసిన జపరోజియే వారిని గుర్తుపట్టేసరికి ధైర్యంవచ్చింది. ఇక జపరోజియేవారు పట్టుసోఫాలమీద, తారుపూసిన బూట్లకాళ్లకింద పెట్టుకు కూర్చుని మంచి ఘాటయిన పొగాకు తాగుతున్నారు.

"శుభం! దేవుడు మిమ్ము రక్షించుగాక! మళ్ళీ యిక్కడ కలుసుకున్నాం" అన్నాడు కమ్మరి వారి దగ్గరకు వెళ్ళి వంగి నమస్కరిస్తూ.

"యెవరితను?"అని కమ్మరిముందు కూర్చున్న అతడు దూరంగా కూర్చున్న ఇంకొకతనిని అడిగాడు.

"నన్ను మీరు యెరగరా?" అన్నాడు కమ్మరి.

"నేనే, వకులాని, కమ్మరికుర్రవాడిని! ఆకురాలు కాలంలో మీరు డికాంకా మీదుగా వెళుతూ అక్కడ రెండురోజులు మకాంవేసారు. గ్యాపకంలేదూ? భగవంతుడు మీకు ఆయురారోగ్యములు ప్రసాదించుగాక! మీ బగ్గీ ముందుచక్రానికి నేను కొత్త యినపకట్టు బిగించాను.

"ఓహో!" అన్నాడా జపరోజియా మనిషి." బాగా రంగులువేసే కమ్మరి కుర్రాడివా? శుభం! యిక్కడికి యేం పనిమీద వచ్చావ్!"

"యేదో చూసిపోదామని. నాతో—"

"సరే సరే," అన్నాడు ఆ జపరోజియా మనిషి దర్జాగా. రష్యన్ భాష మాటాడగలనని మాటాడి చూపించ డానికి బాగా యుక్రేనియన్ ఉచ్చారణతో, "ఊఁ— యిది మహానగరం, కాదూ!" అన్నాడు.

కమ్మారికూడా కొత్తవాడిలా కనిపించకుండా తన పరువూ నిలబెట్టుకోవాలనుకున్నాడు. అంతేకాకుండా అతనూ పుస్తకంలోలాగా మాటాడగలడు.

"ఓ గొప్ప పట్నం!" అని జవాబిచ్చాడు నిర్లక్ష్యంగా రష్యన్ భాషలోనే. "భవంతులు పెద్దవి కావనలేం. చిత్రాలు అసాధారణంగా వున్నాయి. చాలా యిళ్ళకి బంగారు రేకుతో అక్షరాలు విపరీతంగా చెక్కారు. ఓ, సౌష్టవంమహా గొప్పగా వుంది. వుంది!"

ఇంత సునాయాసంగా కమ్మారికుర్రవాడు రష్యన్ భాష మాటాడడం విని అతని విషయమయి వారు మంచి అభిప్రాయానికి వచ్చారు.

"తరవాత మాట్లాడుకుందాం, యిపుడు మేం జారి నాని దర్శించుకోడానికి వెళ్ళాలి" అన్నారు.

"జారినా దగ్గిరికా? దయయుంచి నన్నూ మీతో తీసుకువెళుదురూ, పుణ్యముంటుంది!"

"నిన్నా?"అని ఒక జపరోజియను అన్నాడు, నాలుగు ఏళ్ళ కుర్రవాడు తననూ గుర్రంమీదకు ఎక్కనియ్యమని మారాంపెట్టితే పెద్దవాడు అదలించే గొంతుతో. "అక్కడ నువ్వేం చేస్తావ్? ఉహుఁ– వీల్లేదు. జారినాతో మా స్వంత వ్యవహారాలు మాటాడవలసివుంది."

"తీసుకు వెళుదురూ!" అని కమ్మారి పట్టుపట్టాడు. "తీసుకువెళ్ళమని చెప్పు!"అని దెయ్యానికి మెల్లిగా చెప్పాడు, గుప్పిటతో జేబుమీద పొడుస్తూ.

దెయ్యంతో ఈమాట చెప్పాడో లేదో ఇంకో జప రోజియను "సరే తీసుకువెళదాం" అన్నాడు.

"సరే, తీసుకువెళదాం!" అన్నారు తతిమ్మావారు కూడా.

"అలా అయితే, మేం వేసుకున్న దుస్తులులాంటివే నువ్వూ వేసుకో!"

కమ్మరి కుర్రవాడు తొందర తొందరగా ఆకుపచ్చని అంగరఖా వేసుకుంటుంటే, తలుపుతోసుకుని జలతారు దుస్తులు వేసుకున్న ఒక వ్యక్తి వచ్చి వెళ్ళేవేళయిందని హెచ్చరించాడు.

కమానులమీద ఊగిపోయే పెద్ద కోచీలో కూర్చుని జోరుగా వెళుతూంటే రోడ్డుకి రెండువేపులా నాలుగేసి అంతస్తుల భవనాలు పరుగెత్తుతున్నట్టు అనిపించాయి కమ్మరి కుర్రవాడు ఆశ్చర్యపడిపోయాడు.

"అరే, యేం వెలుతురు, యేంవెలుతురు!" అని తనలో తాను అనుకున్నాడు. "పట్టపగలుకూడా యింటో యింత వెలుతురు వుండదే!"

కోచీలు రాజమందిరం ముందు ఆగాయి. జపరోజియే వారు దిగి, బ్రహ్మాండమయిన కుహరిక (పోరి) లోకి వెళ్ళి, జిగేలు జిగేలుమనే దీపాలతో అలంకరించిన మెట్లు ఎక్క సాగారు.

"బలే, యేం మెట్లు!" అని కమ్మరి తనలో తాను అనుకున్నాడు. "కాళ్ళతో తొక్కడం నిజానికి అపచారం.

యేం అలంకరణ! కథలన్నీ కల్లంటారు. కొంతమట్టుకు నిజమే గాని, యేం కటకటాలు, యేం పనితనం! ఒక్క యినుముకే యే యాభై రూబుళ్ళో అయివుంటుంది!''

మెట్లుఎక్కి పైకి వెళ్ళిన తరవాత జపరోజియేవారు మొదటి కచేరీ గదిలోనుంచి నడిచివెళ్ళారు. అడుగడుగుకీ, సరంబీమీాద ఎక్కడ పడిపోతానో అన్న భయంతో కమ్మరి వారి వెనకాలే నడవసాగాడు. ఇలా మూడు కచేరీ గదుల గుండా వెళ్ళాడు. కమ్మరి కుర్రవాడు వాటిని మెచ్చుకోవడంలో నిమగ్నుడయాడు. నాలుగో గదిలో ప్రవేశించగానే గోడమీాద వేలాడే చిత్రపటం దగ్గరకు వెళ్ళకుండా ఉండలేకపోయాడు. అది చంటిబిడ్డను ఎత్తుకున్న మేరీమాతచిత్రం!

"యేం చిత్రపటం! యేం చిత్రపటం! అద్భుతంగా వుంది!'' అనుకున్నాడు.

"అరె, మాటాడుతున్నట్టుంది! సజీవంగా వున్నట్టుంది! పవిత్రమయిన బిడ్డ! చిన్నారి చేతులు నలుపుకుంటూ మందహాసం చేస్తోంది! ఆ రంగులు! అరె, యేం రంగులు, యేం రంగులు! వాటిలో ఒక్క కోపెక్ ఖరీదుచేసే జేగురు మన్ను యెక్కడా వున్నట్టులేదు! మరకత రంగు, కెంపు రంగు! యిక నీలిరంగు వూరికే మెరిసిపోతోంది! బలే కళాఖండం! చాలాఖరీదయిన సీస భస్మంతో మొదటిపూత పూసారనుకుంటా. బొమ్మ అద్భుతంగా వుంది! యీ యిత్తడి తలుపు పిడి,'' అన్నాడు తలుపుదగ్గరకు వెళ్ళి తాళం తడుముతూ. "యిది యింకా అద్భుతంగా వుంది. అరె, యెంత చక్కగా తయారు చేసారు! బహుశా జర్మనీ కమ్మర్లు

తయారుచేసి వుంటారు. ఖరీదుకూడా చాలా హెచ్చు అయి వుంటుంది !''

కమ్మరికుర్రవాడు చాలాసేపటివరకూ అలా ఆలోచిస్తూనే నిలబడిపోయేవాడే గాని ఇంతలో ఒక నౌకరువచ్చి మోచేతితో పొడిచి వెడన పడవద్దని హెచ్చరించాడు. జపరోజియేవారు ఇంకా రెండు గదులు దాటి మూడోదాంటో ప్రవేశించి ఆగారు. అందులో బంగారపు సరిగవేసిన దుస్తులు ధరించిన సేనానులు ఉన్నారు. జపరోజియే వారు కుడివేపుకు ఎడమవేపుకి వంగి నమస్కరించి కలిసి కట్టుగానిలబడ్డారు.

ఒక నిమిషం తరవాత సేనాధిపతి దుస్తులు, పసుపు పచ్చని బూట్లు ధరించి ఒక వ్యక్తి ఠీవిగా నడుస్తూ లోపలకు వచ్చాడు. స్థూలకాయుడు. వెంట పరివారం ఉంది. జుట్టు గజిబిజిగా ఉంది. కోరచూపు. ఎప్పుడూ ధుమధుమలాడే మనిషని ముహం చెపుతోంది. ప్రతికదలికలోనూ అధికార దర్పం గోచరిస్తోంది. బంగారు సరిగదుస్తులతో దర్జాగా అటూఇటూ పచార్లు చేస్తున్న సేనానులు ఆయనచుట్టూ గుమిగూడి మాటమాటకు వంగి నమస్కరిస్తూ, కాస్త సైగచేస్తే చాలు ఆయనకోరిక తీర్చడానికి పరుగెత్తేందుకు సిద్ధంగా ఉన్నట్టు కనిపించారు. కాని ఆయనమాత్రం దాని నేమీ గమనించకుండా వారిని చూసి తల పంకించి జపరోజియే వారిదగ్గరకు వెళ్ళాడు.

జపరోజియే వారు నేలదాకా వంగి నమస్కరించాడు.

"అంతా వచ్చారా?" అని కొద్దిగా ముక్కుతో దీర్ఘాలు తీసాడు.

"ఆఁ - వచ్చాం, బాట్కో•!" అని జవాబిస్తూ జప రోజియే వారు తిరిగి వంగి నమస్కరించారు.

"నేను చెప్పినట్టు మాట్లాడాలి, మర్చిపోకండేం!"

"మర్చిపోం, బాట్కో!"

"యీాయనేనా జారు?" అని కమ్మరి కుర్రవాడు జప రోజియే వారిలో ఒకనిని ప్రశ్నించాడు.

"జారు? ఆఁ - పొటెమ్కిన్!"

పక్కగదిలో గొంతులు వినిపించాయి, పట్టుగౌనులు ధరించి అనేకమంది స్త్రీలు, బంగారు జలతారుకోట్లు, తల వెనక జడలేసుకుని దర్బారీయలు ఎటునుంచి వచ్చారోకూడా కమ్మరికుర్రవాడు గమనించలేకపోయాడు, కళ్ళు జిగేలు జిగేలుమన్నాయి. అంతే. ఇంకేమీ కనిపించలేదు.

జపరోజియే వారు మోకరిల్లి ఏకకంఠంతో "దయ జూడు మామో * దయజూడు!" అని అరిచారు.

ఏమీ కనిపించకపోయినా కమ్మరి కుర్రవాడుకూడా శ్రద్ధాభక్తులతో మోకరిల్లాడు.

"యిక లేవచ్చు" అని రాజసంతో కూడినా విన సొంపయిన గొంతు వినిపించింది. కొంతమంది దర్బారీయులు గడబిడగా తిరుగుతూ జపరోజియే వారిని ఇక లెమ్మని మోచేతితో పొడిచారు.

---

• బాట్కో అంటే యుక్రేనియన్ బాషలో తండ్రి.

* మామో..........................తల్లి

"మేం లేవం, మామో! లేవం! చచ్చినా లేవం."
అని అరిచారు జపరోజియే వారు.

హాలెమ్కిన్ పెదవులు కొరుక్కున్నాడు. స్వయంగా వెళ్ళి జపరోజియేవారిలో ఒకనితో మెల్లగా ఖండితంగా లేచి తీరాలని చెప్పాడు. దానిమీద జపరోజియేవారంతా లేచి నిలబడ్డారు.

అప్పుడు కమ్మరికుర్రవాడు తలఎత్తి చూడడానికి సాహసించాడు ఎదురుగా ఒక స్త్రీ కనిపించింది. పొట్టిగా బొద్దుగా ఉంది. నీలికళ్ళు, ఆమె ఠీవి, తేజస్సుచూస్తే మహారాణిలాగా ఉంది. ఆ ఠీవికి, ఆ తేజస్సుకు ఎంతటివారయినా తల వంచాల్సిందే!

"యింతవరకు నేను చూడని నా ప్రజలను పరిచయం చేస్తానని రాజుగారు మాటయిచ్చారు" అంది ఆ నీలికళ్ళ యువతి, ఆసక్తితో జపరోజియేవారిని పరీక్షగా చూస్తూ. "మీ కన్నిసదుపాయాలు యిక్కడ చూపిస్తున్నారా?"

"ఆఁ - కృతజ్ఞులం, మామో! మాకు పంపుతున్న ఆహార పదార్థాలు భేషుగ్గా వున్నాయి. కాని మాంసం మాత్రం మా జపరోజియేలో వున్నంత మజాగా లేదు."

తాను చెప్పిన పాఠానికి విరుద్ధంగా జపరోజియేవారు మాటాడేసరికి హాలెమ్కిన్ కోపంతో మొగం ముడుచుకున్నాడు.

ఆ జపరోజియే వారిలో ఒకడు దర్జాగా ముందుకువచ్చి అన్నాడు!

"దయజూడు, మామో! మీకు విశ్వాసపాత్రులయిన వారిని శిక్షించడం దేనికి? మీకు కోపం తెప్పించామా? ఆ నీచపు తాతార్లతో స్నేహంకట్టామా? టర్కీవాళ్ళతో ఒడంబడికకు వచ్చామా? క్రియలలోగాని మాటలలోగాని మీకు ద్రోహం తలపెట్టలేదే? మామీద దాడిచేయడానికి కోటులుకట్టమని ఆజ్ఞాపించినట్లు విన్నాం. తరవాత మమ్మల్ని శాశ్వత సైన్యంలో చేర్చదలచారని విన్నాం. యిప్పుడు యింకేవేవో చెడువార్తలు వింటున్నాం. జపరోజియే సైన్యాలు చేసిన తప్పేమిటి? పెరెకోప్ మీదుగా మీ సైన్యాలను నడిపించి క్రిమియా వారిని ఓడించడంలో మీ సేనానులకు తోడ్పడ్డం అపరాధమా!"

పొటెమ్కిన్ చేతులకు తొడిగిన వజ్రాలను నిర్లక్ష్యంగా చిన్నకుంచెతో తుడుస్తూ ఏమీ మాటాడలేదు.

"యింతకీ మీకేంకావాలి?" అని కాథరిన్ని అడిగింది ఆప్యాయంగా.

జపరోజియేవారు భావగర్భితంగా ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

"యిదే తగిన సమయం! జారినా 'మీకేంకావాలి' అని అడిగిందిగదూ!" అని కమ్మరి కుర్రవాడు తనలోతాను తలపోసి హఠాత్తుగా నేలమీద సాష్టాంగపడ్డాడు.

"మహారాణీ! నన్ను శిక్షించవద్దు. దయజూపు! మీపాదాల ముచ్చెలు, ఒహో! దేంతో చేసారోగాని! మన్నించండి. యిటువంటి ముచ్చెలు తయారు చేయగల

వాడు యీ భూప్రపంచంలో యెక్కడాలేడు. నా భార్యకే గనక యిటువంటి ముచ్చెలు తొడిగేయోగం పట్టితేనా!''

మహారాణి నవ్వింది దర్బారీయులా నవ్వారు. పొటెమ్కిన్ మొహం చిట్లించుకుని నవ్వాడు కమ్మరి కుర్ర వాడికి ఏమయినా పిచ్చి ఎత్తిందేమో అనే భ్రాంతితో జప రోజయేవారు అతనిని మోచేతులతో పొడిచారు.

''లే'' అంది మహారాణి దయతో. ''యిటువంటి ముచ్చెలేగనక నీకు కావాలంటే తెప్పించి యివ్వడం తేలికే. బంగారం నగిషీచెక్కిన మాంచి ముచ్చెలు తెచ్చి యివ్వండి! పాపం అమాయకుడు. యితడి అమాయకత్వానికి నాకెంతో సంతోషమయింది. యిది నీ హాస్యరచనకి తగిన యితివృత్తం అంది మహారాణి. ఒక మధ్యవయసు వ్యక్తికేసి తిరిగి అతని మొహం బుంగమొహం. పాలిపోయిఉంది. తక్కినవారికి కొంచెం ఎడంగా నిలబడ్డాడు. సామాన్యమయిన కోటూ, ముత్యపుచిప్ప గుండీలూ చూస్తే అతను దర్బారీయుడు కాడని తోస్తుంది.

''మహారాణీ నామీదవుండే దయకొద్దీ అలా అంటు న్నారుగాని, లాఫాంటెన్ అంతటివాడు రచించతగిన యితి వృత్తం యిది!'' ముత్యపుచిప్ప గుండీల వ్యక్తి వంగి నమ స్కరిస్తూ.

నిజం చెపుతున్నాను. నీ బ్రిగేడియర్ * నాటకం యెంత రసవంతంగా వుందనుకున్నాన్ ! యిప్పటికీ మరిచిపో

---

* బ్రిగేడియర్ : డి. ఐ. ఫోన్‌విజాన్ (1742-1792) అనే రష్యన్ హాస్య రచయిత రచించిన నాటకం.

లేకుండా వున్నా. చదవడం కూడా బలేబాగుంది! గదిలో మీాదు," అంది మహారాణి జపరోజియేవారికేసి తిరిగి, "ఒక్కరూ పెళ్ళిచేసుకోలేదటగా?"

"అదెలా, మాామో, పెళ్ళాం అంటూ లేకుండా మగాడు బతకలేడని మీాకు తెలిసిందేగా." అని జవాబిచ్చాడు. కమ్మరి కుర్రవాడితో మాటాడిన జపరోజియే మనిషి, అందులోనూ ఇంత మోటుగా మాటాడడం కమ్మరికి ఆశ్చర్యం గొలిపింది. అతనయితే పుస్తకంలోలా పసందుగా మాటాడేవాడు.

"వీళ్ళు వట్టి జిత్తులమారివాళ్ళు" అనుకున్నాడు తనలోతాను. "అయితే యిలా వూరికే మాటాడి వుండడు."

"మేమేమీా మహర్షులంకాం" అంటూ మళ్ళీ మొదలుపెట్టాడు ఆ జపరోజియే మనిషి. "పాపాత్ములం, పాపాలు చేస్తుంటాం. మాలో చాలామదికి పెళ్లాలున్నారు. కాని వారితో గదిలో కాపరం చేయడంలేదు. కొంతమందికి పోలండులో, కొంతమందికి యుక్రెయిన్‌లో, మరికొందరికి టర్కీలో భార్యలున్నారు."

ఇంతలో ముచ్చెసు తీసుకువచ్చారు.

"ఒహోహో! యేంనగిషీ! యేంనగిషీ! అని అరిచాడు కమ్మరికుర్రవాడు ముచ్చెలు తీసుకుంటూ, "మహారాణీ! మీారు పాదాలకు తొడిగిన ముచ్చెలే యిలావుంటే, యిక ఆ పాదాలు! ఒహోహో చక్కెరతో చేసినవయి వుండాలి!"

మహారాణి పాదాలు తీర్చి దిద్దినట్టు మనోహరంగా ఉంటాయి. జపరోజియే దుస్తులు వేసుకున్న మొహం బుంగ

మోహమయి ఆ అమాయక కమ్మరికుర్రవాడి నోటవెంట చేయబడిన ఈ పొగడ్తకు మహారాణి చిరునవ్వు నవ్వకుండా ఉండలేకపోయింది.

ఎంతో దయతో ఆదరించిందనే సంతోషంతో కమ్మరి కుర్రవాడు జాతినాను అన్ని విషయాలు క్షుణ్ణంగా చెప్పమని అడిగేవాడే. ముఖ్యంగా జాతు తేనె, పంది మాంసంలాంటివి తప్ప ఇంకేమీ ముట్టడం నిజమేనా అని ప్రశ్నిద్దామనుకున్నాడు. కాని జపరోజియే వారు డొక్కలో పొడిచేసరికి ఇక మాటాడకూడదని నిశ్చయించుకున్నాడు. మహారాణీ పెద్దలవంక తిరిగి వారి జీవిత విధానంగురించీ, గడీలోని ఆచార వ్యవహారాలను గురించీ ప్రశ్నించ సాగింది. కమ్మరి కుర్రవాడు వెనకకు తగ్గి, జేబువరకూ వంగి, మెల్లగా, "యిక్కడినించి నన్ను తొందరగా తీసుకువెళ్ళిపో." అన్నాడు కన్నుమూసి తెరిచినంతలో నగరంబయట ఉన్నాడు.

"నీళ్ళల్లో మునిగిచచ్చాడు. యెంత వొట్టుపడితే అంత వొట్టు, చచ్చాడు. నామాట అబద్ధమయితే నాతల పండు పగిలిపోతుందనుకోండి" అంది సత్తిగా సాలెవాని బొద్దు పెళ్ళాం, నడివీధిలో డికాంకా స్త్రీలమధ్య, నిలబడి.

"నేనా అబద్ధాలమారిదాన్నా? యెవరి సొత్తన్నా యెత్తుకుపోయానా? నామాట నమ్మకపోవడానికి నేనెవరికీ అపకారం చేయలేదే?" అని ఒక ఎర్రటి ముక్కుయువతి కేకలుపెట్టింది చేతులు ఊపుకుంటూ. "కమ్మరి కుర్రాడు చేతులారా ఉరేసుకుచావడం ముసిలి పెరెపెర్చెనా కళ్ళారా చూడకపోతే నాకు మంచినీళ్ళన్నా పుట్టవనుకో"

"కమ్మరి కుర్రాడు వురేసుకుచచ్చాడా? అబ్బ. నేనయితే అలా యెన్నటికీ చేయను" అన్నాడు గ్రామ మునసబు చబ్ గుడిసెలోనుంచి బయటికి వస్తూ.

మంచినీళ్ళంటావేఁ? వోడా పుట్టదను! తాగుమోతు ముండా!" అని జవాబిచ్చింది సాలివాని భార్య. "ఉరేసుకు చావడానికి నీకుమల్లే వాడికి పిచ్చాయేం? ఏళ్ళల్లో మునిగి చచ్చాడు. మంచు బోరియలో మునిగిపోయాడు; నువ్విప్పుడు సారాదుకాణంనించి వచ్చావని నాకు తెలీదూ? అలాగే అతని సంగతి తెలుసు."

గయ్యాలిగంప! యేవిఁటీ ఆ తప్పుడు మాటలు" అంది ఎర్రముక్కోయువతి కోపంతో. "యిక నోరుముయ్, దుష్టముండా! ప్రతిరోజూ సాయంత్రం బాండారి నీకోసం మీ యింటికి రావడం నాకు తెలీదనుకున్నా?"

సాలివాని భార్య మండిపడుతూ,

"బాండా రేవిఁటి? నీ మొహం! యెవ తెదగ్గిరికి వెళు తున్నాడు యేవిటీ పచ్చి అబద్దాలూ నువ్వూ!" అఁది.

"బాండారి?" ఆ పోట్లాడుకునే స్త్రీలదగ్గరకు చేరుకోవ డానికి దోవతీసుకుంటూ బాండారి భార్య గొంతుతో అడి గింది.

"బాండారిని చూపిస్తా. బాండాఁ అన్న దెవరు?"

"యీ ముండయింటికే బాండారి వెళ్ళేది!" అంది ఎర్రముక్కుయువతి సాలివాని భార్యను వేలితో చూపుతూ.

"నేనేనా, లంజా" అంది బాండారి భార్య సాలివాని భార్యదగ్గరికి అడుగిడుతూ "నువేనా మందులూ మాకులూ పెట్టి రప్పించుకుంటూాంది."

"దెయ్యంముండా, యేమిటే!" అంటూ సాలివాని భార్య వెనకకు చూచింది.

పాపిష్టిముండా! నీ పిండంపెట్ట! దుష్టుముండ!"

ఇలా అంటూ బాండారి భార్య సాలివానిభార్య మొహంమీాద తుబుక్కున ఉమ్మేసింది.

సాలివాడి భార్యమాత్రం ఊరుకుండా, మళ్ళీ ఉమ్మేయాలని చూసింది. కాని పోట్లాట ఇంకా బాగా వినాలనే కుతూహలకొద్దీ వారిదగ్గరకు వచ్చిన గ్రామమునసబు గడ్డం మీాద ఉమ్మిపడింది.

"దరిద్రపుముండా అని కేకపెట్టాడు మునసబు కోటు అంచుతో మొహం తుడుచుకుంటూ, కొరడా ఎత్తాడు.

దాంతో బిగ్గరగా తిడుతూ అందరూ నాలుగు దిక్కులకు పరుగెత్తారు.

"ఛీ!" అన్నాడు మునసబు, మొహం ఇంకా తుడుచుకుంటూనే. "సరే, కమ్మరికుర్రాడు నీళ్ళల్లోపడి చచ్చిపోయాడన్నమాట! పాపం! యెంత గొప్ప చిత్రకారుడు! మంచి మంచి కత్తులు, కొడవళ్ళు, నాగళ్ళు చేసేవాడు! బలశాలి! అవును." అంటూ తలపోయసాగాడు. మా వూళ్ళో వాడిలాంటివాళ్లు ఆట్టేమంది లేరు. ఆ వెధవసంచిలో వుండగానే వాడు విచారంలో పడివున్నాడని పసిగట్టా, సరే,

పాతం, వాడిబతుకు యీ విధంగా వెలమారిపోయిందన్న మాట! నిన్నటిదాకా తిరుగుతూనే వున్నాడు. యివాళ మాయమయిపోయాడు. నేనేమో యింకా నూ మచ్చల గుర్రానికి నాడాలు వేయిద్దామనుకున్నా!"

నిజమయిన క్రైస్తవునిలా ఇలా తలపోస్తూ మునసబు తన గుడిసెకు జారుకున్నాడు.

కమ్మరికుర్రవాడి మరణవార్త విని ఒక్సానా చాలా బాధపడింది. పెరెపెచ్చికా చూసిందనే విషయంలో, ఆడ వాళ్ళ వాగుడులో ఆమెకు నమ్మకం కుదరలేదు. ఆత్మ హత్యా పాపానికి ఒడిగట్టి చేతులారా నరకంలో పడడానికి కమ్మరికుర్రవాడు ఇష్టపడేవాడు కాదని ఆమెకు తెలుసు. కాని ఇక తిరిగిరాగూడదనే నిశ్చయంతో ఎక్కడికయినా వెళ్ళిపోయాడేమో! అంత చక్కనివాడు దొరకడం దుర్లభం! ఆమెను ఎంతగా ప్రేమించాడు! అందరికంటే ఎక్కువగా ఆమె చపలచిత్తాన్ని ఓర్చుకున్నాడు. రాత్రంతా పక్కమీద అటూ ఇటూ దొర్లింది. నిద్రపట్టలేదు. చీకటి. ఆమెశరీరమే ఆమెకు కనిపించడంలేదు. నగ్నంగా అటూఇటూ దొర్లుతూ బిగ్గరగా తననుతానే నిందించుకుంది. మళ్ళీ శాంతపడి ఇంకేమీ ఆలోచించకుండా పడుకోవాలని నిశ్చయించుకుంది. కాని అదేపనిగా ఆలోచిస్తూనేఉంది, తహతహ లాడిపోయింది. తెల్లవారేసరికి కమ్మరికుర్రవాడిమీద ప్రేమలో మునిగి పోయింది.

వకులా మరణవార్త విని చబ్ సంతోషమూ ప్రకటించలేదు, విచారమూ ప్రకటించలేదు. అతని ఆలోచనలన్నీ

ఒకేఒక విషయంమీద కేంద్రీకృత మయ్యాయి. తనకి సాళ్లూ చేసిన ద్రోహం మరిచిపోలేకపోయాడు నిద్రలో కూడా ఆమెను తిట్టిపోయడం మానలేదు.

తెల్లవారింది తెల్లవారకపూర్వమే చర్చిలో జనం కిటకిటలాడుతున్నారు. వృద్ధస్త్రీలు తెల్లటి పాగాలు పెట్టుకుని తెల్లటి జాకెట్లుతొడుగుకుని చర్చి మండపంలో శిలువగుర్తుల వేసారు. ఆకుపచ్చ జాకెట్లు, పసుపుపచ్చ జాకెట్లు ధరించి కొంతమంది స్త్రీలు, బంగారుపూత వెన్నెల ముతక నీలిజాకెట్లు ధరించి కొంతమందిస్త్రీలు వారిముందు నిలబడ్డారు. బండెడ రిబ్బన్లు తలలో పెట్టుకుని, హారాలు, శిలువలు, నాణేల మెడలో వేసుకుని దేవతా విగ్రహపీఠం దగ్గరికి చేరుకోవాలని బాలికలు దోవచేసుకు వెళుతున్నారు. అందరికీ ముందు పెద్ద మనుషులు, సామాన్య రైతులు నిలబడ్డారు. రైతులకు మీసాలు, పిలకజుట్లు, మొద్దుమెడలు, నున్నటి గడ్డాలు.వీరిలో చాలామంది పడగదుస్తులు ధరించారు. దుస్తులకింద తెల్లటి ముతక నీలిచొక్కాలు తొంగి చూస్తున్నట్లున్నాయి. ప్రతి వాడి మొహంలోనూ ఉల్లాసం తాండవిస్తోంది. ఉపవాసం విరమించి ఇక మాంసం రుచి చూడవచ్చుననే కాంక్షతో మనసబు లొట్టలు వేయసాగాడు. బాలురతోకూడి మంచు మీాద ఎలా జారదామా అని బాలికలు ఆలోచిస్తున్నారు. వృద్ధస్త్రీలు ఎంతో భక్తిశ్రద్ధలతో ప్రార్థనలు చేస్తున్నారు. కోసక్ స్వార్చిగజ్ నేలదాకా వంగి నమస్కరించడం చర్చి అంతటా ధ్వనించింది. ఒక్క ఒక్సానాకు మాత్రం మనసు మనసులోలేదు. ప్రార్థిద్దామని అనుకోకుండానే ప్రార్థించింది.

ఒక దానికంటె ఒకటి బాధాకరమయిన విభిన్నభావాలు ఆమె మనసులో మూగాయి. మొహంలో విపరీతమయిన ఆందోళన గోచరించింది. కళ్ళల్లో నీళ్ళు తారాడాయి. ఇదంతా ఎందుకు వచ్చిందో బాలికలకు అర్థంకాలేదు. కారణం కమ్మరికుర్రవాడని అనుమానం కలగలేదు. కమ్మరికుర్రవాడిని గురించి ఆందోళన పడుతున్నది ఒక్క ఒక్కానాయేకాదు! గ్రామస్థులకు ఆరోజు సెలవు అనిపించలేదు. ఏదో కొరత కనిపించింది. సంచిలో పడుండి ప్రయాణం చేసాడేమో బాండారి గొంతు బొంగురుబోయింది. మాట సరిగ వినిపించడంలేదు. ఆఊరు చూడడానికి వచ్చినగాయకుడు అద్భుతంగానే పాడాడు. కాని కమ్మరికుర్రవాడు ఉన్నట్టయితే ఇంకా ఎంత బాగుండేది! 'మాతండ్రి', 'దేవదూత' అనే పాటలు పాడుతూంటే పాటకులమధ్యకు వచ్చి పొల్లావాలో వాళ్ళు పాడినట్టే చక్కగా పాడేవాడుగదా! అంతేగాదు. అతను ఒక్కడే చర్చి వార్డెనుపనులు చేసేవాడు. ఉదయప్రార్థనలు ముగిసాయి, ప్రార్థనల అనంతరం పూజలు జరిగాయి... ఇంతకీ కమ్మరికుర్రవాడు ఎక్కడికి మాయమయిపోయినట్టు?

వేకువజామున కమ్మరి కుర్రవాడిని తీసుకుని దెయ్యం బహువేగంగా ఎగిరివచ్చి క్షణంలో అతని గుడిసెముందుకు చేర్చింది. సరిగ్గా ఆ సమయానికి కోడికూసింది.

"యెక్కడికి వెళతావ్?" అంటూ కమ్మరికుర్రవాడు అరిచాడు పారిపోవాలనిచూస్తున్న దెయ్యం తోకపట్టుకుని. "కాస్త ఆగు, నేస్తం, యింకా పని పూర్తికాలేదు. నీకు నేను

కృతజ్ఞత తెలపాలిగదూ!" చువ్వతీసుకుని దెయ్యాన్ని మూడు ఉలికాను. సుంకాగ్నికాంతి కంటపడకుండా పారిపోయేరై తులాగా. దెయ్యం దాంట్లో పరుగుచ్చుకుంది. ఇతర్లను మోసగించి, ప్రలోభపరచి గాడిదలను చేయడానికి బదులు మానవజాతికి శత్రువయిన దెయ్యం తానే గాడిద అయింది. ఆతరవాత పకీలా బయటి గదిలోకి వెళ్ళి గడ్డిలో గుంటచేసుకుని మధ్యాహ్న భోజనం వేళవరకూ నిద్రపోయాడు. నిద్ర లేచేసరికిబాగా పొద్దెక్కింది. "అరె! అతిగా నిద్రపోయి ప్రార్థనలకు, పూజలకు వెళ్ళకపోతినే" అని విచారపడ్డాడు.

ఆత్మహత్యాపాతకానికి ఒడిగట్టినందుకు భగవంతుడు శిక్షగా తనకు ఇంత నిద్ర పట్టించడంవల్ల ప్రార్థనలకు పూజలకు వెళ్ళలేకపోయానని కమ్మరికుర్రవాడు బాధపడ్డాడు. వచ్చేవారం ఈ పాపాన్నంతటినీ ఫాదరీముందు ఒప్పుకుని ప్రాయశ్చిత్తంగా సంవత్సరంపాటు ప్రతిరోజూ యాభైసార్లు వంగి భగవంతుడికి నమస్కరించాలని సంకల్పించుకుని, ఆ విధంగా మనశ్శాంతి కలిగించుకుని లోపలికి తొంగిచూసాడు. లోపల ఎవరూ లేరు. సోలోఖా ఇంకా ఇంటికి తిరిగిరాలేదు.

కోటు జేబులోనుంచి జాగ్రతగా ముచ్చెను పైకి తీసి దాని పనితనానికి, కిందటిరాత్రి జరిగిన సాహసోదంతానికీ ఆశ్చర్యపడసాగాడు. స్నానంచేసి, జపరోజియేవారు ఇచ్చిన దుస్తులు ధరించాడు. పెట్టెలోనుంచి కొత్తటోపీ తీసాడు. టోపీ పైభాగంముదురు నీలిరంగుగా ఉంది. పోల్టావాలో కొన్నాడు. ఇంతవరకు ఒకసారికూడా పెట్టుకుని ఎరగడు. ఏడు రంగుల కొత్తకాసికోకకూడా పైకి తీసాడు. ఇవీ ఒక కొరడా

జేబురుమాలులో చుట్టి తిన్నగా చబ్ దగ్గరకు బయలు దేరాడు.

కమ్మరి కుర్రవాడు లోపలకు అడుగుపెట్టేసరికి చబ్ కళ్ళు ఇంతంతచేసుకుని చూసాడు. కమ్మరికుర్రవాడు బతికినందుకు ఆశ్చర్యపోవాలో, ధైర్యంగా తనను చూడ డానికి వచ్చినందుకు ఆశ్చర్యపోవాలో, షోగ్గా జమరోజీయే దుస్తులు ధరించినందుకు ఆశ్చర్యపోవాలో అతనికి తోచలేదు. అంతేకాదు వకులా జేబుమూత ఊడతీసి కొత్తటోపీ, అపు రూపమయిన కాసికోక బయటపెట్టి మోకరిల్లి "దయజూడు, బాట్కో! చితకగొట్టు. కాని కోప్పడకు! యిదిగో కొరడా, నీ యిష్టం వచ్చినట్టుకొట్టు, నన్ను అప్పగిస్తున్నాను. లెంపలు వాయించుకుంటాను. కాని కోప్పడకు. ఒకప్పుడు నువ్వు మా నాన్నకి సహచరుడివి యిద్దరూ ఒక కంచంలోతిని, ఒక గ్లాసులో తాగారు!" అనేసరికి చబ్ క మరింత ఆశ్చర్య పోయాడు

ఎవరికీ తలవొగ్గనివాడు, కోపెక్ నాణేలు, గుర్రపు నాడాలు రొట్టెముక్కలలాగా వంచగలిగినవాడు తనముందు మోకరిల్లడం చబ్ కి సంతోషం కలిగించి ది. కాని ఆ సంతోషం కనపడనీయకుండా దర్జా నిలబెట్టుకోవడానికి కొరడా తీసుకుని కమ్మరికుర్రవాడి వీపుమీద మూడుదెబ్బలు కొట్టాడు.

"యిక చాలు, లే! పెద్దలమాట పాటిస్తుండు యిది వరకు జరిగినదంతా మరిచేపోదాం. యిప్పుడు నీకేం కావాలో చెప్పు."

"ఒక్సానానిచ్చి పెళ్ళిచేయి, శాస్కా!"

చబ్ కొంచెంసేపు ఆలోచించాడు. టోపీకేసి, కాసి కోకికేసి చూసాడు. టోపీ అందంగా ఉంది. కాసికోక దాని కేం తీసిపోవడం లేదు. సోలోఖాచేసిన ద్రోహం తలుచుకుని, దృఢనిశ్చయంతో. "సరే యిక వెళ్ళి పెళ్ళిరాయబారుల్ని పంపించు!"

"ఆఁ-" అని అరిచింది ఒక్సానా, గుమ్మంలో కాలు పెట్టేసరికి కమ్మరికుర్రవాడు కనిపించాడు. సంతోషంతో, ఆశ్చర్యంతో అతని కేసి తేరిపార జూసింది.

"యిదిగో చూడు, యెటువంటి ముచ్చెలు తెచ్చానో" అన్నాడు వకులా. "జారినా తొడిగేవి సరిగ్గా యిలాంటివే!"

"ఉహుఁ- వద్దు. నాకు ముచ్చెలువద్దు!"అంది చేతులు ఆడిస్తూ అతనిమీదనే దృష్టినిలిపి. "ముచ్చెలు అక్కర్లేకుం డానే యిష్టపడతాను—" సిగ్గువేసి ఆ పైన మాటాడలేదు.

కమ్మరికుర్రవాడు ఆమె చేరువకు వెళ్ళి చేయి పట్టుకున్నాడు. ఆ అందగత్తె కిందికి చూసింది. అంతకుముందు ఎన్నడూ అంత అందంగా ఆమె కనిపించలేదు. ముగ్ధుడయిపోయి ఆమెను మెల్లగా ముద్దుకున్నాడు. సిగ్గుతో ఆమె మొహం ఎర్రవారంది. ఇంకా అందం చేకూర్చుకుంది.

ఒకతడవ బిషప్పుగారు డికాంకామీదుగా ప్రయాణం చేస్తూ ఆ ప్రదేశాన్ని మెచ్చుకున్నారు. వీధివెంట వెళ్తూ ఒక కొత్తకుటీరంముందు ఆగారు.

"యింతచక్కగా రంగులువేసి వుంది, యెవరికుటీరం యిది?" అని ఆయన చంకలో బిడ్డను పెట్టుకుని గుమ్మంలో నుంచున్న ఒక అందగత్తెను ప్రశ్నించాడు.

"కమ్మరి వకులా కుటీరం!" అంది ఒక్సానా వంగి నమస్కరిస్తూ. గుమ్మంలో నుంచున్న అందగత్తె ఒక్సానా అని వేరే చెప్పాలా!

"బలే! బలే పనితనం!" అన్నాడు బిషప్పు తలుపులు కిటికీలు పరీక్షగా చూస్తూ. కిటికీలచుట్టూ ఎర్రరంగు వేసి ఉంది. తలుపులనిండా నోట్లో పైపులు పెట్టుకొని గుర్రాల మీద కూర్చున్న కోసక్ బొమ్మలు! పాపపరిహారార్థం గర్భ గుడి ఎడమగోడకు డబ్బు పుచ్చుకోకుండా, ఆకుపచ్చరంగు పూలు వకులా వేసాడని తెలుసుకుని బిషప్పు మరింతగా పొగిడాడు.

అంతేగాదు, గోడమీద, చర్చిలోకి ప్రవేశించేవైపున నరకలోకంలోని దెయ్యంబొమ్మ గీసాడు. దాని రూపురేఖలకు అసహ్యించుకుని ప్రతివాడూ కాండ్రించి ఉమ్మివేసేవాడు. చంటిపిల్లలు ఏడవడం మానకపోతే తల్లులు వాళ్ళని ఆబొమ్మ దగ్గరకు తీసుకువెళ్ళి "అదిగో, చూడు, దెయ్యం" అనేసరికి కన్నీళ్ళు గుడ్లల్లోనే కుక్కుకుని, బొమ్మవంక జూసి తల్లులను పిల్లలు కరుచుకునేవారు.





# భయంకర ప్రతీకారం

కీవ్ పట్టణంలోని ఒకానొక పేటలో మహా కోలాహలంగా ఉంది. కోసక్ కాప్టెను గోరోబెట్స్ కొడుకు వివాహం. చాలామంది అతిథులు వచ్చారు. పూర్వం జనులు భోజనప్రియులు, మద్యపానప్రియులు. ఈ రెంటికీ మించి వినోద ప్రియులు. మికిట్కా అనే జపరోజియేవాసి పెరెష్లాయ్ మైదానంలో విందులు, వేడుకలనుంచి ఎర్రగుర్రం ఎక్కి సరాసరి ఇక్కడికి వచ్చాడు. అక్కడ ఏడు పగళ్లు, ఏడు రాత్రుళ్ళు పోలిష్ సైనికులకు ఎర్రద్రాక్షసారా తాగించాడు. కాప్టెన్ రొబెట్స్ దత్తసోదరుడు డానిలో బరల్‌బాష్ తన పడుచు

పెళ్ళాం కాటరీనాని, ఏడాది కొడుకును వెంటబెట్టుకుని సీపర్ అవతలనించి వచ్చాడు. రెండు కొండల మధ్య ఉంది అతని ఇల్లు, కాటెరీనా అందాల మొహం, జర్మన్ మొఖమల్ అంతటి నల్లటి కనుబొమలు, చక్కటి దుస్తులు, నీలిపట్టు గాగరా, వెండిమడమల బూట్లు చూసి అతిథులు ఆశ్చర్య పోయారు. కాని ఆమె ముసలి తండ్రి రాకపోవడం మరీ ఆశ్చర్యం కలిగించింది ఆయన దాదాపు సంవత్సరంనుంచి మాత్రమే ఆ ప్రాంతాలలో నివసిస్తున్నాడు. అంతకుముందు ఇరవయిఒక్క సంవత్సరాలపాటు ఆయన ఆచూకీ ఎవరికీ తెలియలేదు. కూతురు పెళ్ళిచేసుకుని కొడుకును కన్నతరవాత వచ్చి కూతురుదగ్గర ఉంటున్నాడు. చిత్ర విచిత్రమయిన కథలు అనేకం చెప్పేవాడు. విదేశాలలో అంతకాలం గడిపిన తరవాత చెప్పలేకపోవడమేమిటి? అక్కడికీ ఇక్కడికీ పోలికే లేదు. అక్కడమనుషులు ఇక్కడవారి వంటవారు కారు. అక్కడ చర్చిలులేవు. ఇంతకీ ఆయన రాలేదు.

ఎండుద్రాక్ష, రేగిపళ్ళతో ఘుమఘుమలాడే వోడ్కా, పెద్ద తబుకులో పెళ్ళి రొట్టెపెట్టి అతిథులకు అందించారు. పాటకులు రొట్టె అడుగున ఉడికిన నాణేలు తీసుకోవడంలో నిమగ్నులయి ఫిడేళ్ళు, తాళాలు, తాంబురాలు కిందపెట్టే సారు. ఇక బాలికలు, యువతులు అల్లిక జేబురుమాళ్ళతో మూతులు తుడుచుకుని మళ్ళీ ముందుకు అడుగువేసారు. మొగపిల్లలు నడుంమీద చేతులు వేసుకుని, కోరచూపులు చూస్తూ వారిని కలుసుకోవడానికి బయలుదేరబోతున్నారు. ఇంతలో ముసలికాప్టెన్ దంపతులను ఆశీర్వదించడానికి రెండు

దేవతా విగ్రహాలు తీసుకొని చక్కా వచ్చాడు. ఈ దేవతా విగ్రహాలు మహర్షి ఫాదరీ వార్ఫ్లోమే అతనికి బహూకరించినవి. వాటికి విలువయిన కట్టడంలేదు. అవి బంగారు మాలామాతోగాని వెండిమాలామాతోగాని మెరిసిపోవడం లేదు. కాని అవి ఏవరి ఇంటో ఉంటే ఆ ఇంటి యజమానిని సమీపించడానికి ఏపిశాచానికీ దమ్ములు ఉండవు. ఆ దేవతా విగ్రహాలను పైకెత్తి చిన్న ప్రార్థన చేయబోతుండగా హఠాత్తుగా నేలమీద ఆడుకుంటున్న పిల్లలు భయంతో కెవ్వు మన్నారు. పెద్దవాళ్ళు వెనకకుతగ్గారు. అందరూ తమ మధ్య నిలబడ్డ ఒక కోసక్‌ను భయంతో నేలుపెట్టి చూపించారు. అతను ఎవరయిందీ ఎవరికీ తెలియదు. కాని అతను అద్భుతంగా నాట్యంచేసి చుట్టూ ఉన్నవారందరి దృష్టినీ ఆకర్షించాడు. కెప్టెను దేవతా విగ్రహాలు పైకెత్తేసరికి ఆ కోసక్ మొహం పూర్తిగా మారిపోయింది. ముక్కు పెద్దదయి ఒక వైపుకు వంపుతిరిగింది. బూడిదరంగు కళ్ళు ఆకుపచ్చనయినాయి. పెదవులు నీలిరంగు దాల్చాయి. గడ్డం వణకుతూ బల్లెంలాగా కొన తేలింది. పెద్ద దంతం నోట్లో మొలిచింది. గూను వచ్చింది మనిషి ముసిలివాడిలా తయారయాడు.

"వాడే! వాడే!" అని జనం అరిచారు, దగ్గరదగ్గరగా గుమిగూడుతూ,

"మాంత్రికుడు మళ్ళీ తయారయాడు!" అంటూ తల్లులు అరిచారు బిడ్డలను దగ్గరకు తీసుకుంటూ.

ఠీవిగా, హుందాగా కెప్టెన్ ముందుకు వెళ్ళి దేవతా విగ్రహాలను ఆ కోసక్ వైపుకు తిప్పి బిగ్గరగా, "పో, వెళ్ళిపో!

సైతాన్ ప్రతిరూపమా, వెళ్ళిపో! యిక్కడ నీకు స్థానం లేదు" అన్నాడు. ఆ విచిత్రవ్యక్తి బుసకొడుతూ, తోడేలులాగా పళ్ళు పటపటా కొరుక్కుంటూ మాయమయి చక్కా బోయాడు.

జనంలో సంభాషణ, ఊహలపై ఊహలు చెలరేగాయి· గందరగోళం తుపానురోజున సముద్రప్రహోరులా ఉంది.

"యేమిటీ మాంత్రికుడిగోడవ?" అని అతని సంగతి సందర్భాలు తెలియని యువకులు అడిగారు.

"చిక్కులువచ్చి పడతాయ్!" అని పెద్దలు తలలు ఆడిస్తూ గొణిగారు. విశాలమయిన ఆ ఇంటి ఆవరణలో ఆ భయంకర మాంత్రికుని గాధ వినడానికి జనం గుమిగూడారు. తలోరకంగా అతనిగాధ చెప్పారు. కాని ఒకరూ ఇదమిద్ధమ్మని ఒక్క విషయమూ చెప్పలేకపోయారు.

ఒక పీపాసారా, కొన్ని గాలన్ల గ్రీకు ద్రాక్షసారా ఆవరణలోకి తెచ్చారు. అతిథులకు మళ్ళా హుషారు పుట్టింది. వాయిద్యాలు మోగాయి. బాలికలు, యువకులు, బూడిద రంగు కోట్ల కోసక్ యోధులు నాట్యంచేస్తూ గిర్రున తిరగ సాగారు. ఒకటి రెండు గ్లాసులువేసుకుని తొంభయి నూరేళ్ళ ముదుసళ్ళు కూడా పూర్వపు రోజులు నెమరువేసుకుంటూ నాట్యం చేయసాగారు. రాత్రి పొద్దుపోయేవరకు విందు ఆర గించారు. ఈరోజుల్లో అంతఇదిగా ఎవరు విందారగించగలరు? అతిథులు ఒకరొకరూ లేచారు. కొద్దిమంది మాత్రమే ఇళ్ళకు చేరుకున్నారు. చాలమంది కెప్టెన్ ఇంటి ఆవరణలోనే

రాత్రంతా గడపడానికి ఉండిపోయారు. ఒకరు చెప్పక్కర్లే కుండానే కోసక్‌లు బెంచీలకింద, నేలమీద, గుర్రాలపక్కన గొడ్లపాకపక్కన పడుకున్నారు. తప్పతాగినవాళ్ళు ఎక్కడ తూలితేలక్కడే కిందపడి ఊరు మారుమోగేలట్టు గురక పెడుతూ నిద్రపోసాగారు.

## 2

పిండారబోసినట్లు వెన్నెల కాస్తోంది. చంద్రుడు కొండ వెనకనుంచి ఉదయించాడు. వెన్నెల నీపర్ నదీతీరాన్ని మంచుతెల్లని రవసెల్లా దుప్పటిలాగా కప్పింది. కీనీడలు వెనక్కి వెనక్కి దేవదారు అడవిలోకి దూసుకుబోతున్నాయి.

సిందూరపుచెట్లను తొలిచి చేసిన పడవఒకటి నీపర్ నది దిగువకు ప్రయాణిస్తూంది. పడవ ముందుభాగంలో ఇద్దరు కుర్రవాళ్లు కూర్చున్నారు. వారి నల్లని కోసక్‌టోపీలు ఒక వేపుకు ఒరిగిఉన్నాయి. తెడ్లనుంచి నురుగు, చెకుముకి రాయినుంచి నిప్పురవ్వలలాగా ఎగురుతోంది.

ఆ కోసక్‌లు పాటలు పాడడంలేదు. ఎందుకో? కాథలిక్ మతం పుచ్చుకోవలసిందని కోసక్‌లను బలవంతపరుస్తూ యుక్రేన్ అంతటా తిరిగే పోలిష్ ఫాదర్‌లను గురించి పాడడంలేదు. ఉప్పుచెరువుదగ్గర తాతార్లతో చేసిన రెండు రోజుల యుద్ధగాథను వినిపించడంలేదు. అవును! వారి ప్రభువు దానిలో ఏదో ఆలోచనలో మునిగిపోయి ఉంటే ఎలా పాడగలరు? ఎలా సాహస కృత్యాలను వర్ణించగలరు? దానిలో

ధరించిన కెంపురంగు అంగరఖాచేయి పడవబయటగా వేలాడుతూ నీటిలో ఈదుతోంది. వారి యజమానురాలు కాతెరీనా బిడ్డమీదనే దృష్టి నిలిపి జోకొట్టుతోంది ఆమె ధరించిన సన్నని గౌనుమీద నురుగునలుసులు వచ్చి పడుతున్నాయి.

నీపర్ నది మధ్యనుంచి ఎత్తుకొండలు, విశాలమయిన మైదానాలు ఆకుపచ్చని అడవులు చూడడానికి ముచ్చటగా ఉంటాయి. ఆ కొండలు కొండలు కావు. కిందాపైనా శిఖరాలతో అంతమవుతాయి. వాటి పైనా కిందా అంతరిక్షం. కొండసులోబీలమీది అడవులు అడవులుకావు. అవి అరణ్యదేవత వత్తు తలకట్టుమీది వెంట్రుకలు కిందినీటిలో అతను గడ్డం కడుక్కుంటాడు. అతని గడ్డంకిందా, తలపైనా అంతరిక్షం ఆమైదానాలు మైదానాలుకావు. గుండ్రని ఆకాశానికి చుట్టిన ఆకుపచ్చని కాసికోకలు దాని కిందా పైనా చంద్రుడు వేలాడుతున్నాడు.

డానిలో తన విషయం ఆలోచించుకోకుండా పడుచు భార్యవంక చూసి, "యెందుకలా విచారంలో మునిగిపోయావ్, నా బంగారుకాథరీనా ?" అని అడిగాడు.

"అతను మాంత్రికుడయినందుకు కాదు భయపడాల్సింది" అన్నాడు డానిలో. "అతనిరాక ప్రమాదకరం. యిక్కడికి రావాలని యెందుకు తిక్కపుట్టిందో! మనల్ని జపరోజియేవారినించి వేరుచేయాలనే వుద్దేశంతో పోలెండువాళ్లు కోటకట్టాలని అనుకుంటున్నారని విన్నాను. అది నిజంకావచ్చు మన శత్రువుల్నిగనక చేరనిచ్చాడనేవార్త నా చెవినిపడిందో

వాడి కొంప కూల్చేస్తా. గద్దలకుకూడా యేమీ చిక్కకుండా వాడిని భస్మం చేసేస్తా. వాడిదగ్గర బోలెడంత బంగారం, ధనం వుందట! అదిగో అక్కడే ఆ దెయ్యపు వెధవ నివసించేది! వాడిదగ్గర బంగారం వుంటే – మనం తొందర్లోనే స్మశానం దాటుతాం అక్కడి వాడి తాత తండ్రుల కంకాళాలు పడి వున్నాయి. వాళ్ళంతా డబ్బుకు సైతానుకు, ఆత్మతో సకల వస్తువు సంపదతో అమ్ముడుపోవడానికి సిద్ధంగా వున్నారని అంటారు. వాడిదగ్గర నిజంగా బంగారమేగనక వుంటే తట పటాయించక్కర్లేదు. యుద్ధంలో యెప్పుడూ అంత ధనం దొరకదు."

"మీ ఆలోచనయేమిటో నాకు తెలుసు. కాని మీరు అతనిని కలుసుకోవడం మంచిదికాదని నా హృదయం చెబు తోంది. దీర్ఘంగా నిట్టూరుస్తున్నారు. మొహం భయంకరంగా వుంది. కోపంతో కనుబొమలు ముడతలుపడ్డాయి——"

"నోరుముయ్, ఆడముండా!" అన్నాడు డానిలో కోపంతో. "నీతోవ్యవహారం పెట్టుకుంటే నేనూ ఆడంగినై చక్కాబోతాను. అరే, కుర్రాడా! పైపు వెలిగించుకోవాలి యింత నిప్పియ్!" ఇలా అంటూ తెడ్డువేస్తున్న వారిలో ఒకని వంక తిరిగాడు. వాడూ తన పైపులోనుంచి ఎర్రటినిప్పు యజ మాని పైపులో వేసాడు. "ఆమంత్రగాడి పేరుచెప్పి నన్ను భయపెట్టాలని చూస్తోంది" అంటూ మళ్ళీ ప్రారంభించాడు డానిలో. "కోసక్ కి దెయ్యమన్నా పోలిష్ ఫాదరీ అన్న భయంవుండదు. ఆడవాళ్ళ మాటలువింటే మనపని యేమవు

తుందో తెలుసా, కుర్రాళ్ళూ! మనకి పైప్రు, పదును కత్తిపే పెళ్ళాలు!"

నిద్రిస్తున్నట్టున్న నదికేసి చూస్తూ కాటెరీనా మౌనంగా కూర్చుంది. గాలి నీటిని గలగలలాడిస్తోంది. రాత్రి పూట తోడేలు చర్మం మెరిసినట్లు నీపర్ నది ధగధగ మెరిసి పోతోంది.

పడవ తిరిగి ఒడ్డు పట్టింది. గోరీలదొడ్డి కానవచ్చింది. శిలువలు కుప్పలుగా పడి ఉన్నాయి. గులాబిమొక్కలుగాని గడ్డిగాని లేవు. అంతరిక్షంనుంచి చంద్రుడు వాటిమీద వెన్నెలను ప్రసరిస్తున్నాడు. 'అంతే!'

"ఆ కేకలు వినిపిస్తున్నాయా, కుర్రాళ్ళు! సాయం కోసం యెవరో కేకలు పెడుతున్నారు." అన్నాడు డానిలో తెడ్లువేసేవారివంక తిరిగి.

"ఆఁ- వినిపిస్తున్నాయ్. ఆ వొడ్డునుంచిలా వుంది" అని ఒకేసారి అన్నారు ఆ ఇద్దరు తెడ్లవాళ్ళు, గోరీలదొడ్డికేసి చూపిస్తూ.

కాని అంతలో నిశ్శబ్దం. ఒడ్డు మలుపు ననుసరించి పడవా తిరిగింది. హఠాత్తుగా తెడ్లవాళ్ళు తెడ్లు కింద పడవేసి కదలకుండా తేరిపార జూడసాగారు. డానిలోకూడా తేరిపార జూసాడు, ఆ కోసక్ నిలువెల్లా గడగడా వణికిపోయాడు.

ఒక గోరీమీద శిలువ కదలాడింది జీర్ణించిపోయిన శవం ఒకటి భూమిలోనుంచి పైకి లేచింది. బారెడు గడ్డం. గోళ్లు వేళ్ళకంటె పొడుగ్గా ఉన్నాయి. మెల్లిగా చేతులు

పైకెత్తింది. ముహం వంకరబోయి వికారంగా ఉంది. మహా బాధపడిపోతున్నట్టు కనిపిస్తోంది. "వూపి ర డడం లేదు, వూపిరాడడం లేదు!" అని భయంకరంగా, అమాను షంగా మూలిగింది దానిగొంతు గుండెకాయమీద కత్తితో నీకినట్టుంది. మళ్ళీ హఠాత్తుగా శవం భూమిలోకి మాయమయి పోయింది. ఇంకో శిలువ కదిలింది. తిరిగీ ఇంకోశవం పైకి లేచింది. ఇది ఇందాకటి శవంకంటె భయంకరంగా పొడుగ్గా ఉంది. వంటినిండా వెంట్రుకలే. గడ్డం మోకాళ్ళకు తాకు తోంది. గోళ్ళు ఇంకా పొడుగ్గా ఉన్నాయి. అది ఇంకా భయంకరంగా కేకలు వేసింది. "వూపిరి ఆడడంలేదు!" అని మళ్ళీ భూమిలోకి మాయమయిపోయింది. ఇంకో శిలువ కదిలింది. ఇంకో శవం పైకి లేచింది. అది కంకాళంలా ఉంది. గడ్డం మడమలకు తాకుతోంది. చేతి వేళ్ళగోళ్ళు భూమికి గుచ్చుకుంటున్నాయి. చంద్రుణ్ణి పట్టుకోబోతున్నట్టు దారుణంగా చేతులు పైకిలేపింది. ఎవరో ఎముకలు రంపంతో కోస్తున్నట్లు కెవ్వుమని ఏడ్చింది.

కాటరీనా తొడమీద పడుకుని నిద్రపోతున్న పసి పాప లేచి ఏడ్చింది. ఆమెకూడా ఏడ్చింది. తెల్లవాళ్ళ టోపీలు నీళ్ళల్లో పడిపోయాయి. వారి యజమాని దానిలో కూడా కంపించిపోయాడు.

హఠాత్తుగా ఏమీ జరగనట్టు అంతా మాయమయింది కాని చాలాసేపటికిగాని తెడ్లవాళ్ళు తిరిగే తెడ్లు చేతబట్టలేదు. డానిల్ బాష్ భార్యకేసి ఆదుర్దాగా చూశాడు. ఆమె అమితభయంతో ఏడుస్తున్న బిడ్డను ఎత్తుకుని లాలిస్తోంది.

డానిలో ఆమెను గుండెకు అదుముకుని నుదురుమీాద ముద్దిడు కున్నాడు.

"భయపడబోకు, కాటెరీనా! చూడు, యేవీఁలేందే!" అన్నాడు చుట్టూచూపిస్తూ.

"మంత్రగాడు తన పాపిష్టి యింట్లో యెవరూ అడుగు పెట్టకుండా పాడలగొడుతున్నాడు ఆడవాళ్ళు పాడిలిపోవాలి గాని మగా డెవడు పాడిలిపోతాడు? యెడీ, అబ్బాయిని యిలా యియ్యి!"

ఇలా అంటూ డానిలో కొడుకును ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు. "అరే, ఇవాన్, నీకు మంత్రగాళ్ళంటే భయమా? లేదుగదూ? 'భయంలేదు, నాన్నా! నేను కోసక్ బిడ్డను' అను. యిక యేడుపు మానేసెయ్! యింతలోనే మనం యింటికి చేరుకుంటాం. అమ్మ నీకు పాలుపట్టి, ఊయ్యాలలో బడుకోబెట్టి జోకొడుతూ?

పాట:

నిదురపో నాచిన్న ! లాలి నాకన్న !
ముద్దు ముద్దుగ పెరిగి - మొనగాడివై నీవు
కోసక్కులందరికి - గొప్ప చేకూర్చాలి ॥నిదురపో॥
పగవాని గుండెలో - బల్లెమై మెలగాలి
దేశాన నీ పేరు - దీప్తి చెందాలీ ॥నిదురపో॥

"విను, కాటరీనా! మీానాన్న యిక మనతో మంచిగా వుంటాడని తోచదు. వచ్చినప్పుడల్లా మండిపడుతూంటాడు. యెదో విచారంతో కుంగిపోతున్నట్లుంటాడు. రావడం యిష్టం

లేకపోతే, రమ్మని యెవరు యేడ్చారు! కొసక్ స్వాతంత్ర్యం ఆయనికి యిష్టంలేదు. అబ్బాయిని యెన్నడూ యెత్తుకుని లాలించిన పాపాన పోలేదు. మొదట్లో మనసు దాచుకోకుండా చెప్పేయాలన్నంత నమ్మకం ఆయనలో వుండేది. యిప్పుడో మాటలు పెగలడంలేదు ఊహుఁ— ఆయన హృదయం కోసక్ హృదయం కాదు. రెండు కోసక్ హృదయాలు కలుసుకున్న ప్పుడు సంతోషంతో గంతులువేస్తూ సమాదరించుకుంటాయి. సరేగాని, అరే కుర్రాళ్ళు వొడ్డుదగ్గిరికి వచ్చారూ? మీకు కొత్తటోపీలు యిస్తాను. అరేస్టేట్స్కా! నీకు మొఖమలు టోపీ యిస్తాను. దాన్ని ఒక తాతారు తలతోపాటు తీసు కున్నాను. వాడి సొత్తంతా నాకే దక్కింది ప్రాణం తప్పితే దేన్నీ నేను వదలలేదు. సరే, యిక్కడ వొడ్డుకు పట్టించండి! యిదిగో యింటికి చేరుకున్నాం: యివాన్! యింకా యేడు స్తూనే వున్నావా? వాడ్ని తీసుకో, కాటెరీనా!"

అంతా పడవ దిగారు. కొండవెనక ఒక పూరికొంప గోచరించింది. అది డానిలో పూర్వీకులు కట్టించిన ఇల్లు. దాని అవతల మైదానం. ఆ మైదానంలో వందమైళ్లు ప్రయాణం చేసినా కోసక్ అంటూ కనిపించదు.

# 3

నీపర్ నదివరకూ వ్యాపించిన ఒక ఇరుకు లోయలోని రెండు కొండలమధ్య ఉంది డానిలో ఇల్లు. సామాన్య కోసక్ కుటీరంలాగానే అదీ ఎత్తుతక్కువ. అందులో ఒకే

ఒక పెద్దగది. కాని అతనూ, అతనిభార్య, ముసిలిదాసి, పది మంది కుర్రాళ్ళూ అందులోనే సర్దుకోవాలి. గోడలవారేపైన సిందూరపుచెక్క అలమారాలున్నాయి. వాటిమీద గిన్నెలు వంటసామాను పోగుగా పెట్టారు. వాటిలో బహుమానంగా లభించినవి. యుద్ధంలో గెల్చుకున్నవి వెండిగిన్నెలు. బంగారు మాలామాచేసిన మంచినీళ్ళ గ్లాసులు ఉన్నాయి. అలమారాలకిందగా ఖరీదయిన కత్తులు, తుపాకులు, బల్లాలు వేలాడుతున్నాయి. ఇష్టంమీదనయితేనేం, అయిష్టంమీదనయితేనేం అవన్నీ తాతారు వాళ్ళదగ్గరనుంచీ, టర్కీవాళ్ళ దగ్గర నుంచీ పోలండువాళ్ళ దగ్గరనుంచీ తీసుకున్నవే. బాగా సొటలుపడి ఉన్నాయి. వాటిని చూస్తూంటే డానిలోకి తను చేసిన సాహసకృత్యాలు జ్ఞాపకం వచ్చాయి. గోడకిందుగా నున్నటి సిందూరపుచెక్క బెంచీలున్నాయి. వాటి పక్కగా స్టోవ్ ముందు లోకప్పుకు బిగించిన చక్రంనుంచి తాళ్ళతో ఊయల వేలాడుతోంది. నేల అంతా దిమ్మెసచేసి మట్టి పూసారు. బెంచీలమీద డానిలో, అతనిభార్య పడుకుంటారు. స్టోవ్‌మీద దాసిది పడుకుంటుంది. తొట్లో పిల్లవాడు ఆడుకుని నిద్రపోతూంటాడు. నౌకర్లు నేలమీద వరసగా పడుకుంటారు. కాని కోసక్‌లకు ఆరుబయట వట్టినేలమీద పడుకోవడమంటే మహాఇష్టం. పరుపూ తలగడా అక్కర్లేదు. తల కింద తాజాగడ్డి పెట్టుకుని, పచ్చికమీద కాళ్ళు చాచుకు పడుకుంటారు. అర్ధరాత్రి మేలుకుని నక్షత్రాలతో విరాజిల్లే అనంతాకాశంవంక చూస్తూ చలికి వణుకుతూ పడుకోవడం వాళ్ళకు ఎక్కువ సంతోషదాయకంగా ఉంటుంది. ఆ చలి

గాలి వాళ్ళకి సేదదీరుస్తుంది. కాళ్ళు చాపుకుని కలవరిస్తూ పైపు వెలిగించుకుని గొర్రెచర్మం ఇంకా దగ్గిరకు లాక్కుని పడుకుంటారు.

ఆ కిందటి రోజల్లా వేడుకలలో గడిపాడామో డానిలో పెండలకడే నిద్రలేవలేదు. నిద్ర మేలుకుని ఒకమూల బెంచి మీద కూర్చుని కొత్తటర్కీ కత్తికి పదును పెట్టసాగాడు. అంతకముందే ఎదో వస్తువిచ్చి ఈ కత్తి తీసుకున్నాడు. కాటరీనా పట్టురుమాలుమీద చమ్కీ కుడుతోంది.

ఇంతలోహఠాత్తుగా కాటెరీనాతండ్రి చక్కావచ్చాడు. కోపంతో మొహం ముడుచుకుపోయిఉంది. నోట్లోవిదేశీ పైపు. తిన్నగా కూతురుదగ్గరకు వెళ్ళి ఆ కిందటిరాత్రి అంత పొద్దుపోయి యింటికి వచ్చావేమని గట్టిగా ప్రశ్నించాడు.

"ఆ విషయం ప్రశ్నించవలసిందని నన్నుగాని దాన్ని గాదు, మామగారూ! భార్యదికాదు, భర్తది ఆ బాధ్యత. ఆదీ యిక్కడ పద్ధతి" అన్నాడు డానిలో తన పనేమో చూసుకుంటూనే.

"కాకపోతే పాషండ దేశాల్లో అలాకాదేమో, నాకు తెలీదు."

మామగారి మెహం కద్దగడ్డయింది, కళ్ళల్లో భయం కరమయిన వెలుగు గోచరించింది.

"కూతురువిషయం తండ్రికాకపోతే యెవరుచూస్తారు!" అని తనలోతాను సణుక్కున్నాడు. "సరే, అలాఅయితే నిన్నే

అడుగుతున్నా. కిందటిరాత్రి పొద్దుపోయేవరకు యెక్కడ తందనాలాడుతున్నారు? చెప్పు."

"అదీ మాటాడవల్సిన విధం. నేను పొత్తిళ్ళలో పాపనేం కాను. పెద్దవాడనయాను. గుర్రంమీద స్వారీ చేయ గలను. వాడికత్తి ఝళిపించగలను. యింకా అనేకం చేయ గలను. ఫలానాపని యెందుకు చేస్తావని ప్రశ్నిస్తే జవాబు చెప్పడానికి నిరాకరించగలను!"

"నాకు తెలుసు, దానిలో చిల్లికజ్జాలు పెట్టుకోవాలని చూస్తున్నావ్ కదూ? మనసు విప్పి మాటాడని మనిషి మన సులో యెదో చెడు వుంటుంది!"

"యిష్టంవచ్చినట్లు నువు అనుకోవచ్చు" అన్నాడు డానిలో. "నా యిష్టంవచ్చినట్లు నేను అనుకుంటాను. కాని భగవంతుడి దయవల్ల నేనింతవరకు వెధవపని యేదీ చేయ లేదు. నేను సనాతన మతంకోసం, మాతృభూమికోసం నిల బడి పోరాడాను. అంతేగాని చావుకు తెగించి క్రిస్టియన్లు పోరాడుతూంటే దేశదిమ్మరి వచ్చి కష్టపడకుండా ఒకరి సొమ్ము కాచేద్దామని తలచే కొంతమందిలాగా నేనేం ప్రవ ర్తించలేదు. వాళ్ళ యూనియట్లు కంటెకూడా భ్రష్టులు. చర్చిలోకి ఎన్నడూ తొంగిచూడరు. యెక్కడ తందనా లాడుతున్నారని కఠినంగా ప్రశ్నించాల్సింది అటువంటి వాళ్ళని!"

"హే, కోసక్! నీకు తెలుసుగా-తుపాకి కాల్చటంలో నేను పెద్ద మొనగాడినేంకాదు గాని యేడువందల అడుగుల

దూరంలో వుండి కాలి స్తే యెదటివాడి గుండెలోనుంచి గుండు దూసుకుపోవల్సిందే. కత్తియుద్ధంలోకూడా నన్ను నేను పొగుడుకోరాదుగాని మా నౌకరుని నలుసులు నలుసులు కింద కొట్టేసా!"

"ఓ – నేనూ తయారే!" అన్నాడు డానిలో కత్తితో గాలిలో హుందాగా శిలువగుర్తువేసి తానెందుకు కత్తికి పదును పెడుతున్నదీ ముందుగానే తెలిసినవాడిలాగా.

"డానిలో!" అంటూ అరిచింది కాటెరీనా అతని చేయి పట్టుకుని వేలాడుతూ. "యేంచేయబోతున్నావో కాస్త ఆలోచించు. పిచ్చివాడా యెవరిమీద కత్తి యెత్తుతున్నావ్? నాన్నా! నీతల నెరిసింది కాని వొళ్లు తెలీని కుర్రవాడిలా మండిపడుతున్నావ్!"

"యిలాంటి విషయాల్లో ఆడవాళ్ళు కలగజేసుకోవడం నాకు యిష్టం వుండదని నీకు తెలీదూ! నీ ఆడపనులేవిటో నువు చూసుకో!" అని గద్దించాడు డానిలో.

కత్తులరాపిడి టకటకలు భోరుమన్నాయి. ఉక్కు–ఉక్కు– దూసుకున్నాయి. నిప్పురవ్వలు దుమ్ముకణాలలా లేచాయి. కాటెరీనా పక్క గదిలోకి ఏడుస్తూ వెళ్ళి పక్కమీదవాలి కత్తుల రాపిడిధ్వని వినిపించకుండా చెవులలో వేళ్ళు పెట్టుకుంది. కత్తులరాపిడిధ్వని అంతలో అణిగిపోయేటంత నిస్సత్తువతో వారు పోట్లాడుకోవడంలేదు. ఆమె హృదయం పగిలిపోవడానికి సిద్ధంగా ఉంది. ప్రపంచమంతా కత్తుల తాకిడిలా ఆమెకు అనిపించింది. "ఊహుఁ– యిక

భరించలేను, భరించలేను! బహుశా యీ పాటికే మెర్రటి నెత్తురు కారుతుండేమో? యీ పాటికి నా ప్రియతముడు నిస్సహాయ స్థిలో వున్నాడేమో! నేనిక్కడ పడివున్నాను!” ఇలా అనుకుని పలిపోయి ఎగఊపిరి పీలుస్తూ మళ్ళీ వెనకకు వెళ్ళింది.

ఆ పోరాటం మహా భయంకరంగా ఉంది. ఇద్దరూ సమఉజ్జీలు. జయం ఎవరిదో తేలడంలేదు ఒక సమయంలో కాటెరీనా తండ్రి ధూకుడుగా వెళ్ళి పడ్డాడు. దానిలో పని అయిపోయినట్లనిపించింది. కాని దానిలో ఎదురుదెబ్బకు ఉప క్రమించాడు, కాటెరీనాతండ్రి లొంగిపోవలసివచ్చేటంత పనయింది. ఇద్దరూ సమమయినారు. ఇద్దరూ కోపంతో ఉడికి పోయారు కత్తులు ఝళిపించారు. కత్తులు రాసుకున్నాలు టకీమని రెండుకత్తులూ పిడుల నుంచి ఊడి కిందపడ్డాయి.

ఇలా శుభంగా పరిణమించినందుకు కాటెరీనా భగ వంతుడికి నమస్కరించింది. కాని ఇంతలో ఇద్దరుకోసక్ లు తుపాకులు తీసుకునేసరికి కెవ్వుమని పడ్చింది. వారు తుపాకు లలో చెకుముకి రాళ్ళుపెట్టి గుర్రం వెనకు నెట్టారు.

దానిలో తుపాకి కాల్చాడు గాని గురి తప్పింది. ఇక ఆమె తండ్రి తుపాకి బారు పెట్టాడు. ముసలివాడు దృష్టికూడా ఆయువకడంత బాగాలేదు. కాని చేయిమాత్రం వణకలేదు. తుపాకిగుండు బుయ్ మంది. దానిలో వెనకకు తూలాడు. అంగరకా ఎడమచేతికి ఎర్రగా నెత్తురు!

“ఉహుం – యీమాత్రానికే లొంగిపోను. యెడమ చేయికాదు కుడిచేయి రాజ్యంచేసేది గోడమీద టక్క

పిస్తోలు వుంది. యింతవరకు అది గురితప్పలేదు. దిగి రా పురాణమిత్రమా! స్నేహితుడికి వుపకారం చేయి" అంటూ డానిలో చేయి చాచాడు.

"డానిలో!" అని అరిచింది కాటెరీనా, నిరాశతో అతని చేయిపట్టుకుని కాళ్ళమీద పడింది. "నాకోసమేం నిన్ను ప్రాధేయపడడంలేదు. యిక నాకొకటేగ మిగిలింది. భర్తపోయిన తరవాత బతికి వుండడం ఆడదానికి పాటిగాదు. నీపర్ నదిలోపడి నేనూ చచ్చిపోతాను. కాని నీ కొడుకు మొహం చూడు. డానిలో, నీ కొడుకు మొహం చూడు! పాపం! యిక వాడిని యెవరు పెంచి పెద్దవాణ్ణి చేస్తారు? యెవరు దయతో ఆదరిస్తారు? నల్లగుర్రంమీద స్వారిచేయడం యెవరు నేర్పుతారు? మతంకోసం, స్వాతంత్ర్యంకోసం పోరాడడం, కోసక్‌లాగా తాగి తందనాలాడడం యెవరు నేర్పుతారు? చిట్టితండ్రీ! యింతకీ యిదంతా నీనాశనానికి వచ్చింది! మీ నాన్నకి నీ విషయమే పట్టదు! చూడు, మొహం యెలా తిప్పేసుకుంటున్నారో! అబ్బ! యిపుడు అర్థమయింది. నువ్వు అడవి జంతువువి కాని మనిషివి కావు. నీ గుండె నల్లరాయి. నీ మనసు జిత్తులమారి పాము మనసు! నీలో కరుణారసం లేశమంతయినా వుందనుకున్నా. నీ రాతిగుండెలో మానవత్వం దాగి వుందనుకున్నా. కాని మోసపోయాను! దారుణంగా మోసపోయాను! యిదంతా నీకు సంతోషంగా వుందికదూ? ఆ పోలీష్ రాక్షసులు నీకొడుకును మంటలలో పడవేస్తూ చేసే గోల, కత్తి కిందో, నీటిలోనో నీ కొడుకు కెవ్వుమని ఏడుస్తూంటే విని గోరీలో నీ బొమికలు సంతోషంతో నాట్యం

చేస్తాయి! ఆఁ- యిప్పుడు అర్థమయింది! గోతిలోనుంచి లేచి వచ్చి వాడి కింద మంటలను టోపీతో విసరడం నీకు సంతోషంగా వుంటుందిగదూ!"

"ఆహ. కాటెరీనా! అహ గా, నాముద్దుల మురిపెం యివాన్, యేదీ ఒక ముద్దియ్యి, ఊహుఁ- నాతల వెంట్రుకలనుకూడా యెవర్నీ తాకనీను. నువ్వు పెరిగి పెద్దవయి దేశానికి కీర్తి తేవాలి. నెత్తిమీద మొఖమంటటోపీ పెట్టుకుని, చేతితో కత్తిపట్టి నువ్వు కోసక్‌లను నడిపిస్తూ సుడిగుండంలా విహరిద్దుగాని! యేదీ, చెయి అందియ్ మామా! మనిద్దరిమధ్య జరిగిందేదీటో యిక మర్చేబోండి. నేను చేసిన తప్పుకు క్షమాపణ వేడుకుంటున్నా, చేయి అందివ్వరేం?" అన్నాడు డానిలో కాటెరీనా తండ్రితో. కాటెరీనా తండ్రి కదలకుండా నిలబడ్డాడు. మొహంలో కోపచిహ్నం గాని, శాంతించిన చిహ్నంగాని ఎక్కడా కనిపించలేదు.

"నాన్నా!" అంది కాటెరీనా, కావలించుకుని ముద్దిడుకుంటూ. "దయజూడు, డానిలోని క్షమించు. యిక యెప్పుడు నీకు కోపం తెప్పించేపని చేయడు!"

"నీ మొహం చూసి అతడిని క్షమిస్తున్నా!" అని అతను జవాబిచ్చాడు, ముద్దిడుకుంటూ. కాని అతని కనులలో విచిత్రమయిన కాంతి పొడగట్టింది.

కాటెరీనా కొద్దిగా కంపించిపోయింది. ఆ ముద్దు, కనులలో ఆ విచిత్రమయిన కాంతీ ఆమెకు విపరీతంగా తోచింది. బల్లమీద మోచేతులు ఆనించింది. అక్కడే డానిలో చేతి

గాయానికి కట్టు కట్టుకుంటున్నాడు. తను సరిగా ప్రవర్తించ లేదనీ ఏతప్పూ చేయకపోయినా కోసక్ స్వభావానికి విరుద్ధంగా క్షమాపణ చెప్పుకున్నానే అనీ దానిలో ఆలోచించసాగాడు.

# 4

తెల్లవారింది. కాని ఎండ రాలేదు. ఆకాశంనిండా మేఘాలు: మైదానాలమీద, అడవిమీద, విశాలమయిన నీపర్ నదిమీద చక్కటి వానకురుస్తోంది. హృదయభారంతో కాథెరీనా మేలుకుంది కళ్ళనిండా నీరే! ఏమీతోచలేదు, మహా ఆందోళనగా ఉంది మనసు.

"ప్రియతమా! నాసర్వస్వమా! నాకో విచిత్రమయిన కలవచ్చింది.

"యేంకలవచ్చింది, నాముద్దులమురిపెమా!

"నాకో విచిత్రమయిన కలవచ్చింది. నిజమే నన్నం తస్పష్టంగావుంది కల. కాప్టెన్ యింట్లో మనంచూసిన ఆ రాక్షసాకారం మానాన్నేనట కాని నినువేడుకుంటూ ఈకల నిజమని నమ్మవద్దు. కలలోవచ్చే వన్నీకల్లలే! భయంతో వణుకుతూ మానాన్నముందు నిలబడ్డానట. ఆయనఅన్న ప్రతిమాటకీ నామనసు మూలిగింది. ఆయన అన్నమాటలు నువు వింటే!"

"యేమన్నాడేవిటి, నాబంగారుకాథెరీనా?"

"అన్నాడు 'నాకేసి చూడు కాథెరీనా! యెంత అందగాడినో! నన్నంత అసహ్యంగా వున్నానంటారు. అబద్ధం.

నేను నీకు తగిన భర్తని. నా కళ్ళల్లో యెటువంటి కాంతి వుందో చూడు!' యిలా అని నిష్కళంగక్కా కళ్ళతో నాకేసి చూసాడు. నేను కెవ్వుమన్నాను. మెలుకువచ్చింది."

"అవును. కలలో నిజం బయటపడుతుంది. కొండల అవతల ప్రశాంతంగా లేదని నీకు తెలీదూ? పోలెండువాళ్ళు మళ్ళీ తలెత్తుకు తిరుగుతున్నట్లున్నారు. మెలకువగా వుండ వల్సిందని గార్ బెట్స్ కబురుచేసాడు. కాని అతను అనవస రంగా ఆందోళనపడ్డాడు. నేను మెలకువలోనే వున్నాను. కిందటిరాత్రి చెట్లుకొట్టి మన కుర్రాళ్ళు డజను క్రాటగడలు నిర్మించారు. మామూలు సిపాయిలను సీసపుగుళ్ళతో సత్క రిద్దాం. యిక పెద్దమనుషులను కొరడా దెబ్బలకు నాట్యం చేసేటట్లు చేద్దాం."

"అయితే మా నాన్నకి యిదంతా తెలుసా?"

"మీ నాన్న నాకు పెద్దబరువుగా తయారయాడు. అర్థంకావడంలేదు, విదేశాలలో చాలా పాపాలుచేసి వుండాలి. యింకా కారణం వుంటుంది? యిక్కడ మనతోపాటు నెల రోజులు వున్నాడా, ఒక్కసారయినా నిజమయిన కోసక్ లాగా సర్దాగా గడిపాడా? మద్యం తాగడు! విన్నావా, కాటెరీనా, క్రైస్ట్ పండగనాడు నేను యూదులదగ్గిరనించి గుంజుకున్న మద్యం తాగలేదు! అరే, కుర్రాడా!" అని కేకపెట్టాడు డానిలో. "నేల మాళిగంలోంచి ఆయూదు మద్యం పట్టుకురా! మీ నాన్న వోడ్కాకూడా తాగడు! దీని కంతటికీ అర్థ మేమిటి? క్రీస్తులో ఆయనకు నమ్మకం లేదనే మనం విశ్వసించ వలసివస్తోంది. యేమంటావ్?"

"మీరు చెప్పేదేమిటో దేవుడికే తెలియాలి"

"చిత్రం!" అంటూ దానిలో సంభాషణ కొనసాగించాడు కోసక్ కుర్రవాడిదగ్గరనుంచి మట్టిముంత తీసుకుంటూ. "పాపిష్టి కాథలిక్కులుకూడా వోడ్కా తాగుతారు! టర్కీవాళ్ళొక్కళ్ళే తాగరండల్లా. సరేగాని స్టెటోస్కీ! నేలమాళిగంలో మద్యం రుచి చూసావా?"

"ఆఁ– యెలా వుంటుందోనని కాస్త రుచిచూసా, దొరా!"

"అబద్దాలాడుతున్నావ్, కుక్కలకొడకా! నీ మీసాల మీద యీగలు యెలా వాలాయో చూసుకో. కడివెడు తాగావని నీకళ్ళే చెప్తున్నాయి. అరే, కోసక్‌లు యెంత జూలాయి మనుషులు! సహచరులకి సర్వస్వం ధారపోస్తారుగాని మద్యంమట్టుకు ఒక్క చుక్కయినా యివ్వరు. తాగి చాలా కాలమయింది, కాదటేనా?"

"చాలా కాలమయిందేం! మొన్న—"

"మరేం భయపడబోకు, భయపడబోకు. ముందెడు కన్న యెక్కువ తాగనులే! యిదిగో, టర్కీ మహాంతుగారు దయచేస్తున్నారు!" అన్నాడు మామగారు లోపలికి రాబో తూండడం చూసి.

"యేం అమ్మాయ్" అన్నాడు తండ్రి టోపీ తీసివేసుకుని కాసికోక సవరించుకుంటూ. ఆ కాసికోకకు విలువయిన రాళ్ళు పొదిగిన కత్తి వేలాడుతోంది. "పొద్దెక్కింది, యింకా వంట కాలేదా?"

"వంట అయింది, నాన్నా! యిప్పుడే వడ్డిస్తాం. ఆ గోం
పాలకుండ యిలా తీసుకురా" అంది యజమానురాలు,
కొయ్యగిన్నెలు తోముతున్న దాసీదానితో." ఆగు. నేనే
తెస్తా నువ్వు అందర్నీ పిలు."

అంతా నేలమీద వలయాకారంగా కూర్చున్నారు.
దేవతా విగ్రహాలకు ఎదురుగా తండ్రి, ఆయన ఎడమచేతి
వైపున డానిలో కుడిచేతివైపున కాటెరీనా, నీలిపచ్చ అంగర
ఖాలు తొడిగిన పదిమంది విశ్వాసపాత్రులయిన కుర్రవాళ్లు
కూర్చున్నారు.

"నాకు బోండాలు సుచించవ్" అన్నాడు తండ్రి
కొద్దిగా తిని చెంచా కింద పెడుతూ.

"రుచీ పచీ వుండవు"

"నీకు యీదు గోధుంరొట్టె అంటే మహా యిష్టమని
నాకు తెల్సులే!" అనుకున్నాడు డానిలో.

"రుచీ పచీ లేదంటూ రేవిటి?" అన్నాడు బిగ్గరగా.
"బాగా వుడకలేదా యేం? నా కాటెరీనా చేసిన బోండాల
వంటివి, సేనానాయకులుకూడా రుచి చూసివుండరు! పైగా
వాటిని అసహ్యించుకోవడమేవిటి? క్రిస్టియన్ల ఆహారం
యిది! పుణ్యాత్ములు, మహర్షులు బోండాలు తిన్నవారే!"

ఆమె తండ్రి ఒకమాటయినా మాటాడలేదు. డానిలో
కూడా మరి మాటాడలేదు.

కాబేజి, ఎండుద్రాక్షపళ్ళు వేసి వేయించిన పంది
మాంసం వడ్డించారు.

"నాకు పందిమాంసమంటే యిష్టంలేదు" అన్నాడు కాజెనీనా తండ్రి చెంచాడు కాబేజి తీసుకుంటూ.

"పందిమాంసం అంటే మీకు యెందుకు యిష్టంలేదు?" అని అడిగాడు డానిలో.

"టర్కీవాళ్ళు యూదులుమాత్రమే పందిమాంసం తినరు!"

ఆమె తండ్రి కోపంతో పూర్వంకంటె ఎక్కువగా మొహం ముడుచుకొన్నాడు.

పాలతో గోధుమపాయసం తాగాడు వోడ్కాకి బదులు జేబులోనుంచి సీసా తీసి దానిలోనిది ఏదో నల్లటి ద్రావకం తాగాడు.

భోజనానంతరం డానిలో మొద్దునిద్ర పోయాడు. లేచేసరికి సాయంకాలమయింది. కోసక్ శిబిరానికి ఉత్తరం వ్రాయాలని కూర్చున్నాడు. అతనిభార్య స్టౌవ్ మీద కూర్చొని కాలితో ఉయ్యాల ఊపుతోంది. వ్రాస్తున్నది ఎడమకంటితో చూస్తూ,కుడికంటితో కిటికీలోనుంచి అవతలకు చూసాడు, డానిలో దూరాన తళతళా మెరిసే కొండలు, నీపర్ నదీ గోచరించాయి. నీపర్ నదికి అవతల ముదురు నీలి అడవి! పైన ఆకాశం నిర్మలంగా దేదీప్యమానంగా వెలిగి పోతోంది. కాని డానిలో ఆహూర ఆకాశాన్నిగాని నీలి అడవినిగాని చూడడంలేదు. ఆ పాతకోట కట్టిన స్థలంవంక తేరి పార జూస్తున్నాడు.చిన్న కిటికీలో దీపం మినుకుమినుకు మంటు న్నట్టు అనిపించింది. కాని అంతా ఒకటి నిశ్శబ్దంగా ఉంది.

అది అతని ఊహ మాత్రమేనేమో! అతనికి వినవచ్చిందల్లా కింద నీపర్ నది బొంగురుమోత, ఒకటి తరవాత వచ్చి ఒడ్డుకు కొట్టుకు తిరిగిపోయే కెరటాలమోత, నది ఘోషించడంలేదు. ముసలివాడిలాగా సణుగుతోంది. ఒక్కటీ దానికి రుచిస్తు న్నట్టులేదు. చుట్టూ ప్రతీదీ మారిపోయింది. ఒడ్డుమీది కొండలతో, అడవులతో మైదానాలతో నిరంతర పోరాటం సాగిస్తూ వాటిమీద నల్లసముద్రంతో ఫిర్యాదు చేస్తుంది.

ఆ విశాల నీపర్ నదిమీద చుక్కలాగా పడవఒకటి అతనికి పొడగట్టింది. మళ్ళీ కోటకిటికీలో దీపం మినుకుమినుకు మంది. దానిలో సన్నగా ఈలవేసాడు. నమ్మకస్తుడయిన నౌకరు ఒకడు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"తొందర తొందరగా మొంచి వాడయిన కత్తి, తుపాకీ తీసుకుని నావెంటరా, క్రెట్స్కా."

"బయటికి వెళుతున్నారా?"అని అడిగింది కాటెరీనా

"అవును నాలుగువేపులా తిరిగి అంతా సవ్యంగా వుందో లేదో చూడాలి!"

"కాని వొంటరిగా వుండడమంటే నాకు భయం వేస్తోంది. నిద్ర ముంచెత్తుతోంది. మళ్ళీ ఆ కలే వస్తే? అది కల అనిపించడంలేదు. నిజంగా జరిగినట్టే వుంది!"

"నీకు ముసిలిది తోడుగా వుంటుంది. బయట గదిలో, ఆవరణలో కోసక్ లు నిద్రపోతుంటారు మరేం భయం లేదులే."

"ముసిలిది అప్పుడే నిద్రపోయింది. కాని యెందుకో యీ కోసక్‌లమీద నాకు నమ్మకం లేదు, విను, డానిలో! నన్ను గదిలో పెట్టి తాళంవేసి, చెవి మీ వెంట తీసుకు పోండి. అప్పుడు నాకు అంత భయంగా వుండదు. కోసక్‌లని గుమ్మంముందు పడుకోమను."

"సరే అలాగే" అన్నాడు డానిలో, తుపాకునుంచి దుమ్ము దులిపి మందు నింపుతూ.

స్టెటోస్కా సర్వసిద్ధంగా ఉన్నాడు. డానిలో ఆస్ట్రాఖాను టోపీపెట్టుకుని, కిటికీ మూసివేసి. తలుపు తాళంవేసి నిద్రపోతున్న కోసక్‌ల మధ్యగా నింపాదిగా అడుగులు వేసుకుంటూ బయటికి వెళ్ళాడు. అక్కడనుంచి తిన్నగా కొండల దారి పట్టాడు.

ఆకాశంబాగా నిర్మలంగా ఉంది. నీపర్ నదిమీద నుంచి సన్నగా గాలివీస్తోంది. ఎక్కడో దూరాన నీటికాకి అరుపుదప్ప ఇంకేమీ వినిపించడంలేదు. కాని హఠాత్తుగా గలగల శబ్దమయింది. డానిలో, అతని నౌకరు గచ్చతీగల చాటున దాక్కున్నారు. ఎవరో ఎర్రటికోటు తొడిగి రెండు పిస్తోళ్ళు పట్టుకుని, కత్తి పక్కన వేలాడుతూంటే కొండపక్క నుంచి వస్తున్నాడు.

"ఓ-మామగారు!" అన్నాడు పొదలచాటునుంచి ఎగాదిగా చూసి "యీ వేళప్పుడు యెక్కడికి వెళుతున్నాడు, యెందుకు వెళుతున్నాడు స్టెపుస్కా! నేరోద్దంటే వెళతాడో కనిపెట్టి చూడు."

ఎర్రకోటు తొడిగిన వ్యక్తి తిన్నగా నదిఒడ్డుకు వెళ్ళి కోటస్థలంవైపు మళ్ళాడు.

"ఓ-అక్కడకా వెళుతున్నది!" అన్నాడు డానిలో. "సైట్సు, మాంత్రికుడి గుహకే వెళ్ళుతున్నాడేమిటి!"

"ఆఁ-అక్కడికే వెళుతున్నారు, దొరా! లేకపోతే అవతలవేపున కనిపించేవారే. కోటదగ్గిర మాయమయిపోయారు."

"సరే, పద, ఆయన కాలిజాడంటే మనమూ వెళదాం. యిందులో యెదో రహస్యం వుంది. సరే, కాటెరీనా, మీ నాన్న దుర్మార్గుడని నేను చెప్పలా! యెన్నడూ నిజమయిన క్రైస్తవమతస్తునిలా ప్రవర్తించలేదు!"

డానిలో, అతని నౌకరు బర్రున పరుగెత్తి కనుమరుగయారు. కోటచుట్టూ ఉన్న దట్టమయిన అడవి వారిని మరుగుపరిచింది పైకిటికీలో దీపం మినుకుమినుకుమంది. ఎక్కడం ఎలాగా అని ఆలోచిస్తూ ఆ కోసక్‌లు ఇద్దరూ కింద నిలబడ్డారు. గేటుగాని, ద్వారంగాని కనిపించలేదు. ఆవరణలో గుమ్మం ఉంది. కాని ఎక్కడం ఎలా? దూరాన గొలుసుల గలగల, కుక్కల చంచలనం వినిపించాయి.

"అరే, కాలం వ్యర్థం చేస్తున్నామే!" అన్నాడు డానిలో. కిటికీపక్కనే ఉన్న మద్దిచెట్టునుచూసి, "యిక్కడే వుండు, నేను చెట్టు యెక్కుతాను. అక్కడనుంచి సూటిగా కిటికీలోనుంచి చూడచ్చు."

కాసికోక ఊడదీసాడు. గలగల మంటుందని కత్తి తీసివేసాడు. కొమ్మలు పట్టుకుని పైకి ఎగబాకాడు. దీపం

ఇంకా అక్కడే ఉంది. కిటికీకి దగ్గరగా ఉన్న కొమ్మమీద కూర్చుని లోపలికి చూసాడు. గదిలో కొవ్వొత్తి లేకపోయినా వెలుగుగానే ఉంది. గోడలమీద ఎవెవో రహస్యసంకేతాలు వేసిఉన్నాయి. చిత్ర విచిత్రమయిన ఆయుధాలు వేలాడు తున్నాయి. అటువంటివాటిని టర్కీవాళ్ళుగాని, క్రిమియా వాళ్ళుగాని, పోలండువాళ్ళుగాని, క్రిస్టియన్లుగాని, చివరికి స్వీడన్ దేశీయులుగాని ధరించి ఎరగరు. గబ్బిలాలు అటు ఇటూ తిరుగుతున్నాయి. వాటి కీనీడలు నేలమీద, తలుపుల మీద, గోడలమీద ఆడిపోతున్నాయి. ఏమాత్రం చప్పుడు కాకుండా తలుపు తెరుచుకుంది. ఎవరో ఎర్రటికోటు తొడు కున్న వ్యక్తి లోపలికి ప్రవేశించి తిన్నగా తెల్లటి బట్ట కప్పిన మేజాబల్లదగ్గరకు వెళ్ళాడు. "అరే, మామామగారే!" అనుకుని డానిలో కొంచెం కిందకుదిగి, చెట్టును ఇంకా దగ్గరసా అనుకున్నాడు.

కిటికీలోనుంచి ఎవరన్నా తొంగి చూస్తున్నారేమో నని చూసే సావకాశం మామగారికి లేకపోయింది. రావడమే విచారంతో వచ్చాడు. బల్లమీదనుంచి వస్త్రం తొలగిం చాడు. వెనువెంటనే గది నీలిరంగు వెలుతురుతో నిండిపో యింది. కాని గదిలోని లేత పసిడిరంగు వెలుతురు కెరటాలు ఆనీలిరంగు వెలుతురుతో కలియకుండా నీలి సముద్రంలో లేచే కెరటాలలాగా, చలువరాయిలోని గీతలలాగా చారలు చారలుగా వ్యాపించాయి. ఇక మామగారు బల్లమీద కుండపెట్టి అందులో ఏవో మూలికలు వేయసాగాడు.

డానిలో ఇంకా పరీక్షగా చూసాడు. మామగారి ఒంటిమీద ఎర్రకోటు కనిపించలేదు. టర్కీవాళ్ళు తొడిగే వదులుపాటి పంట్లాం తొడిగాడు. కాసికోకకు పిస్తోళ్ళు న్నాయి. తలమీద విచిత్రమయిన టోపీ. టోపీమీద అక్ష రాలు కుట్టిఉన్నాయి. అవి రష్యన్ అక్షరాలూ కావు, పోలిష్ అక్షరాలూ కావు. మొహం క్షణక్షణానికీ మారిపో సాగింది. ముక్కు పొడుగయి పెదవులమీదకు వచ్చి పడు తోంది. క్షణికంలో నోరు చెవులదాకా వ్యాపించింది. పళ్ళ మధ్య వంకరపన్ను మొలిచింది. కాప్టెన్ పెళ్ళివిందులో కని పించిన మాంత్రికుడు డానిలో ముందు ప్రత్యక్షమయాడు. "నీకల నిజమయింది. కాటెరీనా !" అనుకున్నాడు డానిలో.

ఆ మాంత్రికుడు బల్లచుట్టూ తిరగసాగాడు. గోడమీద సంకేతాలు త్వరత్వరగా మారిపోతున్నాయి. గబ్బిలాయిలు పైకీ కిందకీ, అటూఇటూ వేగంగా ఎగురుతున్నాయి. నీలి వెలుతురు క్రమక్రమంగా తగ్గిపోతూ మాసిపోయింది. చక్కని గులాబిరంగు వెలుతురు గది అంతటా ప్రసరించింది. ఘంగు మనే శబ్దంతో ఆ వెలుతురు గది నలుమూలలను ముంచెత్తి వేసి హఠాత్తుగా మాయమయిపోయింది. గదిలో కటిక-చీకటి చీడీచప్పుడూ లేదు. అద్దంలాంటి నీటిమీద విహరిస్తూ, రెల్లును లోపలికి అణచివేస్తూ గాలిచేసే మర్మరధ్వనిలాంటిది మాత్రం వినవచ్చింది. గదిలో చంద్రుడు ప్రకాశిస్తున్నట్టు, నక్షత్రాలు కదలాడుతున్నట్టు, ముదురు నీలి ఆకాశపు ఛాయలు నీలిగా పడుతున్నట్టు, చలిగాలి కొడుతున్నట్టు డానిలోకి అనిపించింది. కలకనడం లేదని నిశ్చయించుకునే

టందుకు మీసాలు లాక్కున్నాడు. ఆ ఆకాశం తన స్వంతఇంటి లాగా కనిపించింది. గోడలమీద అతని తాతారు, టర్కీ కత్తులు వేలాడుతున్నాయి. గోడలచుట్టూ కుండలు మూకుళ్లు పెట్టిన అలమారాలు. బల్లమీద రొట్టె, ఉప్పు. లోకప్పునుంచి ఉయ్యాల వేలాడుతోంది. దేవతావిగ్రహాలు ఉండవలసిన స్థలంలో భయంకరమయిన మొహాలు!స్టౌవ్ మీద-పొగమంచు అంతటినీ కప్పివేసి మరుగుపరిచింది. మళ్ళీ చీకటి. అద్భుతావహమయిన ధ్వనితో గులాబిరంగు వెలుతురు గదిని మళ్ళీ ముంచెత్తింది. తిరిగీ మాంత్రికుడు విచిత్రమయిన పాగా పెట్టుకుని కదలకుండా నిలబడ్డాడు. ధ్వనులు క్రమక్రమంగా పెద్దవయినాయి. గులాబిరంగు వెలుతురు ఇంకా పెద్దగా ప్రకాశించింది. గది మధ్యలో తెల్లటిమబ్బులాంటి దేదో తిరగసాగింది. దానిలోకి ఆ మబ్బు మబ్బుకాదని ఒకస్త్రీ అక్కడ నిలబడి ఉందనీ అనిపించింది. కాని ఆమెకు శరీరం అంటూ ఉన్నట్టులేదే! అంతాగాలి! పాదాలు నేలకు ఆనడంలేదేమిటి? గులాబిరంగు వెలుతురు, గోడమీది సంకేతాలు ఆమెగుండా కనిపిస్తున్నాయేమిటి? పాదదర్శకమయిన తల కదిలించింది. లేత నీలికళ్ళల్లో కోమలమయిన కాంతి ప్రకాశించింది. జుట్టు ఉంగరాలు తిరిగి బూడిదరంగు మంచుపొగలాగా బుజాల మీద పడింది. ఉదయం తెల్లటి ఆకాశంలో కనిపించీ కనిపించకుండా వెలిగే అరుణోదయ కాంతిలాంటి ఎర్రటికాంతి ఆమె పెదవులమీద తారాడింది. నల్లటి కనుబొమలు మసకమసకగా కానవచ్చాయి. అరె, కాటెరీనా! దానిలో అవయ

వాలు మొద్దుబారిపోయినట్లయాయి. మాట్లాడాలని యత్నిం చాడు. పెదవులు కదిలాయిగాని మాట పెగలలేదు.

ఆ మాంత్రికుడు కదలకుండా నిలబడ్డాడు.

"యెక్కడికి వెళ్ళావ్?" అని అడిగాడు అతనికి ఎదురుగా నిలబడ్డ ఆకారం వణకిపోయింది.

"అబ్బ! నన్నెందుకు పిలిపించావ్?" అంది మెల్లగా. "సుఖంగా బతుకుతున్నాను. పుట్టి, పదిహేను సంవత్సరాలు పెరిగినచోట నివసిస్తున్నాను. అక్కడ యెంత బావుందని! చిన్నతనంలో నే నాడుకున్న మైదాన యెంత పచ్చగా, సువాసన విరజిమ్మతూ ఉందని! అడవి పువ్వులు పూర్వం లాగానే సొంపుగా వున్నాయి. మన గుడెసె, తోట! మా అమ్మ యెంత ప్రేమతో నన్ను కావలించుకునేది! ఆమె కళ్ళల్లో యెంత ప్రేమ గోచరించేది! నన్ను లాలించేది. నా పెదవులు, చెంపలు ముద్దుపెట్టుకునేది. చక్కటి దువ్వెనతో నా జుట్టు దువ్వేది. నాన్నా!" ఇలా అని అతనిమీాద దృష్టి నిగిడ్చి అడిగింది. "అమ్మని యెందుకు చంపేసావ్?"

ఆ మాంత్రికుడు బెదరిస్తూ వేలు ఆడించాడు. "ఆ విషయం యెత్తవద్దని చెప్పలా?" ఆ సుందరాంగి భయంతో వణికిపోయింది. "నీ యజమానురాలు యేదీ?"

"నా యజమానురాలు కాటికేనా నిద్రపోతోంది. నాకు సంతోషమయింది. చప్రున బయటపడి పరుగెత్తుకుంటూ వచ్చాను. అమ్మని చూడాలని చాలా కాలంనుంచి తహతహలాడిపోతున్నా. మళ్ళీ పదిహేనేళ్ళ పిల్లను అయిపోయా. శరీరం తేలిక అయింది. నన్నెందుకు పిలిపించావ్?"

"నిన్న నేను చెప్పిందంతా జ్ఞాపకం వుందా?" మాంత్రికుడు వినిపించీ వినిపించనంత మెల్లగా అడిగాడు.

"ఆఁ- జ్ఞాపకం వుంది! జ్ఞాపకం వుంది! మరిచేపోవడానికి యేమయినా ధారపోస్తా. పాపం! కాథెరీనాకి తన ఆత్మకు దెలిసినదాంట్లో పదోవంతుకూడా తెలీదు."

"ఓఁ-కాథెరీనా ఆత్మ ఆత్మమాట!" అడుకున్నాడు డానిలో. కాని కదలే ధైర్యం లేకపోయింది.

"యిప్పటికయినా పశ్చాత్తాపపడు నాన్నా! నువ్వు హత్య చేయగానే గోరీలనించి శవాలు లేవడం మహా భయంకరంగా లేదూ?"

"మళ్ళీ ఆ పాతపాటే మొదలుపెట్టావా?" అన్నాడు మాంత్రికుడు బెదిరిస్తూ. "నా యిష్టం. నాయిష్టం వచ్చినట్లు నీచేత చేయిస్తా కాథెరీనా నన్ను ప్రేమించాల్సిందే!"

"అబ్బ! నువ్వు రాక్షసుడువిగాని తండ్రివిగావు." అంటూ ఆమె మూలిగింది. "ఊహుఁ-యేదయినా నీ యిష్టం కొనసాగదు. నీ వెధవమంత్రాలతో ఆమె ఆత్మని పిలిపించి నానా హింసలు పెట్టగలవు. నిజం. కాని ఒక్క భగవంతుడి యిష్టం ప్రకారమే ఆమె నడుచుకుంటుంది. ఊహుఁ- నేను ఆమె బొందెలో వున్నంతవరకు అటువంటి పాపిష్టిపని చెయ్యదు. నాన్నా! నీ పాపం పండేరోజు సమీపిస్తోంది. నువ్వు నా తండ్రివి అయినా కాకపోయినా నన్ను యెంతగానో నమ్మి ప్రేమించే నా భర్తకి ద్రోహం చేయించలేవు. నా భర్త నన్ను ప్రేమించకపోయినాసరే, నేనుమాత్రం ఆయనకి ద్రోహం చేయను.

విశ్వాసఘాతకుల్ని, ప్రమాణంచేసి తప్పినవాళ్ళనీ దేవుడు ప్రేమించడు."

ఇలా అని కిటికీ కేసి దృష్టి నిగిడించింది. కిటికీకిందుగా కూర్చున్న భర్త కనిపించేసరికి కొయ్యబారిపోయింది.

"యేవిఁటి చూస్తున్నావ్? అక్కడ యెవరున్నారు?" అని బిగ్గరగా అడిగాడు మాంత్రికుడు.

కాటెరీనా ఆత్మ వణకిపోయింది. కాని అప్పటికే డానిలో చెట్టుదిగి నౌకరుతో కలిసి ఇంటిదోవపట్టాడు. "అబ్బ! అబ్బ!" అంటూ తనలోతాను గొణుకున్నాడు. మనసు భయంతో గజగజలాడింది. ఇంటి ఆవరణదాటి లోపలికి వెళ్ళాడు కోసక్‌లు ఆవరణలో వెనకటిలాగే మొద్దునిద్ర పోతున్నారు. ఒక్కడు మాత్రం పైపు తాగుతూ ఇంటికి కాపలా కాస్తున్నాడు.

ఆకాశంలో చుక్కలు మినుకు మినుకు మంటున్నాయి.

## 5

"నిద్రలేపి మంచిపని చేసారు. నాకు సంతోషంగా వుంది" అంది కాటెరీనా జాకెట్టుచేత్తో కళ్లు నులుముకుంటూ ఎదురుగా నిలబడ్డ భర్తని ఎగాదిగా చూసి,

"నాకు పీడకల వచ్చింది! వూపిరాడలేదు! అబ్బ! ప్రాణం పోతుందనుకున్నా!" అంది.

"యేంకలగన్నావ్? యిదేనా?" అంటూ డానిలో తాను చూసిందంతా చెప్పాడు.

"యిదంతా మీకెలా తెలిసిందండీ?" అని ఆశ్చర్యపోతూ కాథెరీనా అడిగింది.

"ఊహుఁ - మీరు చెప్పిన విషయాలు చాలా నాకు తెలీవు. మా అమ్మను మానాన్న హత్యచేసినట్టు నేను కలగనలేదే! చనిపోయినవాళ్ళని గురించీ కలగనలేదు. ఊహుఁ - డానిలో! నువు సరిగా చెప్పలేదు. అబ్బ! మానాన్న యెంత దుర్మార్గుడు!"

"ఆ విషయం నీవు కలకనకపోవడం పెద్దవింతేంకాదు. నీ ఆత్మకు తెలిసినదాంట్లో పదోవంతుకూడా నీకు తెలీదు. మీనాన్న క్రీస్తుమత విరోధి, తెలుసా? కిందటి సంవత్సరం, అప్పటికింకా నేను పాషండులతో స్నేహంగానే వున్నాను, పోలండువాళ్ళతో కలసి క్రిమియామీదికి దాడి చేయడానికి సన్నాహాలు చేస్తూంటే, క్రీస్తుమత విరోధికి ఆత్మను పిలిచే శక్తి వుందని ఫాదరు సుపీరియరు చెప్పారు. ఆయన మహా పవిత్రమయినవారు. మనిషి నిద్రపోతూంటే ఆత్మ శరీరంలో నుంచి వెళ్ళితిరుగుతూ దేవదూతలతో కలసి స్వర్గలోకం చుట్టూ ఎగురుతుందట! మొదటినుంచీ మీ నాన్న మొహం నాకు వెగటుగొలుపుతూనే వుంది. మీతండ్రి అటువంటి వాడని తెలిస్తే నిన్ను పెళ్ళాడకపోదును. క్రీస్తుమత విరోధి కూతుర్ని పెళ్ళాడి పాపంమూటకట్టుకునేబదులు నిన్ను వదులుకునేవాడిని."

“డానిలో !” అని అరిచింది కాటెరీనా చేతులతో మొహం కప్పుకుని కన్నీళ్ళు పెట్టుకుంటూ. “యిందులో నాతప్పేముంది చెప్పు? నీకు నేనేం ద్రోహం చేయ్యాలేదే! నీకు కోపంవచ్చే పనులేమీ చేయలేదే ! త్రికరణ శుద్ధిగా నీకు సేవచేస్తున్నానే! తప్పతాగి యింటికివస్తే పళ్లెత్తుమాటన్నా అన్నానా? నీకు చక్కని చుక్కంటి పిల్లవాడిని కనలా?”

“యేడవకు, కాటెరీనా యేడవకు ! యిప్పుడు నిన్ను బాగా అర్థం చేసుకున్నాను యెన్నటికీ నిన్ను వదలిపెట్టను. ఆ పాపంకూడా మీనాన్నదే !”

“ఆయన్ని మానాన్న అనకు. ఆయన నాతండ్రికాడు. భగవంతుడిసాక్షిగా యికనించీ నాతండ్రి కాడు, కాడు? క్రీస్తుమత విరోధి ! దేవుణ్ణి దిక్కరించిన మహాపాపి! ఆయన నాశనమయి పోతూంటే, నీటమునిగి పోతూంటే రక్షించ డానికి చేయిఅయినా అందివ్వను. యేపాషాణం మూలంగానో గొంతుక ఆర్చుకుపోతూంటే గుక్కెడు మంచినీళ్ళయినా యివ్వను. యికనువ్వే నాకు తండ్రివి !”

## 6

డానిలో ఇంటిలోని నేల మాళిగంలో మాంత్రికుడిని ఇనప గొలుసులతో కట్టి మూడు తాళాలు వేసి పడేసారు. నీపర్ నది మీద అతని దెయ్యపుకోట దగ్ధమయిపోతోంది. అగ్ని జ్వాలలు ఎర్రటి రక్తంలా వెలిగిపోతూ పాతగోడలచుట్టూ విజృంభిస్తున్నాయి. నేలమాళిగంలో పడవేసిన కారణం

అతను మాంత్రికుడు అనీకాదు, పాపాలు చేసాడనీకాదు. అతని దుర్మార్గానికి భగవంతుడే శిక్ష విధించాడు. రష్యన్ సనాతనుల విరోధులతో కలిసి కాథలిక్కుకు యుక్రేనియన్ ప్రజలను లోబర్చడానికి, క్రిస్టియన్ చర్చిలు తగలబెట్టడానికి పన్నాగాలు పన్ని, ద్రోహానికి ఒడిగట్టినందుకు అతనిని ఖైదు చేసారు. మాంత్రికుడు విచారంగా ఉన్నాడు. దుష్ట ఆలోచనలు మనసులో తారాడ జొచ్చాయి. ఇక ఒక్కరోజే బతికేది. తెల్లవారితే ఈ ప్రపంచాన్ని విడిచి పోవలసిందే. ఉరి తీసేస్తారు. శిక్ష తేలికగా ఏం ఉండదు. బతికి ఉండగానే కాగులోవేసి ఉడకబెట్టకుండా ఉంటే, చర్మం ఒలవకుండా ఉంటే అంతేచాలు. మాంత్రికుడిని విచారం ముంచెత్తింది. తలవంచుకున్నాడు. బహుశా చావుకుముందు పశ్చాత్తాపం కలిగిందేమో! కాని అతనుచేసిన ఘోరపాపాలు క్షమించ తగ్గవికావు. పైన ఇనపచట్రం కిటికీఉంది. ఇనప గొలుసులు చప్పుడు చేసుకుంటూ కూతురు ఆనోవన వెళుతూందేమోనని కిటికీగుండా చూసాడు. ఆమె చాలా మంచిది, క్షమిస్తుంది. తండ్రిమీద దయదలచవచ్చు. కాని ఎవరూ కనిపించలేదు. కిటికీ కిందగానే రోడ్డు వెళుతుంది. కాని ఎవరూ ఆరోడ్డువెంట నడవడం లేదు. దానికిందుగా నీపర్ నది ఎవరినీ లక్ష్యపెట్టకుండా మర్మరధ్వని చేసుకుంటూ ప్రవహిస్తోంది. ఎడతెగని ప్రవాహధ్వని ఖైదీకి విసుగెత్తించింది.

రోడ్డుమీద ఒక కోసక్ కనిపించాడు. ఖైదీ దీర్ఘంగా నిట్టూర్చాడు. మళ్ళీ ఎవరూ కనిపించలేదు. దూరాన కొండ దిగి ఎవరో వస్తున్నారు. గాలిలో ఆకుపచ్చని కోటు రెపరెప

లాడింది. పసిడి తలపాగా తలమీద ప్రకాశిస్తోంది. ఆమె! కిటికీకి ఇంకా దగ్గిరగా జరిగాడు. ఆమె దగ్గరకు వస్తోంది.

"కాటెరీనా! దయజూడు, దయజూడు!"

ఆమె మాటాడలేదు. తండ్రిమాట వినిపించుకోలేదు. వెనుదిరిగి చూడలేదు. కిటికీదాటి కనిపించకుండా వెళ్ళిపో యింది. ప్రపంచమంతా శూన్యంగా అతనికి తోచింది. నీపర్ నది విచారంతో మూలుగుతోంది. అతని హృదయం విచా రంతో బరువెక్కిపోయింది. అటువంటి విచారం ఆ మాంత్రి కుడు ఎన్నడయినా ఎరుగున్నాడా?

సాయంకాలం కావస్తోంది. సూర్యుడు అస్తమిస్తు న్నాడు. ఇంతలో పూర్తిగా అస్తమించేసాడు. సాయంకాల మయింది. చల్లగా ఉంది. ఎక్కడో ఒక ఎద్దు అరుస్తోంది. దూరాన్నుంచి గొంతులు వినిపిస్తున్నాయి. పనిపాటలు పూర్తి చేసుకుని జనులు కులాసాగా ఇళ్ళకు వెళుతున్నారు నీపర్ నది మీద ఒకపడవ తళుక్కుమని పొడగట్టింది. ఖైదీవిషయం తలచినవారేలేరు. ఆకాశంలో అర్ధచంద్రుడు ప్రకాశిస్తు న్నాడు. ఎదుటివైపునుంచి రోడ్డుమీద ఎవరో నడిచివస్తు న్నారు. చీకటిలో ఆ వచ్చేదెవరో చెప్పడంకోవడం కష్టం. ఆ వచ్చేది కాటెరీనా!

"అమ్మాయి! పుణ్యముంటుంది! తోడేలు పిల్లలు కూడా తల్లిని ముక్కలుముక్కలుగా చీల్చేయవు. నీయీ పాపిష్టి తండ్రివంక ఒక్కసారి చూడు!"

అతని మాటలు వినిపించుకోకుండా ఆమె సాగిపో తోంది.

"అమ్మాయి! దురదృష్టవంతురాలయిన నీ తల్లికోసర మయినా—"

ఆమె ఆగింది.

"దగ్గిరికి వచ్చి నా ఆఖరిమాటలు విను."

"నన్ను పిలుస్తావెందుకు? పాపాత్ముడా! 'అమ్మాయీ' అని నన్ను పిలవకు. నీవు నా తండ్రివికావు, నేను నీకూతురిని కాను. నా తల్లికోసరమని యేం చేయమంటావ్, చెప్పు?"

"కాథెరీనా! నా చావుదగ్గర పడ్డది. అడవిగుర్రం తోకకు నన్ను కట్టేసి ఆరుబయటికి తోలేయాలని నీ మొగుడు చూస్తున్నాడు. లేకపోతే యింకా భయంకరమయిన విధంగా చంపడానికి ఆలోచిస్తున్నాడో!"

"నీ పాపాలకు తగినశిక్ష వుందా? శిక్ష అనుభవించ డానికి తయారుగావుండు. నీ పక్షం పలికేవారెవరూ లేరు!"

"కాథెరీనా! యీ యిహలోకంలో శిక్షకు నేను భయ పడడం లేదు. నరకంలో హింసలకు భయపడుతున్నా. నువ్వు వట్టి అమాయకురాలివి కాథెరీనా! నీఆత్మ స్వర్గలోకంలో భగవంతుని సాన్నిధ్యంలో విహరిస్తుంది. కాని నీపాపిష్టితండ్రి ఆత్మ కణకణలాడే అగ్నిలో మాడిపోతుంది. ఆఅగ్ని యెన్న టికీ చల్లారదు. నానాటికీ యింకా మండిపోతుంది. మంచు చుక్కకూడా దానిమీద పడదు. గాలి ఆడదు."

"ఆశిక్ష తగ్గడానికి నేనేం చేయగలను?" అంటూ కాథెరీనా మొహం తిప్పేసుకుంది.

"కాథెరీనా, ఆగు. వక్కమాట వినిపో. నువ్వు నా ఆత్మని రక్షించగలవు. భగవంతుడు యెంత కరుణామయుడో నీకింకా బోధపడలేదు. పాల్ అపోస్తలును గురించి వినలేదూ? ఆయన యెంత పాపాత్ముడు - పశ్చాత్తాపపడి మహర్షి అయ్యాడు."

"నీ ఆత్మను రక్షించడానికి నేనేం చేయాలి?" అని అడిగింది కాథెరీనా. "నేను ఆడదాన్ని, నావల్ల నేమవుతుంది!"

"యిక్కడినించి బయట పడగలిగితే సర్వసంగ పరిత్యాగంచేస్తా. పశ్చాత్తాపపడి యే గృహాల్లోనో ప్రవేశించి రాత్రింబవళ్ళు ప్రార్థనలుచేస్తా. మాంసమే కాదు, చేపలు తినడం కూడా మానేస్తా. కటికి నేలమీద పడుకుంటా. యెడతెగకుండా ప్రార్థనలుచేస్తా. నా పాపాల్లో వందోవంతయినా దేవుడు పరిహరించకపోతే కంఠంలోతు భూమిలో పాదుకుపోతా లేదా సజీవ సమాధి కట్టించుకుంటా. తిండీ తిప్పలూ మానేసి చచ్చిపోతా. నీ ఆత్మ శాంతికోసం నలభయిపవళ్ళు, నలభయి రాత్రిళ్ళూ ప్రార్థనలు చేసేందుకు నావస్తుసామాగ్రి అంతా పరివ్రాజకులకు అర్పిస్తా."

కాథెరీనా ఆలోచించింది. "తాళాలు తీయగలిగినా కట్లు వూడదీయలేనే?"

"గొలుసు అంటే నాకేంభయంలేదు, వాళ్ళు నా కాళ్ళూ చేతులూ కట్టేసారనుకున్నావేమో! వాళ్ళకళ్ళ మీదికి పొగమంచు వదిలి చేతులకు బదులు కొయ్యముక్కలకు బేడీలు వేయించుకున్నా. యిదిగో, చూడు, నావంటి

మీద గొలుసులు లేవు” ఇలా అని మాళిగంమధ్యకు నడిచి వెళ్ళాడు. “యీ గోడలన్నా నాకు భయంలేదు. వీటిలో నించి వెళ్ళిపోగలను. కాని యీ గోడలేవిటో నీభర్తకు తెలీదు. వీటిని ఒక మహర్షి కట్టించాడు. ఆ మహర్షి కృపదయో గించినచెవితోతప్ప యింకేవిధంగానూ యిందులోంచి తప్పించడానికి వీల్లేదు. నేను బయట పడితే యిటువంటి మాళిగలే కట్టించుకుంటా, పాపాత్మ్రణ్ణి!”

“విను. నిన్ను బయటకు తీస్తా. కాని నన్ను మోస గించి పశ్చాత్తాప పడడానికి బదులు మళ్ళీ పాపాలకు దిగుతా వేమో?” అంది కాతెరీనా గుమ్మంలో కదలకుండా నిలబడి.

“ఉహుం—కాతెరీనా! నేను ఆట్టేకాలం బతకను. యెలాగూ చావు దగ్గిరికి వచ్చింది. శాశ్వతంగా నరకంలో పడాలని ఆలోచిస్తున్నానని నమ్ముతావా, చెప్పు?”

తాళంలో చెవి కిర్రుమంది.

“సెలవు. నిన్ను భగవంతుడు రక్షించుగాక!” అన్నాడు మాంత్రికుడు కూతురును ముద్దిడుకుంటూ.

“నన్ను తాకవద్దు. పాపాత్ముడా! తొందరగా వెళ్ళిపో” అంది కాతెరీనా.

అతను వెళ్ళిపోయాడు.

“నేనే వదిలిపెట్టాను.” అని తనలో అనుకుంది భయ పడిపోయి గోడలకేసి పిచ్చిగా చూస్తూ. “నాభర్తకి యేమని జవాబు చెప్పగలను? సర్వనాశన మయింది! సజీవ సమాధి ఒక్కటే మిగిలింది.”

ఇలా అనుకుంటూ వెక్కి వెక్కి ఏడ్చి, ఆ ఖైదీ కూర్చున్న రాతిమీద పడిపోయేదయింది. "కాని నేనొక ఆత్మని రక్షించాను" అనుకుంది. మెల్లగా. "నేను పుణ్యం చేసాను. యిక నా భర్తను—మోసగించాను. మొదటిసారిగా మోసగించాను! అబ్బ! ఆయనతో అబద్ధం యెలా చెప్పను? యెవరో వస్తున్నారు. ఆయనే నాభర్త!" నిరాశతో కెవ్వుమని కేకవేసి స్పృహ తప్పి నేలమీద పడిపోయింది.

# 7

"నేనేతల్లీ! నేనే!" కాటెరీనాకి స్పృహవచ్చేసరికి ఈ మాటలు వినిపించాయి. ఎదురుగా ముసిలిదాసి కనిపించింది. దాసి ఆమెమీదికివంగి చెవులో చెప్తూతున్నట్టుంది. క్షీణించి పోయిన చేయిచాచి నీళ్ళు జల్లింది.

"నేనెక్కడ వున్నాను?" అని అడిగింది కాటెరీనా, లేచి కూర్చుని చుట్టుచూస్తూ.

"ముందు నీపర్ నది ప్రవహిస్తోంది. వెనక కొండలు. నన్నెక్కడకు తీసుకువచ్చావ్?"

"బయటికి, మాళిగంలో వూపిరాడడంలేదు. చేతులతో యెత్తుకుని తీసుకువచ్చా. దానిలోతో చిక్కులు రాకుండా మాళిగానికి తాళంవేసేసాను?"

"తాళంచెవియేదీ?" అని అడిగింది నడుంకట్టు చూసుకుని. "కనిపించడంలేదే?"

"మాంత్రికుడిని చూడడానికని నీభర్త తీసుకువెళ్లాడు, తల్లీ!"

"చూడడానికా? అయితే కొంప మునిగింది!"

"దేవుడుదయజూస్తాడు తల్లీ! మాట్లాడకుండావూరుకో, యెవరికీ తెలీదు."

"తప్పించుకు పోయాడు, పాషండపు వెధవ తప్పించు పోయాడు. కాటెరీనా! విన్నావా, తప్పించుకు పోయాడు!" అన్నాడు డానిలో భార్యను సమీపిస్తూ, కళ్లునిప్పులు గక్కుతున్నాయి. పార్శ్వనకత్తి టక్‌టక్ మంటోంది. ఆమె మొహంలో నెత్తురు చుక్కలేదు.

"యెవరన్నా వదిలి పెట్టారా?" అని గొణిగింది, వణికిపోతూ.

"అవును, వదిలిపెట్టారు. దెయ్యం. చూడు, అతను వుండాల్సినచోట గొలుసులు కట్టిన దుంగపడివుంది. కోసక్ అంటే దెయ్యానికి కూడా భయంలేదు. దేవుడి సంకల్పం అంతేనేమో! యిటువంటి పనిచేయాలని నా కోసక్‌లలో యెవరన్నా కలలోనయినా తలిస్తే వాడికి యేం శిక్ష విధించేవాడినో?"

"నేనే వదిలిపెట్టి వుంటేనో?" అని కాటెరీనా అడగకుండా ఉండలేకపోయింది. భయపడిపోయి ఇక మాటాడలేదు.

"నువే అపని చేసివుంటే నా భార్యవి కావన్నమాటే. నల్లరాయి మెడకుకట్టి నీపర్‌నది మధ్యలో తోసేస్తా!"

కాటెరీనాకి ఊపిరి ఆడలేదు. తలమీది జుట్టు నిక్కపొడుచుకుంది.

## 8

సరిహద్దు రోడ్డుమీది ఒకసారా దుకాణంలో పోలండు వారు చేరారు. అప్పటికి రెండురోజులనుంచీ విందు చేసుకుంటున్నారు. ఒకళ్లూ ఇద్దరూ కాదు, వందలకొలదీ ఉన్నారు. ఎవరిమీదో దాడిచేసే సన్నాహంలో ఉన్నారనడంలో సందేహం లేదు. కొంతమంది దగ్గర బందూకులు ఉన్నాయి. తట్టుముళ్ళు, కత్తులు గలగల లాడుతున్నాయి. జమీందారులు వేడుకలు చేసుకుంటూ డప్పాలు కొడుతున్నారు. ఆ అద్భుత కృత్యాలుచేసాం ఈఅద్భుతకృత్యాలుఅని చెప్పుకుంటూమురిసిపోతున్నారు. యుక్రేనియన్ ప్రజలను బానిసలని నీచంగాతూలనాడుతూసనాతన క్రైస్తవులనువేళాకోళంచేస్తున్నారు. అహంకారంతో మీసాలు మెలివేసుకున్నారు, బెంచీలమీద కాళ్లు పారజాచుకుని పడుకున్నారు. వారిలో ఒక ఫాదరీకూడా ఉన్నాడు. కాని అతనూ వారిలాగానే ప్రవర్తిస్తున్నాడు. క్రైస్తవ ఫాదరీ వాలకమే లేదు. వారితోపాటుతాగి తందనాలాడుతూ పాపిష్టినోరుతో వినరాని బూతులు మాటాడుతున్నాడు. ఇక నౌకర్లు యజమానుల కేమాత్రం తీసిపోవడం లేదు. చినిగిన అంగరఖాల చేతులు పైకి మడుచుకుని గొప్పవారిలాగా ఊగుతూ తిరుగుతున్నారు. చీట్ల పేక ఆడుతూ, ఒకరి ముఖాలమీద ఒకరు పేకముక్కలువేసి కొట్టుకుంటు

న్నారు. పరస్త్రీలను పట్టుకువచ్చారు. ఇంక కజ్జాలకి కేకలకి కొదువేముంది! యజమానుల అల్లరి పరాకాష్టకు అందుకుంది. తమాషాలమీద తమాషాలు సాగించారు. సారాదుకాణం యజమానియూదు. అతనిగడ్డం పట్టుకులాగారు. అతనిముఖం మీద శిలువగుర్తు వేసారు. ఆడవాళ్ళకేసి ఖాళీబందూకులు గురిపెట్టి భయపెట్టారు ఫాదరీతో కలిసి నాట్యంచేసారు. రష్యన్ నడిగడ్డమీద నౌకర్లు కూడా ఇంతటి పాపపుపనులు ఎన్నడూ చేయలేదు. రష్యా చేసుకున్న పాపానికి శిక్షగా ఇంతటి అవమానం భగవంతుడు ప్రాప్తింపజేసాడేమో! ఆ పిచ్చివాగుడు మధ్య నీపర్ నది ఎగువనఉన్న డానిలో ఇంటిని గురించి అతని భార్యాని గురించి సంభాషణ ప్రారంభ మయింది.

ఈజట్టు ఎవెవో పాపిష్టిపనులు చేయడానికి ఎత్తు అలో చిస్తున్నారు.

## 9

డానిలోయింట్లో మేజాబల్లమీద చేతులుఆనించిఆలో చిస్తూ కూర్చున్నాడు. కాటెరీనా స్టౌవ్ పానుపుమీద కూర్చుని పాడుతోంది.

"మన సేపీఁ బాగుండలేదు" అన్నాడు డానిలో. "తల నెప్పిగా వుంది. మనసులో నెప్పిగా వుంది. యెందుకో కుంగి పోతున్నాను. చావు దగ్గర పడ్డట్టుంది!"

"తల నామీద వాల్చండి. యెందుకు యిలాంటి ఆలోచనలు పెట్టుకుంటారు?" కాతెరీనా ఈ మాటలు అన దలచిందిగాని మాటలు బయటికి పెగలలేదు. తప్పుపని చేసిం దేమో భర్త తనను ఆప్యాయంగా చూడడం భరించలేక పోయింది.

"విను. అన్నాడు డానిలో." నేను చచ్చిపోతే కుర్ర వాడిని మాత్రం గాలికి వదిలేయకు. వాడిని వదిలిపెట్టావో భగవంతుడు నీకు యీ లోకంలోగానీ పరలోకంలోగానీ సౌఖ్యం ప్రసాదించడు. భూమిలోనే యెముకలు కుళ్ళిపోవడం విచారకరమేగాని ఆత్మ యింకాఘోషిస్తుంది.

"యేమిటా పిచ్చిమాటలు! గుండె నిబ్బరం లేని వాళ్ళమని మా ఆడవాళ్ళని పరిహసించేవారుగా! మీరూ అలాగే మాటాడితే యెలా? మీరు యింకా చాలాకాలం బతకాల్సి వుంది."

"ఊహుఁ— కాతెరీనా! చావు దగ్గరపడ్డదని నా మన సుకు తెలుస్తోంది. ప్రపంచమే శూన్యంగా కనిపిస్తోంది చెడ్డ రోజులు రానున్నాయి. అవును. జ్ఞాపకం వుంది. ఆ రోజులు తిరిగిరావు. ముసిలి కోనాషెవిచ్ అప్పటికింకా బతికే వున్నాడు. మా సేనకు గౌరవం, కీర్తి తెచ్చిపెట్టింది ఆయనే! కోసక్ పటాలాలు నా కళ్ళముందు తారాడుతున్నాయి. యివాళ జరుగుతున్నట్టే వుంది. ఆ రోజులు మాకు మంచి రోజులు, కాతెరీనా! ముసిలి సేనాధిపతి నల్లటి గుర్రంమీద కూర్చున్నాడు. చేతిలో వెండికర్ర ప్రకాశిస్తోంది. చుట్టూ అంగరక్షకులునిలబడ్డారు. యిరువేపులా జపరోజియే సైన్యం

సముద్రములాగా సాగిపోయింది. సేనాధిపతి మాట్లాడ సాగాడు. అంతా నేలకు అంటుకుపోయినట్లు నిలబడ్డారు. పూర్వం వేసినదాడులనుగురించీ, యుద్ధాలనుగురించీ చెపుతూ సేనాధితి ఏడ్చాడు. కాతెరీనా! ఆరోజుల్లో టర్కీవాళ్ళతో యెలా పోరాడామని! యిదిగో నా తలమీద గాయపుమచ్చ! నాలుగు తుపాకిగుళ్ళు నా శరీరంలో నాలుగుచోట్ల దూసుకు పోయాయి. ఒక్క గాయం యింకా బాగా మానలేదు. యెంత బంగారం దొరికిందని! కోసక్‌లు టోపీలు విలువయిన రాళ్ళతో నింపుకున్నారు. యేం గుర్రాలు! అబ్బా! ఏంగుర్రాలు తోలుకువచ్చామని! యిక యీ జన్మలో నేను అలా పోరాడ లేను! నాకు యింకా ముసలితనం రాలేదు. వంట్లో శక్తి వుంది అని అంతా అనుకుంటారు. కాని కత్తి చేతిలోనించి జారిపోతోంది. సోమరిగా బతుకుతున్నా. యెందుకు బతుకు తున్నానో నాకే తెలీదు. ప్రస్తుతం యూక్రెయిన్‌లో భద్రత లేదు. కలనల్‌లు, కాప్టెన్లు కుక్కలలాగా కొట్లాడుకుంటు న్నారు. అందరిమీద అధికారి అంటూ యెవరూ లేరు. గొప్పవారంతా పోలండువాళ్ళని అనుకరిస్తున్నారు. వారి టక్కరీతనం అవలంభించారు. యూనియట్ మతం పుచ్చు కుని ఆత్మల్ని అమ్ముకున్నారు. యూదులు బీదలను అణచి పారేస్తున్నారు. అబ్బ! ఆ రోజులు! ఆ రోజులు వెళ్ళి పోయాయి! నా యవ్వనం గడిచిపోయింది! అరే, కుర్రాడా! నేలమాళిగంలోకి వెళ్ళి కూజాడు మద్యం తీసుకురా. గతం తల్చుకుని, గతించినరోజులు తలుచుకుని తాగుతాను!”

"మన అతిథులకి యెలా స్వాగతం యిద్దాందొరా! మైదానం వేపునుంచి పోలండు వాళ్ళు వేంచేస్తున్నారు" అన్నాడు స్టెటోన్కొ లోపలికి వస్తూ.

"వాళ్ళెందుకు వస్తున్నారో నాకు తెలుసు" అన్నాడు డానిలో లేస్తూ. "గుర్రాలకి జీనులు కట్టండి. కవచాలు వేసుకోండి! కత్తులు తీసుకోండి! తుపాకిగుళ్లు మరిచేపోకండేం! అతిథులను సత్కరించాలి!"

కాని కోసక్‌లు గుర్రాలమీద జీనులువేసి, తుపాకీలలో గుళ్ళుదూర్చకముందే పోలండువాళ్లు ఆకురాలుకాలంలో ఆకులు నేలను ఆక్రమించినట్లు కొండప్రాంతాన్ని ఆక్రమించారు.

"ఆఁ-మన బలపరాక్రమాలు ప్రదర్శించే సమయం వచ్చింది" అన్నాడు డానిలో ముందు వరుసలలో బంగారపు ముస్తీబు కట్టిన గుర్రాలమీద గంభీరంగా ఊగే పోలండు వాళ్ళనిచూసి. "మళ్ళీ యింకోసారి కీర్తి సంపాదించే అదృష్టం మనకి పట్టింది. ఆఖరిసారిగా, కోసక్ ఆత్మా, హాయిగా విహరించు! కుర్రాళ్ళూ పదండి ముందుకు! యీరోజు పండగ!"

కొండలమీద పండగ వేడుకల కోలాహలం! కత్తులు ఆడిపోతున్నాయి. తుపాకిగుళ్ళు ఎగురుతున్నాయి. గుర్రాలు సకిలిస్తూ కదం తొక్కుతున్నాయి. కేకలతో తల దిమ్మెత్తిపోతోంది. పొగమూలాన కళ్ళు కనిపించడం లేదు. అంతా గందరగోళంగా ఉంది. కాని కోసక్‌లు స్నేహితులు ఎక్కడ ఉన్నదీ తెలుసుకో గలుగుతున్నారు. తుపాకిగుండు బుయ్

మనగానే గుర్రం మీదనుంచి ఒకయోధుడు కిందపడ్డాడన్న మాటే! కత్తి తళుక్కుమన్నదంటే ఏదో అస్పష్టంగా గొణుగు కుంటూ ఒకతల నేల కూలిందన్నమాటే !

అయితేనేం డానిలో కోసక్ టోపీఎర్రకుచ్చు జనంలో ఎల్లప్పుడూ కనిపిస్తూనే ఉంది. నీలి అంగరఖామీద పసిమి కాసికోక ధగధగ లాడుతోంది. అతని నల్లగుర్రం జూలు గాలిలో రెపరెప లాడుతోంది. పక్షిలా అటూఇటూ తిరుగుతూ కేకలువేస్తూ డమాస్కస్ కత్తితిప్పుతూ, కుడి ఎడమల నరుక్కుంటూ వీరవిహారం చేసాడు. నరికేయండి, కోసక్‌లు! నరికేయండి! పండగ చేసుకోండి. తృప్తిగా పోరా డండి! అంతేగాని బంగారు ఆభరణాలవంక, అంగరఖాల వంక చూడకండి ! బంగారాన్ని ఆభరణాలను కాలికింద తొక్కేయండి. పొడవండి! పగతీర్చుకోండి. కాని ఒక్క మాటు వెనకకు తిరిగిచూడండి. ఆ పోలిష్‌పాషండులు గుడిసెలలో నిప్పంటిస్తున్నారు. బెదిరిపోయిన పశువులను తోలేస్తున్నారు. సుడిగాలిలా డానిలో వెనకకు తిరిగాడు. చుట్టూ జనం చెల్లాచెదరయారు. అతని ఎర్రకుచ్చుటోపీ గుడిసెలదగ్గర తళుక్కు తళుక్కుమంది.

గంటల తరబడి పోలెండువాళ్ళు కోసక్‌లతో పోరా డారు. ఇరుపక్షాలలో ఎక్కువమంది మిగలలేదు. కాని డానిలో మాత్రం జోరుతగ్గించలేదు. పొడుగాటి బల్లెంతో పొడిచి పోలిష్ రౌతులను జీనులమీద నుంచి కింద పడేసాడు. అతని గుర్రం వారిని కాళ్ళకిందతొక్కేసింది. అతని ఇంట ఆవరణనుంచి పోలండువాళ్ళు పారిపోయారు. కోసక్‌లుచచ్చిన

శ వాలమీాది ఆభరణాలు అంగరక్షాలు ఊడ తీసుకున్నారు. డానిలో పొలండు వారిని తరుముకుంటూ వెళుతూ తనవారిని పిలవడానికి వెనుతిరిగి చూసాడు. ఒడలు కుండిపోయింది. అరె! కాటెరీనా తండ్రి! బందూకు డానిలోకేసి బారుచేసి కొండపక్క నిలబడి ఉన్నాడు. డానిలో గుర్రాన్ని ఉరికించుకుంటూ అతనిదగ్గరకు వెళ్ళాడు. ఆగు! కోసక్ వీరుడా! ఆగు! నీ వినాశనం నువే కొని తెచ్చుకుంటున్నావు! బందూకు గుండు బుయ్ మంది మాంత్రికుడు కొండ వెనకకు మాయమయాడు. ఒక్క స్టెట్స్కకి మాత్రమే మాంత్రికుడు ఎర్ర అంగరఖా, విచిత్రమయిన టోపీ పొడగట్టాయి. ఆ స్వామిభక్తుడు స్టెట్స్క యజమానికి సహాయపడడానికి పరుగెత్తాడు. డానిలో నేలపడి ఉన్నాడు. మెరిసిపోయే కళ్ళు మూతలు పడ్డాయి. వక్షస్థలంనుంచి ఎర్రగా నెత్తురు పైకి చిమ్ముకు వస్తోంది. నౌకరు వచ్చాడని గ్రహించి డానిలో కళ్ళు తెరిచాడు. కళ్ళు తిరిగిపోతున్నాయి.

"శెలవు, స్టెట్కన్న శెలవు! పిల్లవాణ్ని వదిలేయద్దని కాటెరీనాతో చెప్పమన్నానని చెప్పు. నువ్వూ వాడిని వదిలేయకు!" ఇలా చెప్పి ప్రాణం వదిలాడు. దివ్యమయిన శరీరం నుంచి హంస లేచిపోయింది. పెదవులు వివర్ణమయాయి. ఆ కోసక్ వీరుడు శాశ్వత నిద్రపోయాడు.

విశ్వాసపాత్రుడయిన ఆ సేవకుడు వెక్కి వెక్కి ఏడుస్తూ కాటెరీనాను పిలిచాడు.

"రా, అమ్మా రా! నీ భర్త తాగి తూలుతున్నాడు! తాగి కటిక నేలమీద నిద్రపోతున్నాడు. యిక మరి లేవడు!"

కాతెరీనా చేతులు నలుపుకుంటూ భర్త శవంమీద పడింది. "కళ్లుమూసుకు పడుకున్నారా? లేవండి. లేచి ఒక్క మాటు మీ కాతెరీనా కేసి చూడండి! పెదవులు కదల్చండి! ఒక్కమాట మాటాడండి. మీనోరు మూగవోయింది. ప్రభూ! మూగవోయింది! నల్ల సముద్రంలా అయి పోయారు. గుండె కొట్టుకోవడం లేదు. మీ శరీరం యింతచల్లగా వుందేం? నాకన్నీళ్ళు వేడెక్కలేదు. లేకుంటే మీశరీరానికి వెచ్చ కలిగించేవే! నాఏడుపు ప్రతిధ్వనించడం లేదు. లేకుంటే మిమ్మల్ని నిద్రనుంచి లేపేదే! యిక మీపటాలాలను యెవరు నడుపుతారు? నల్లగుర్రంమీద యెక్కి కత్తిఆడిస్తూ కోసక్‌లను బిగ్గరగా పిలుస్తూ యెవరు దండు నడుపుతారు? కోసక్‌లారా! కోసక్‌లారా! మీకు కీర్తి గౌరవం తెచ్చిపెట్టిన మీ నాయకుడేడీ? యిదిగో కటిక నేల మీద కళ్ళుమూసి పడున్నారు. ఆయనతోపాటు నన్నూ సమాధి చేయండి, సమాధి చేయండి! నాకళ్ళల్లో మట్టి కొట్టండి! తెల్లటి యీవక్షంమీద కొయ్యచెక్కలు వేసి కొట్టండి. యీ అందం నాకెందుకు తగలేయనా!"

కాతెరీనా మహాబాధతో దుఃఖించింది. దూరాన దిఙ్మండలాన్ని దుమ్ము ఆవరించింది. ముసలి కాప్టెన్ గొరో బెట్స్. సహాయ పడడానికి గుర్రంమీద దౌడుతీస్తూ వస్తున్నాడు.

# 10

ప్రశాంత వాతావరణంలో నీపన్ చూడముచ్చటగా ఉంటుంది. స్వేచ్ఛగా, లలితంగా అడవులగుండా, కొండల గుండా, జాలువారుతూంటుంది. ఎక్కడా శబ్దం అంటూ వినిపించదు. ఒక్క అలఅయినా కదలాడదు. ఎంతచూసినా సముద్రంలాంటి ఆ నది కదులుతూందో లేదో చెప్పలేం. కలిగించిన స్ఫటికంలా ఉంది. అంతూ పొంతూ లేని ఆ నది నీలిగాజు పలకలాగా, రోడ్డులాగా ఆకుపచ్చని మైదానాల గుండా తోవచేసుకుంటూ ప్రవహిస్తోంది. ఎక్కడో అంత రిక్షంనుంచి ఆ నదిలో తన ప్రతిబింబాన్ని చూసుకుని గాజులాగా మెరిసిపోయే నీళ్ళల్లో కిరణాలను చొప్పించడం భగ్గున మండే సూర్యుడికి, నీళ్ళల్లో తమ ప్రతిబింబాలను చూసుకుంటూ మురిసిపోవడం తీరస్థ అరణ్యాలకు మధుర మధురంగా ఉంటుంది. ఆకుపచ్చని అలంకారాలతో అడవులు పూవులతో అంచుకు ఒత్తుకువెళ్ళి వంగి నీటిలో తమ తమ నీడలను విస్పష్టంగా చూసుకుని మురిసిపోతూ మందహాసం చేస్తూ, రెమ్మలను అల్లల్లాడిస్తూ ఆ నదీమతల్లికి స్వాగతమిస్తుంటాయి. కాని నీపన్ నది మధ్యకు వచ్చి తొంగిచూసే ధైర్యం వాటికి లేదు. ఒక్క సూర్యుడు, ఆకాశం మాత్రమే తేరిపార జూడగలుగుతారు. నదిమధ్యకు ఎప్పుడోగాని పక్షులు ఎగిరి

పోవు. దివ్యమైయిన నది సీపర్! ప్రపంచంలో దాని కదేసాటి! వెచ్చని వేసవి నిశలో కూడా సీపర్ చూడముచ్చటగా ఉంటుంది. మనుషులు, జంతువులు, పక్షులు సకల చరాచర ప్రపంచం నిద్రిస్తుంది. భగవంతుడు ఒకడు మాత్రం భూన భోంతరాళాలను మహారాజఠీవితో అవలోకించి వస్త్రం ఆడి స్తాడు ఆ వస్త్రంనుంచి నక్షత్రాలు జలజలారాలి ఆకాశంలో ధగధగా మెరిసిపోతాయి. సీపర్ నదిలో ప్రతిబింబిస్తాయి. ఆ నక్షత్రాలన్నింటినీ సీపర్ తన గర్భంలో దాచుకుంటుంది. అస్తమించేవరకూ ఏఒక్క నక్షత్రం సీపర్ నుంచి తప్పించుకు పోలేదు. నిద్రించే కాకులతో ముచ్చట ముచ్చటగా కనవచ్చే కీకారణ్యం, యుగయుగాల కితమే బీటలువారిన కొండలు తమ దీర్ఘచ్ఛాయలతో సీపర్ నదిని మరుగు పర్చాలని యత్నిస్తూ విఫలమవుతున్నాయి. ఈ భూప్రపంచంలో ఏదీ సీపర్ నదిని మరుగుపరచ లేదు. లోతుగా, నల్లగా దూర దూరాలకు నీటిని వ్యాపిస్తూ ప్రవహిస్తూంటుంది. మిట్ట మధ్యాహ్నమపుడులాగానే అర్ధరాత్రి కూడా దాని అవధి చూపుకు అందదు. రాత్రిచలికి ముడుచుకుని, ఒడ్డును కరుచు కుని కత్తిఅంచులా మెరిసిపోయే బాట వేసుకుంటూ ముందుకు సాగిపోతుంది. కాని నదీగర్భంలో మాత్రం నీరు నిద్రిస్తూం టుంది. అపుడుకూడా సీపర్ చూడముచ్చటగా ఉంటుంది. ఈ ప్రపంచంలో దానికదేసాటి ! కాని ఆకాశంలో కారు మబ్బులు కమ్మినపుడు కీకారణ్యం వేళ్ళతోసహా కదలాడి పోతుంది. సిందూరపు చెట్లు ఊగిపోతాయి. మబ్బులగుండా వంకర టింకరగా ప్రయాణిస్తూ మెరుపులు ప్రపంచమంతటినీ

జిగేలు అనిపిస్తాయి. అప్పుడు మాత్రం నీపర్ నది మహా భయంకరంగా ఉంటుంది. కొండల్లాంటి కెరటాలు గర్జిస్తూ కొండలను ఢీకొంటాయి. తళుక్కుమంటూ మూలుగుతూ ముక్కుతూ వెనకకు మళ్ళి దూరాన భోరున ఏడుస్తాయి. అలాగే కోసక్ తల్లులుకూడా కొడుకులు యుద్ధానికి బయలు దేరుతూంటే ఏడుస్తారు. ధైర్యంగా, నిర్లక్ష్యంగా కోసక్ వీరులు నడుంమీద చేతులు పెట్టుకుని టోపీ ఒకపక్కకు పెట్టు కుని నల్లగుర్రాలమీద దౌడుతీస్తారు. ఇక వారితల్లులు వెక్కి వెక్కి ఏడుస్తూ వెనకాలే పరుగుచ్చుకుని వెళ్ళి రికాబు పట్టు కుని కళ్లెం లాగుతారు. చేతులు నలుపుకుంటూ బిట్టు దుఃఖిస్తారు.

యుద్ధంచేసే కెరటాల మధ్యగా చొచ్చుకుపోయే ఒడ్డు మీంది కాలిన చెట్లబోదెలు, రాళ్ళు రప్పలు విచిత్రంగా నల్లగా ఉంటాయి. ఒడ్డుపట్టే పడవ ఒడ్డుకు కొట్టుకుని పైకి లేస్తుంది. మళ్ళీ వెనుకకు తుళ్ళిపడుతుంది. నీపర్ నది ఇలా గర్జిస్తూంటే పడవ నడుపుతున్న ఆ ధైర్యశాలి ఎవరు? ఈగలను మింగినట్లు మనుషులను నీపర్ నది మింగివేస్తుందని పాపం! అతగాడికి తెలిసి ఉండదు.

పడవ ఒడ్డు చేరుకుంది. మాంత్రికుడు పడవ దిగాడు. అతనేమీ హుషారుగా లేడు. కోసక్ లు తనయజమాని శ్రాద్ధపు విందులు జోరుగా చేయడం అతనికి కంటగింపుగా ఉంది. పోలండువారికి విపరీతమయిన కష్టాలు కలిగాయి. వారిలో నలభయి నలుగురిని, వారి సేవకులు ముప్ఫయి ముగ్గురిని కోసక్ లు ముక్కలు ముక్కలు కింద నరికేసారు. తతిమ్మా

వారిని తాతార్లకు అమ్మేందుకు గుర్రాలతోసహా పట్టుకు పోయారు.

కాలిపోయిన బోదెల మధ్యగా ఉన్న ఒక రాతిమెట్ల దారివెంట వెళ్ళి ఒక చోటుకు చేరుకున్నాడు. అక్కడే బాగా లోతుగా ఒక గుహ తనకోసం తవ్వించి ఉంచాడు. తలుపు చప్పుడుకాకుండా తెరిచి గుహలో ప్రవేశించి వస్త్రం కప్పిన మేజాబల్లమీద కుండ ఒకటి పెట్టి దానిలో వింత వింత మూలికలు వేయసాగాడు. అపూర్వమయిన కొయ్య కూజాతో నీళ్ళు తీసుకుని ఏదో మంత్రం జపిస్తూ పార చూసాడు. గులాబిరంగు వెలుతురు గుహను ముంచెత్తివేసింది. అతని మొహం భయంకరాకృతి తాల్చింది. నెత్తురు మయ మయినట్లు కనిపించింది. లోతు ముడుతలు మాత్రం నల్లగా గోచరించాయి. కళ్ళు నిప్పులు గక్కుతున్నాయి. మహా పాపి! గడ్డం నెరిసింది. మొహం ముడతలు పడింది. శరీరం కృశించిపోయింది. కాని పాపాలుచేయడం మాత్రం మాన లేదు. గుహలో తెల్లటి మేఘం విహరించసాగింది. అతని మొహం సంతోషంతో వికసించింది. కానిహఠాత్తుగా నోరు తెరుచుకుని కదలడానికిగూడా గుండెలేక కొయ్యబొమ్మలా నిలబడ్డాడు? తల వెంట్రుకలు నిక్కపొడుచుకున్నాయేం? ఆ మేఘంలో విచిత్రమలోన ముఖాకృతి గోచరించింది. పిలవ కుండా పెట్టకుండా అతనిముందు ప్రత్యక్షమయింది. క్షణ క్షణానికి విస్పష్టంగా దృష్టిని అతనిమీద నిలిపింది. దాని ముఖాకృతి,కనుబొమలు, కళ్ళు, పెదవులు అపరిచితమయినవి. జీవితంలో ఎన్నడూ వాటిని చూసి ఎరగడు. ఆ ఆకృతి

భయంకరంగా ఏమీలేదు. కాని ఎందుకో అతనికి విపరీత మయిన భయం చుట్టుముట్టింది. విచిత్రమయిన ఆ మొహం ఇంకా దృష్టిని అతనిమీదనే నిలకడగా నిలిపింది మేఘం మాయమయింది కాని అపరిచితమయిన ఆ మొహం మరింత స్పష్టంగా కానవచ్చింది. దాని సూదికళ్ళు ఇంకా అతని మీదనే నిలకడగా నిలిచాయి. మాంత్రికుడి మొహంలో నెత్తురుచుక్క లేదు. పిచ్చిగా కెవ్వుమని అరిచి కుండను బోర్లించివేశాడు. అంతా మటుమాయ మయిపోయింది.

# 11

"గుండె నిబ్బరం చేసుకో అమ్మా!" అన్నాడు కాప్టెన్ గొరోబెట్స్ "కలలు నిజంకావు!"

"పండుకో అక్కా!" అంది అతని పడుచుకోడలు. "ఓ ముసలిదాన్ని తీసుకువస్తాను. చాలా తెలివిగలది. దయ్యాలుగియ్యాలూ ఆమెదగ్గర పనిచేయవు. నీకు సాయపడు తుంది."

"మరేం భయపడబోకు!" అన్నాడు అతని కొడుకు కత్తిని తాకుతూ. "నీకెవరూ అపకారం చేయలేరు."

మసగతగా కాటెరీనా వారందరివంకా చూసింది. ఏమి అనాలో తోచలేదు "నా వినాశనం నేనేమీ కొని తెచ్చు కున్నాను. ఆయన్ని నేనే విడిచిపెట్టాను" అనుకుంది.

ఎలాగయితేనేం చివరకు అంది:

"నా మనసేం కుదటపడేట్టులేదు. కీన్‌లో మీదగ్గర పదిరోజులబట్టీ వుంటున్నా, నావిచారంఆవంతయినాతగ్గలేదు. ప్రతీకారం తీర్చుకోవడానికి నాకొడుకును ప్రశాంతంగా పెంచుదామనుకున్నా. నాకలలో మహాభయంకరంగా కని పించాడు. అలాచూసే దురదృష్టం మీకు పట్టుకుండుగాక! నాగుండె యింకా కొట్టుకుంటూనే వుంది. 'నన్ను పెళ్ళిచేసు కోకపోతే నీకొడుకుని నరికేస్తాను' అని అరిచాడు! ఇలా చెప్తూ ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ ఉయ్యాలమీదపడింది. పసిపిల్లవాడు భయపడిపోయి చేతులుచాపి ఏడవ సాగాడు.

ఈ మాటలు వింటూంటే కాప్టెన్ కొడుకుకి రక్తం ఉడికెత్తిపోయింది. కాప్టెన్ గొరోబెట్స్‌కి కూడా పౌరుషం హెచ్చింది.

"ఆ పాషండప్పు వెధవ యిక్కడికి యెలా వస్తాడో చూస్తాగా! యీ ముసిలి కోసక్ చేతిసత్తువ రుచి చూస్తాడు! భగవంతుడికే తెలియాలి" అన్నాడు ఆకాశంకేసి దృష్టి నిగిడ్చి, "దానిలోకి సాయం చేదామని పరుగెత్తుకుంటూ వచ్చాను. కాని భగవంతుడి సంకల్పం వేరేవిధంగా వుంది! నేను వచ్చేసరికే అంతా ముగిసిపోయింది. అయితేనేం అతని శ్రాద్ధపువిందు యెంత యిదిగాచేసాం! మచ్చుకు ఒక్క పోలండువాడినయినా బతకనిచ్చామా! గుండె నిబ్బరం చేసుకోఅమ్మా! నేనూ నా కొడుకూ బతికి వున్నంతవరకూ నీకెవరూ కీడు తలపెట్టలేరు!"

ఇలా చెప్పి ముసలి కాప్టెన్ పిల్లవాని తొట్టెదగ్గరకు వెళ్ళాడు. తోలుపటకాకు వేలాడుతున్న వెండికట్ల పైపు, చెకుముకిరాయి, ఉక్కు ఉన్న తోలుసంచిని చూసి పిల్లవాడు చేతులుజాపి నవ్వాడు. "అచ్చంగా తండ్రివాలకమే!" అన్నాడు కాప్టెన్ పైపు ఊడదీసి ఇస్తూ. "యింకా ముక్కు పచ్చలారలేదు, అపుడే పైపు కావల్సి వచ్చింది!"

కాథెరీనా నిట్టూర్చి ఊయల ఊపసాగింది. ఆ రాత్రి అంతా అక్కడే గడపాలని నిశ్చయించుకున్నారు. తొందర్లోనే అందరికీ నిద్రపట్టింది. కాథెరీనాకికూడ నిద్రవచ్చేసింది.

ఇంట్లో, ఇంటి ఆవరణలో అంతా నిశ్శబ్దం. కాపలా కాస్తున్న కోసక్ లు తప్ప తక్కినవారంతా నిద్రపోతున్నారు. హఠాత్తుగా కాథెరీనా కెవ్వుమంటూ లేచింది. తక్కిన వారంతాకూడా లేచారు. 'చంపేసాడు, బిడ్డని చంపేసాడు!' అని అరుస్తూ ఉయ్యాలదగ్గరకు ఉరికింది. అంతా ఉయ్యాల చుట్టూ చేరారు. ఉయ్యాలలో పిల్లవాడు చచ్చిపడి ఉండడం చూసి భయంతో అందరిగొంతులూ మూగపోయినాయి. ఎవరూ ఆ, ఊ అనికూడా అనలేదు. కనీవినీ ఎరగని ఆహత్యకు విస్తుపోయారు.

# 12

యుక్రెయిన్ కి చాలాదూరాన, పోలండుకు లెస్బర్గ్ పట్టణానికీ అవతల ఎత్తయిన పర్వతశ్రేణులు వ్యాపించి ఉన్నాయి. రాతిగోలుసులా పర్వతం తరవాత పర్వతం భూభాగమంతటిమీదా కుడికి, ఎడమకు విస్తరించుకుంది. అల్లకల్లోలంతో ప్రతిధ్వనించే సముద్రానికి రాతిగుట్టలతో సేతువు కట్టినట్టుగా ఉంది. రాతిగోలుసులు వాలేచీయా, ట్రాన్సిల్వేనియాలగుండా చొచ్చుకుపోయి గాలీషియా, హంగరీలమధ్య పెద్ద గుర్రపు నాళంలాగా మహోన్నతంగా ఉన్నాయి. అటువంటి పర్వతాలు మన ప్రాంతాలలో లేనే లేవు. ఎంతచూసినా తనివి తీరదు. కళ్ళు నెప్పులు పుడతాయి, వాటిల్లో కొన్నిటి శిఖరాలు మానవ పాదాన్నే ఎరగవు! దృశ్యం వింతగా ఉంటుంది. సముద్రుడు కోపగించి ఏ తుపానులోనో తీరాలను వదిలిపెట్టి బ్రహ్మాండమయిన కెరటాలను దూరాసకి గిరాటువేస్తే అవి రాళ్ళూ రప్పలుగా మారి కదలకుండా గాలిలో అలానే ఉండిపోయాయో లేక నిండు తుపాను మబ్బులు అంతరిక్షంనుంచి కిందపడి భూమికి అంటుకుపోయాయా అనిపిస్తుంది. ఆ పర్వతాల రంగూ బూడిద రంగే! వాటిశిఖరాలు సూర్యకాంతిలో ధగధగా మెరిసిపోతుంటాయి.

కాల్ప్రేథియా పర్వతాలవరకు రష్యన్ భాష వినిపిస్తుంది. వాటి అవతల కొద్ది మేరవరకూకూడా అక్కడక్కడ మన మాతృభాష ప్రతిధ్వనిస్తూంటుంది. ఇంకా అవతల ప్రజల భాషా వేరు, మతమూ వేరు. అక్కడ అసంఖ్యాకంగా హంగేరియనులు నివసిస్తుంటారు వారూ కోసక్ లలాగానే గుర్రాలమీద తిరుగుతారు, యుద్ధాలుచేస్తారు, తాగి తందనా లాడతారు. గుర్రాలఅలంకారాలకు, అంగరక్షాలకు వెచ్చించ డానికి ఎంతడబ్బయినా వెనుదీయరు. పర్వతాల మధ్య పెద్ద పెద్ద సరోవరాలున్నాయి. అవి గాజుపలకలలాగా నిర్మ లంగా ఉంటూ అద్దాలలా పర్వత శిఖరాలను ప్రతిఫలింప జేస్తూంటాయి.

నక్షత్రాలు ప్రకాశిస్తున్నా ప్రకాశించకపోయినా రాత్రిళ్ళు నల్లటి భారీగుర్రంమీద స్వారీచేస్తూ తిరిగే ఆ వ్యక్తి ఎవరు? ఎవరా మహావీరుడు? ఆ అతిమానుష విగ్రహం గుర్రంమీద పర్వతాలకిందుగా, సరోవరాలమీదుగా స్వారీ చేస్తూ వెళుతుంటే బ్రహ్మాండమయిన గుర్రంతోసహా నిశ్చల మయిన నీళ్ళల్లో ప్రతిబింబించింది. బ్రహ్మాండమయిన ఘోరా కృతికీనీడలు పర్వతాలమీద ప్రసరించాయి. కవచం ధగధగా మెరిసిపోతోంది. బుజంమీద బల్లెం ప్రకాశిస్తోంది. జీనుకు కత్తి టకటకా కొట్టుకుంటోంది. శిరస్త్రాణం ముందుకు ఒరిగి ఉంది. నల్లటి మీసాలు! కళ్ళు ముడతలుపడి ఉన్నాయి. కనురెప్ప వెంట్రుకలు వాలిపోయాయి. నిద్రపోతూ మగతగా కళ్ళాలు పట్టుకున్నాడు. ఆ గుర్రంమీదనే ఒక బంట్రోతు కుర్రవాడుకూడా స్వారీ చేస్తున్నాడు. అతనూ నిద్రపోతూ

మగతగా ఆ వీరునికి అంటిపెట్టుకుని ఉన్నాడు. ఎవరీతడు! ఎక్కడకు వెళుతున్నాడు? ఎందుకు వెళుతున్నాడు? ఎవరికి తెలుసు? పర్వతాలమీదుగా రోజుకు పైగా ప్రయాణం చేసాడు. తెల్లవారింది. సూర్యోదయమయింది. అతని జాడ కానరాలేదు. ఆకాశం వెలిగొందిపోతోంది. ఎక్కడా మబ్బు తునకంటూ లేదు. మధ్య మధ్య పర్వతాలమీద పొడుగాటి కీనీడ కదలాడుతూండడం కొండ జాతులవారికి గోచర మయింది. కాని చీకటి పడీపడగానే ఆ వీరుడు తిరిగి ప్రత్యక్ష మయేవాడు. సరోవరంలో అతని ప్రతిబింబం పొడగట్టేది. నీడ వెంటాడేది. చాలా చాలా పర్వతాలు దాటి ఆ వీరుడు క్రివాన్ చేరుకున్నాడు. కార్పేథియన్ పర్వతాలలో కల్లా అది ఉన్నతమయింది. మహారాజ కీవితో వెలుగొందు తూంటుంది. అక్కడగుర్రం, రౌతుఆగి ఇంకా మొద్దునిద్రలో మునిగిపోయారు. కిందుగా విహరిస్తున్న మేఘాలు వారిని మరుగుపర్చాయి.

# 13

"యిస్, అలా బిగ్గరగా తడతావేం?" అంది కాటె రీనా దాదితో. "నా పిల్లాడు నిద్రపోతున్నాడు. యిందాకటి నించీ ఒకటే యేడుపు. యిపుడే నిద్రపట్టింది. నేను అడివిలోకి వెళ్ళిపోతాను. నాకేసి అలా చూస్తున్నావేం? అబ్బ! నిను

చూస్తే భయంవేస్తోంది. నీచూపు సూదుల్లా గుచ్చుకుం టోంది. అబ్బ! యేవిఁటా చూపు? నిప్పులు కక్కుతున్నట్లు న్నాయ్! నువ్వు నిజంగా మంత్రగత్తెవే? ఊఁ—మంత్రగత్తె వయితే పో, వెళ్ళిపో! నా కొడుకుని నువ్వు యెత్తుకుపోతావ్! కాప్టెన్ యెంత పిచ్చివాడు! కీవ్‌లో వ్రుండడం నాకు సరదా అనుకుంటున్నాడు పాపం! ఊహుఁ — నా మొగుడు, కొడుకు యిక్కడే వ్రున్నారు యిక యింటిసంగతి యెవరు పట్టించు కుంటారు? యెంతమెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళా ననుకున్నావ్? చిటిక్కుమనలేదు! మళ్ళీ పడుచుదానివి కావాలనివుందా? మరేం కష్టంగాదు. యేంలేదు, నాట్యం చేస్తేచాలు. చూడు, నేనెలా నాట్యం చేస్తానో!"

ఇలా పిచ్చిగా మాట్లాడి పిచ్చిగా గుడ్లు తిప్పుకుంటూ నడుంమీద చేతులు పెట్టుకుని నాట్యంచేయ నారంభించింది. పెద్దగా అరుస్తూ పాదాలతో నేలను తట్టింది. తెల్లటి మడ మలు చిందులుతొక్కాయి. కాని లయతప్పింది. నల్లటి జుట్టు తెల్లటి మెడమీద అల్లలలాడసాగింది. చేతులూ తలా ఆడిస్తూ క్షణమైనా ఆగకుండా పిట్టలాగా గిర్రున తిరిగింది. కాళ్ళువిరిగి కిందపడిపోతుందో లేకపోతే పరలోకానికే ఎగిరి పోతుందో అని అనిపించింది.

ముసిలిదాది విచారంగా నిలుచుంది. ముడతలు పడ్డ మొహం కన్నీటితో తడిసిపోయింది. యజమానురాలిని చూసినకొద్దీ కోసక్‌లకు హృదయభారం హెచ్చింది. ఇలా నాట్యం చేసీచేసీ కాటెరీనా అలిసిపోయి గిర్రున తిరుగుతూ నాట్యం చేస్తున్నానని అనుకుంటూ ఒకచోటనే మెల్లగా

పాదాలతో నేలను తట్టసాగింది. "నాదగ్గిర కంఠహారం వుంది" అంది ఆగి. "మీదగ్గరలేదు. నాభర్త యేడీ?" అంటూ మళ్ళీ హఠాత్తుగా అరిచింది. నడుం పటకానుంచి కత్తి ఒకటి తీస్తూ. "ఓ - నాకు కావలసిన కత్తి యిదికాదు." ఇలాఅని కన్నీళ్లు పెట్టుకుంది. "మానాన్న గుండె చాలాలోతున వుంది. యీకత్తి అంతలోతుకు దిగదు. ఆయన గుండె యినుముతో పోతపోసారు మంత్రగత్తె యెవతో నరకాగ్నిగుండంలో పోత పోసివుంటుంది. మానాన్న రాడేం? తనకు అంత్యకాలం సమీపించింది తెలియదా యేం? ఓహో! నేనే ఆయనదగ్గిరికి స్వయంగా వెళ్ళాలని ఆయన కోరిక కావచ్చు! అయితే-" అంతటితో ఆపి వికటంగా నవ్వింది. "ఒక తమాషా కథ జ్ఞాపకం వచ్చింది. అవును బతికివుండగానే సమాధి చేసారు. నాకు నవ్వు వచ్చింది. వినండి, వినండి!" కాని మాటాడ డానికి బదులు పాడసాగింది.

పాట

నెత్తురు చారిక లోడేబండి
ఉరకలు పెడుతోంది
బండిమీద ఒక కోసక్ సింగం
కాయం పడి వుంది.

ఆతని రొమ్మును దూసుకుపోయెను
చిచ్చులు మిసితూటా
గుండెలోతులను కొలిచి దీసినది
పచ్చలతని ఈటా.

కోసక్ సింగం కుడిపిడికిటిలో
తళతళమను బల్లెం
పచ్చినెత్తురులు వారపోసి తడి
యారని దాబల్లెం.

ఏటివొడ్డునొక ఏపచెట్టుపై
బొందకాకి కేక
కడుపున చిచ్చురగిల్చిన కోసక్
కన్నకడుపు శోకం.

ఎందుకు నీకీ కాకి శోకము
ఏడుపేల తల్లీ!
నీ కుమారుడొక దేవకన్యకను
ఆడినాడు పెళ్ళి!

పొలాల కావల మట్టిదిబ్బ నీ
కొడుకు అంతిపురము
తలుపు కిటికీల్ లేనిమేడలో
చేయును కాపురము!

పీతాచేపా చేతులు కలిపీ
నాట్యం చేశాయి
నా కథకూడ ఇంతటితోనే
ఐపోయిందోయి!

ఈ విధంగా అనేక పాటలు కలగాపులగంజేసి పాడ జొచ్చింది. అప్పటికీ రెండురోజులుగా స్వంత ఇంట్లో ఉంటోంది. కీవ్ పట్టణం పేరే వినిపించుకోవడంలేదు.

ప్రార్థనలు చేయడంలేదు. ఎవరితోను మాట్లాడంలేదు. పొద్దస్తమానం సిందూరపుచెట్లు మధ్య ఊరికే తిరుగుతోంది. ముండ్ల రెమ్మలు ఆమె మొహానికి, బుజాలకు తగిలి గీసుకుపోతున్నాయి. గాలికి విరబోసుకున్న జుట్టు ఆడిపోతోంది. రాలిన ఆకులు ఆమె పాదాలకింద గల గలలాడుతున్నాయి. కాని ఆమె వీటిని వేటినీ లెక్క-చేయడం లేదు. సూర్యాస్తమానం అయి నక్షత్రాలు చంద్రుడు ఉదయించకపూర్వం అడవిలో తిరగడానికి భయం వేస్తుంది. అటువంటప్పుడు జ్ఞానస్నానం కాకుండా చనిపోయిన పసిపాపలు చెట్లమీదకు ఎగబాకి కొమ్మలు పట్టుకుని వేలాడుతారు నవ్వుతూ ఏడుస్తూ రోడ్లమీద, దురదగొండి గుబురుల మధ్యపడి దొర్లుతుంటారు. ఆత్మలను కోల్పోయిన కన్యలు ఒక్కొ-క్క-రూ నీపర్ నదీ గర్భంలోనుంచి పైకి లేస్తారు. ఆకుపచ్చనిజుట్టు బుజాలమీదుగా జారుతోంటుంది. వారిపొడుగాటి జుట్టునుంచి నీళ్ళు బొట్టు బొట్టుగా కారుతూ నేలమీదపడి టప్ టప్ మంటుంటాయి. స్ఫటికపు ముసుగులోనుంచిలాగా ఒక కన్య మెరిసిపోతూంటుంది. ఆమె పెదవులమీద రహస్య మందహాసం నెలకొని ఉంటుంది. చెంపలు తళుక్కు-మంటూంటాయి. కళ్లు ఆత్మమీద మచ్చుమందు చల్లుతాయి. ప్రేమతో దహించుకు పోతున్నట్లుంటుంది. ఉక్కి-రి బిక్కి-రి అయేటట్టు ముద్దుపెట్టుకోదలచి నట్టుంటుంది. పో, పారిపో. క్రైస్తవుడా! పారిపో! ఆమె పెదవులు జివ్వుమంటాయి. ఆమె శయ్య-చన్నీళ్లు, ప్రాణం పోయేవరకు నీకు గిలిగింతలు పెడుతుంది. నదీగర్భంలోకి ఈడ్చుకు పోతుంది.

ఒకరోజు ఉదయాన్నే ఒక ఆగంతకుడు, చూడ చక్కనివాడు, ఎర్రటికోటు తొడుగుకుని వారి ఇంటికివచ్చి డానిలో ఉన్నాడా అని అడిగాడు. జరిగిన కథంతా విని కన్నీళ్ళు పెట్టుకున్నాడు. కోటుచేతితో కన్నీళ్లు తుడుచుకుని బుజాలు ఎగరవేశాడు. తానూ డానిల్ ఒకరి ప్రక్కన ఒకరు నిలబడి పోరాడామనీ టర్కీవాళ్ళతో, క్రిమియా వాళ్ళతో యుద్ధాలు చేశామనీ చెప్పాడు. డానిలో ఆవిధంగా అంతమయి పోతాడని ఎన్నడూ ఊహించనయినా లేదని వాపోయాడు. ఇంకా అనేక విషయాలుచెప్పి కాటెరీనాను చూడాలనే కోరిక వెల్లడించాడు.

మొదటలో ఆ ఆగంతుడు చెప్పిన మాటలను కాటె రీనా చెవిని పెట్టలేదు. కాని ఆ తరవాత తరవాత అతను చెప్పేది అర్థం చేసుకుంటున్న దానిలా వినసాగింది. తానూ డానిలో సోదరులలాగా జీవించామనీ క్రిమియావారి బారి నుంచి తప్పించుకోవడానికి ఒక ఆనకట్టకింద దాక్కున్నా మనీ చెప్పాడు కాటెరీనా వింటూ అతనిమీద నిలకడగా దృష్టి నిలిపింది.

"కోలుకుంటుంది" అనుకున్నారు కోసక్ లు ఆమె కేసి చూసి. "ఆగంతుకుడు నయం చేస్తాడు. అర్థం అవుతున్న దాని లాగా వింటోంది."

ఈ లోపున ఆ ఆగంతకుడు డానిలో ఒకమాటు రహస్యంగా తనతో, 'యిదిగో గ్నాపకం వుంచుకో. కొ్రప్యాన్! భగవంతుడి ఆజ్ఞఅయి నేనీలోకాన్నుంచి వెళ్ళిపోతే కాటెరీ నాను నువ్వు పెళ్ళి చేసుకో!' అని చెప్పినట్లు చెప్పాడు.

కాటెరీనా అతనికేసి వాడిచూపులు బరపింది. "ఆఁ—" అని అరిచింది. "వీడే, వీడే నాతండ్రి!" ఇలా అరుస్తూ కత్తి పుచ్చుకుని అతనిమీదికి దూకింది.

ఆమె చేతిలోంచి కత్తిని లాక్కోవాలని అతను చాలా సేపు పెనుగులాడాడు. ఎలాగయితేనేం చివరికి లాక్కొని పైకి ఎత్తాడు - ఘోరం జరిగిపోయింది! తండ్రి కూతురిని హత్య చేశాడు.

కోసక్కులు దిగ్భ్రమచెంది అతనిమీదికి ఉరికారు. కాని అప్పటికే మాంత్రికుడు గుర్రంమీదకు దూకి ఉడాయించాడు.

# 14

కనీవినీ ఎరగని అద్భుతం ఒకటి కీవ్ అవతల జరిగింది. ఆ అద్భుతం తిలకించడానికి ప్రభువులు, సేనాధిపతులు సమావేశమయ్యారు. అన్నివైపులనుంచీ దూరస్థ ప్రదేశాలు కనిపించాయి. దూరాన ముదురు నీలిరంగు నీపర్ నదీ ముఖద్వారం, దాని అవతల నల్లసముద్రం గోచరించాయి. ఎక్కువగా అక్కడికీ ఇక్కడికీ ప్రయాణాలు చేసిన జనులు సముద్రంలో నుంచి పైకి పర్వతాకారంగా లేచిన క్రిమియాను, చిత్తడి సివాష్‌ను గుర్తించారు. కుడివైపున గాలీషియా!

"మరి అవేవిఁటి?" అని జనం వృద్ధులను అడిగారు. దూరాన ఆకాశంలో ఎంతో ఎత్తున మేఘాలలాగా గోచరించే తెల్లని బూడిదరంగు శిఖరాలను చూపిస్తూ.

"అవి కార్పేథియా పర్వతాలు!" అన్నాడు వృద్ధుడు. "ఆ శిఖరాలలో కొన్ని యెల్లకాలము మంచుతో కప్పబడి వుంటాయి. మేఘాలు వాటికి అంటిపెట్టుకుని రాత్రిళ్లు కాలం గడుపుతాయి."

ఇంతలో ఇంకో అద్భుతం జరిగింది. అన్నిటికంటె ఎత్తయిన శిఖరంనుంచి మేఘాలు మాయమయ్యాయి. దాని నడినెత్తిమీద ఒక కొత్త ప్రత్యక్షమయ్యాడు. వీరుడిలాఉంది వేషం. కనులు మూసుకుపోయి ఉన్నాయి. వారికి చాలా దగ్గరగా నిలబడి ఉన్నప్పటిలాగా స్పష్టంగా కనిపించాడు.

ఈ వింతచూసి ఆశ్చర్యపోతూ, భయపడుతూ ఉన్న జనంలోనుంచి ఒకతను చర్రున గుర్రంమీదికి దూకి, వెనకనుంచి ఎవరయినా తరుముకు వస్తున్నారేమోనని పిచ్చి చూపులుచూస్తూ గుర్రాన్ని దౌడు తీయించాడు. అతను ఎవరోకాదు. మాంత్రికుడు! ఎందుకు అంత భయపడి పోయాడు? ఆ అద్భుత వీరునికేసి బిత్తరిచూపు చూసాడు. మంత్రం ఉచ్చాటన చేస్తుంటే కనిపించిన మొహం ఆ వీరుని మొహమేనని గుర్తించాడు. ఆదృశ్యం చూసేసరికి ఆత్మ ఎందుకు కంపించిపోయిందో తెలియదు. భయంతో చుట్టూ చూసి చీకటిపడి నక్షత్రాలు కనిపించేవరకు ఒకటే దౌడు తీసాడు. అపుడు ఇంటివైపుకు మళ్ళాడు. బహుశా ఈ అద్భుతానికి అర్థమేమిటని సైతానును అడగడానికేమో! దోవలో ఒక కాలవ అడ్డం వచ్చింది. గుర్రాన్ని కాలవమీదుగా దూకించ బోతూండగా, గుర్రం టకీమని ఆగిపోయింది. చిత్రం! నవ్వింది. చీకటిలో తెల్లటి రెండు పళ్ళవరసలు

భయంకరంగా గోచరించాయి మాంత్రికుడి జుట్టు నిక్క-పొడుచుకుంది. పిచ్చిగా అరిచాడు, ఏడ్చాడు. గుర్రాన్ని తిన్నగా కీల్ వైపుకు పోనిచ్చాడు. నలువైపులనుంచీ ఎవరో తరుముకు వస్తున్నట్లు అనిపించింది. కీకారణ్యంలోని చెట్లు అతని మెడ నులిమివేయాలని నల్లటిగడ్డాలు ఆడిస్తూ, పొడుగాటి కొమ్మలు జాపుతూన్నట్లున్నాయి. నక్షత్రాలు అతని కంటిముందు దొడుతీస్తూ ఈ పాపాత్ముణ్ణి వేలుతో చూపెడుతున్నట్టున్నాయి. రోడ్డుకూడా వెనకాలే పరుగెత్తుకుంటూ వస్తున్నట్టనిపించింది.

నిరాశ చేసుకుని మాంత్రికుడు కీవ్‌లోని పవిత్ర స్థలాలకు పరుగెత్తాడు.

# 15

ఒకగుహ. ఆ గుహాలో చిన్నదీపం. దీపంముందు కూర్చుని ఒకమహర్షి తదేక దృష్టితో పవిత్రగ్రంథం చదువుతున్నాడు. ఆ గుహాలోనుంచి ఆ మహర్షి బయటికి వెళ్ళి ఎన్ని సంవత్సరాలయిందో! చెక్కలతో శవపేటికలాంటిది చేయించుకుని అందులోనే పండుకుని నిద్రపోయేవాడు. ఆ మహర్షి పుస్తకం మూసివేసి ప్రార్థన చేయసాగాడు. ఇంతలో హఠాత్తుగా విచిత్రమయిన, భయంకరమయిన మనిషి ఒకడు పరుగెత్తుకుంటూ లోపలకు వచ్చాడు. మహర్షి దిగ్భ్రమచెందింది

ఒకఅడుగు వెనకకు వేసాడు. ఆ మనిషి సరుగుడు ఆకులాగా నిలువెల్లా వణికిపోతున్నాడు. దృష్టి పిచ్చిగా చంచలించి పోతోంది. కళ్ళల్లో భయం గోచరిస్తోంది. మొహం మహా భయాకరంగా ఉండి వణుకు పుట్టిస్తోంది.

"బాబూ! ప్రార్థించు, నాకోసం ప్రార్థించు!" అని నిరాశతో అరిచాడు ఆ మనిషి. "నాపాపం పండింది. పాప పరిహారార్థం ప్రార్థించు!" ఇలాచెప్పి నేలమీద కూలబడ్డాడు.

ఆ మహాత్మి శిలువగుర్తు కేసి, తిరిగి పవిత్ర గ్రంథం తీసుకుని, తెరిచి, భయంతో వెనకడుగు వేసాడు. చేతిలోనుంచి గ్రంథంజారి కిందపడింది.

"ఊహుం - మహాపాపీ! నిన్ను దయజూడకూడదు. పో, నేను ప్రార్థన చేయను. పో!"

"చేయరూ?" అని మాంత్రికుడు పిచ్చిగా అరిచాడు.

"చూడు. పవిత్రగ్రంథంలో అక్షరాలు రక్తంతో తడిసాయి! నీఅంతటి పాపాత్ముడు ప్రపంచంలో యింతవరకు పుట్టలేదు!"

"మీరు నన్ను పరిహసిస్తున్నారా?"

"ఊహుం - మహాపాపీ! నేనేమీ నిన్ను పరిహసించడం లేదు. భయం నన్ను ముంచెత్తివేసింది. అసలు నీ పక్కన నుంచోవడమే మంచిదికాదు!"

"ఊహుం - పరిహసిస్తున్నారు! మీ పెదవులు చిరునవ్వు నవ్వుతున్నాయి. పళ్ళవరసలు తెల్లగా మెరిసిపోతున్నాయి!"

ఇలాఅని దయ్యంపట్టిన వాడిలాగా ఆ మహర్షి మీదకు దూకి చంపివేసాడు.

విపరీతమయిన మూలుగు వినిపించి అడవులలో, పొలాలలో ప్రతిధ్వనించింది. క్షీణించిపోయిన చేతులూ, పొడుగాటి గోళ్ళు అడవి అవతల పైకిలేచి, వణికిపోయి మళ్ళీ మాయమయాయి.

ఆ మాంత్రికుడికి ఒక్క భయమే కాదు ఏ అనుభూతీ లేకుండాపోయింది. అంతా గందరగోళంగా ఉంది. చెవులలో రణగొణ ధ్వని, తలలో రణగొణధ్వని. తాగినవాడి చందంగా ఉంది. కళ్ళముందు సాలెగూడు ఆవరించినట్టు సమస్తమూ మసకమసకగా కనిపిస్తోంది. గుర్రంమీదకు దూకి చెర్కాసీ జిల్లాగుండా సరాసరి వెళ్ళి క్రిమియా తాతార్లకు కలుసుకోవాలనే ఉద్దేశంతో సూటిగా కాసీవ్‌కు బయలుదేరాడు. ఎందుకు బయలుదేరాడో అతనికే తెలియదు. రెండురోజులపాటు ప్రయాణం చేసాడుగాని కాసీవ్ కనుచూపు మేరలోకూడా కనిపించలేదు. దోవ సరయిందే. ఎప్పుడో కాసీవ్ చేరుకోవలసింది. కాని కాసీవ్‌జాడే కనిపించలేదు. దూరాన చర్చి శిఖరాలు మెరిసిపోతున్నాయి. కాని అది కాసీవ్ కాదు. షమ్స్క తప్పుతోవన ప్రయాణం చేసినందుకు మాంత్రికుడు ఆశ్చర్యపోయాడు. వెనకకు తిరిగి కీవ్ వైపు బయలుదేరాడు. ఒక రోజల్లా ప్రయాణం చేసిన తరవాత ఒకపట్టణం పొడగట్టింది. అది కీవ్ కాదు గాలిచ్ కీవ్‌నుంచి షమ్స్కకంటె అదిదూరం హాంగరీకి దగ్గర. ఏంచేయడానికీ తోచక మళ్ళీ వెనుదిరిగి వెళుతూంటే ముందుకు బదులు వెనకకు వెళుతున్నట్టు అతనికి అని

పించింది. మాంత్రికుడి మనస్సులో ఏమున్నదీ ఎవరికీ తెలియదు. తెలిస్తే మాత్రం వారికి రాత్రిళ్ళు నిద్రపట్టదు. జీవితంలో ఇక చిరునవ్వు నవ్వరు. అతని మనసులో ఉన్నది ద్వేషం కాదు, భయం కాదు, పిచ్చికోపం కాదు. దానిని తెలియజేసేమాటే ఏ భాషలోనూ లేదు. అతని మనసు మండిపోతోంది, ఉడికిపోతోంది ప్రపంచాన్నంతటినీ కాలికింద నలిపి వేయాలని అతనికి ఉంది. కీవ్ దగ్గరనుంచి గాలిచ్ వరకు మనుష్యులతో, వస్తు సముదాయంతో పెళ్ళగించి నల్ల సముద్రంలో ముంచేయాలని ఉంది. కాని అలా చేయదలచింది ద్వేషం వల్ల కాదు. అలా చేయాలని ఎందుకు బుద్ధిపుట్టిందో అతనికే తెలియదు. కార్పేథియన్ పర్వతాలు, బూడిదరంగు మేఘాలు కప్పిన క్రివాన్ శిఖరం కంటపడేసరికి అతనికి కంపరం పుట్టింది. గుర్రం పర్వతాలగుండా దౌడుతీస్తోంది. హఠాత్తుగా మబ్బులు తొలగిపోయాయి. ఆరౌతు బ్రహ్మాండమైన ఆకారంతో ప్రత్యక్షమయాడు. మాంత్రికుడు ఆగాలని యత్నించాడు. కళ్ళాలు గుంజాడు. కాని గుర్రం పిచ్చిగా సకిలించి జూలు ఆడించి ఆరౌతువైపుకు దూకింది. మాంత్రికుడికి లోపల అంతా గడ్డకట్టుకు పోతున్నట్లు అనిపించింది. నిశ్చలంగా నిలబడ్డ ఆరౌతు కదిలి హఠాత్తుగా కళ్ళు తెరిచాడు. కళ్ళు తెరిచేసరికి మాంత్రికుడు తనమీదకు దూకపోవడం కనిపించింది. పక్కున నవ్వాడు. ఆ పిచ్చినవ్వు ఉరుములాగా పర్వతాలలో ప్రతిధ్వనించి మాంత్రికుడి హృదయంలో మారుమోగి, మనిషిని ఊపేసింది. మహాశక్తిమంతుడెవడో తనను ఆవరించి కూడా కదులుతూ గుండెకాయమీద, తల

మీద సుత్తితో కొట్టుతున్నట్లు తోచింది. ఆనవ్వు అంత భయంకరంగా అతనిలో ప్రతిధ్వనించింది.

ఆరౌతు మహాభయంకరమయిన చేతినిజాపి, మాంత్రికుడిని ఒడిసి పట్టిపైకిఎత్తాడు. తక్షణమే మాంత్రికుడు మరణించాడు. మరణించిన తరువాత కనులుతెరిచాడు. కాని మరణించినా జీవంలేనికళ్ళతో చూడ సాగాడు. బ్రతికిఉన్న వాళ్ళుగాని, చచ్చి సమాధులలోనుంచి లేచే ప్రేతాలుగాని అంత భయంకరంగా చూడరు. జీవం లేని కళ్ళను అటూఇటూ కదిలించాడు. కదిలించేసరికి కీవ్‌లోనుంచి, గాలీషియాలోనుంచి, కార్పేథియా పర్వతాలలోనుంచి అచ్చంగా అతనినిబోలిన ప్రేతాలు పైకి లేవడం కనిపించింది.

బాగా పాలిపోయి ఒకరికంటె ఒకరు ఒడ్డూ పొడుగుగాఉన్న ఆప్రేతాలు ఆరౌతుచుట్టూ గుమిగూడాయి. ఆరౌతు మళ్ళీ ఇంకోమారు నవ్వి మాంత్రికుడిని అగాధంలోకి విసిరివేసాడు. ఆ ప్రేతాలన్నీ అగాధంలోకి దూకి మాంత్రికుడి శవాన్ని పీక్కుతిన నారంభించాయి. ఇంకో ప్రేతం, అన్నిటికంటె పొడుగు భయంకరమయింది నేలమీద నుంచి లేవాలని యత్నించిందిగాని విపరీతంగా పెరిగి పోవడంవల్ల లేవలేక పోయింది. అయితే భూమిలోనుంచే గనక లేవగలిగితే మాత్రం కార్పేథియా, ట్రాన్సిల్వేనియా, టర్కీలను తలకిందులు చేసేదే! కొద్దిగా కదిలేసరికి భూమి కంపించి పోయింది. చాలా ఇళ్ళు కూలిపోయాయి. చాలామంది మనుషులు వాటికిందపడి అణగారి పోయారు.

వేయి యంత్రాలు చక్రాలతో నీటిని చిలకరిస్తున్నట్టు తరుచు కార్పేథియాలో వినిపించేది ఇంతవరకు మానవుడి కంటపడని అగాధంలో శవాన్ని ప్రేతాలు పీక్కుతింటున్న శబ్దం అది. ఆ అగాధం పక్కగా నడవడానికి కూడా ఎవరికీ ధైర్యం చాలేదికాదు. తరుచు భూమి ఆమూలనుంచి ఈ మూలకు కంపించి పోతుంటుంది. దానికి కారణం సముద్రం దగ్గరగా ఒక పర్వతం ఉందనీ, దానినుంచి మంటలు, ఉష్ణ ప్రవాహము వెలువడటమేననీ పండితులు చెపుతూంటారు. కాని హంగరీ, గాలీషియాలలో నివసించే వృద్ధులు మాత్రం విపరీతంగా పెరిగిపోయిన ఆ ప్రేతం లేవడానికి యత్నించడం మూలంగా భూమి కంపిస్తోందని చెప్తూంటారు.

# 16

గ్లుఖోవ్ పట్టణంలో ఒక అంధవీధిగాయకునిచుట్టూ జనంచేరి గంటసేపటినుంచీ పాట వింటున్నారు. ఏ వీధిగాయకుడూ అంతచక్కగా, అంత అద్భుతమయిన పాటలు పాడిన వాడు లేడు. పూర్వకాలంలో సేనాధిపతుల పరిపాలననుగురించీ, సగాయిడచ్నీ, ఖ్మెల్నిట్స్కీలనుగురించీ పాడాడు. ఆ రోజులే వేరు. అవి కోసక్కుల కీర్తి పరకాష్ఠనందుకున్న రోజులు. వారు శత్రువులను కాలికింద నలిపివేసారు. వారిని పరిహసించడానికి ఎవరికీ దమ్ములుండేవికావు. ఆ వృద్ధుడు మంచి హుషారయిన

పాటలుపాడి జనంవంక చూపుడున్న వాడిలా చూసాడు. వేళ్లు తీగలమీద ఈగలలా నృత్యం చేసాయి. అసలు తీగలే పాటం తట అవే పాడుతున్నట్లనిపించింది. ఆ జనంలోని వృద్ధులు కిందకు చూడసాగారు. యువకులు గాయకునివంక తేరిపార చూడసాగారు. కాని ఒకరికీ గుసగుసలు పోయే ధైర్యం లేక పోయింది.

“యిక వుండండి. చాలాకాలంకిందట జరిగిన ఒక విషయం వినిపిస్తాను. వినండి!” అన్నాడు ఆ వృద్ధగాయకుడు. జనం ఇంకా దగ్గిరసా జరిగారు. అతను పాడనారంభించాడు :

“ట్రాన్సిల్వేనియా, పోలండు దేశాలను స్టెపాన్ రాజు పరిపాలించిన రోజుల్లో ఇవాన్, పెట్రో అనే యిద్దరు కోసక్ లు వుండేవారు. యిద్దరూ అన్నదమ్ముల లాగా జీవించారు. ‘యివాన్! చూడు’ అన్నాడు పెట్రో, ‘మనయిద్దర్లో యెవరు యెంత సంపాదించినా యిద్దరం సమంగా పంచుకుందాం. ఒకడు హుషారుగావుంటే రెండోవాడూ హుషారుగావుండాలి ఒకడు విచారంలో మునిగితే రెండోవాడూ విచారంలోమున గాలి. యుద్ధంలో యెవరు యెంతధనం కొల్లగొట్టినా యిద్దరం సమంగా పంచుకోవాలి. యుద్ధంలో ఒకడు ఖైదీగా చిక్కితే రెండోవాడు వున్నదంతా ధారవోసి అతనిని విడిపించాలి. లేదా తనూ ఖైదీగా చిక్కాలి.’ దీనికి యిద్దరూ సరే అంటే సరే అనుకున్నారు. నిజంగా సంపాదించినదంతా ఇద్దరూ సమంగా పంచుకున్నారు. పశువుల మందలనుగాని గుర్రాల మందలనుగాని పట్టుకుంటే సమంగా పంచుకునేవారు.

స్టెపాన్ రాజు టర్కీమీద యుద్ధం మొదలు పెట్టాడు. మూడు వారాలు పోరాడినా వాళ్ళను తరిమి వేయలేక పోయాడు. టర్కీపాషా కొద్దిమంది అంగరక్షకులసాయంతో ఒక పటాలం పటాలాన్ని నరికివేయగల సమర్థుడు. అందుకని స్టెపాన్ రాజు యెవరయినా ధైర్యశాలి పాషాను ప్రాణంతో గాని శవాన్నిగాని పట్టుకువస్తే అతనికి సైన్యానికి అంతటికీ యిచ్చేజీతం బహుమానంగా ఇస్తానని ప్రకటించాడు.

"మనం వెళ్ళి పాషాను పట్టుకుందాం" అన్నాడు ఇవాన్ పెట్రోతో. దానిమీద ఆ కోసక్‌లు ఇద్దరూ చెరో దోవనా బయలు దేరారు.

"పాషాను పట్టుకోవడంలో పెట్రో విజయం పొందే వాడో లేడో చెప్పలేంగాని ఇవాన్ పాషా మెడకు పాశం తగిలించి స్టెపాన్ రాజుముందుకు తీసుకు చక్కావచ్చాడు. 'బలే, ధైర్యశాలివి!' అని స్టెపాన్ రాజు ఇవాన్‌ని ప్రశం సించి సైన్యానికంతకీ ఇచ్చేజీతం, యెక్కడకోరితే అక్కడ భూమి, ఎన్ని కావాలనికోరితే అన్ని పశువులు ఇమ్మని ఆజ్ఞా పించాడు. ఈ బహుమానాలు ముట్టగానే ఇవాన్ పెట్రోకి సగం పంచి ఇచ్చాడు. రాజు ఇచ్చిన ధనంలో సగం ముట్టినా పెట్రోకి ఇవాన్ రాజగౌరవంపొందడం సరిపడలేదు. పగ తీర్చుకోవాలనే భావం మనసు మారుమూలలలో పొటమ రించింది.

"ఇవాన్‌కు రాజుదానంచేసిన భూమిని చేరుకోవడా నికి ఆకోసక్‌లు ఇద్దరూ బయలుదేరారు. ఆ భూమి కొార్పేథియా అవతలవుంది ఇవాన్ గుర్రంమీద కొడుకుని కూడా కూర్చోబెట్టుకుని కట్టి వేసుకున్నాడు. చీకటి పడింది. ఇంకా ప్రయాణం సాగిస్తూనే వున్నారు. పిల్లవాడు నిద్రపోయాడు. ఇవాన్‌కూడా కునుకుపాట్లు పడసాగాడు. నిద్రించకు కోసక్ ! కొండదారులు ప్రమాద భరితాలయినవి! కాని ఆకోసక్ గుర్రానికి దోవబాగా తెలుసు. కాలు జారదు. పర్వతాల మధ్య పెద్ద అగాధం ఒకటి వుంది. దాని అడుగును చూసిన మానవుడంటూలేడు. ఆకాశం యెంతయెత్తో అది అంత లోతు. రోడ్డు ఆ అగాధంపైగా వెళుతుంది. ఒకరి పక్కన ఒకరు చొప్పున ఇద్దరు మాత్రమే వెళ్ళడానికి వీలవుతుంది. ముగ్గురికి ఇరుకు. ఇవాన్‌కి కునుకుపట్టింది. అతని గుర్రం మాత్రం అతి జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ వెళుతూంది. దానిపక్కనే గుర్రంమీద పెట్రో. అతని తనువు అంతావణికి పోయింది. సంతోషంతో ఊపిరిఆడలేదు. చుట్టూ చూసి సోదరుడుగా చూసుకుంటున్న ఇవాన్‌ని అగాధంలోకి తోసివేశాడు. గుర్రం, కోసక్, పిల్లవాడు ఆ అగాధంలో పడిపోయారు.

"కాని ఇవాన్ ఒకచెట్టు కొమ్మ పట్టుకోగలిగాడు. గుర్రం ఒక్కటే అగాధం అడుగున పడిపోయింది. వీపుకు కట్టుకున్న పిల్లవాడితో పైకి ఎక్కడానికి తంటాలు పడు

తున్నాడు. ఇక పైకి చేరుకుంటాడనగా తలెత్తి చూసాడు. వెనకకు పడదోయడానికి పెట్రో బల్లెం పట్టుకుని సిద్ధంగా వున్నాడు.

'అరి దేవుడా! స్వంత సోదరుడినిగా చూసుకుంటున్న వీడునన్ను వెనకకు పడదోయడానికి సిద్ధంగా వుండడం చూసే దౌర్భాగ్యం పట్టింది. యీకళ్ళు బాత్తలడిపోతే బావుండేది! సోదరా! సరేనన్ను పొడిచేయి. అది నానుదుటి రాత అను కుంటాను. కాని నాకొడుకును మాత్రం తీసుకో. పాపం! వీడు అమాయకుడు! యిటువంటి దారుణపు చావు చావడానికి వీడు నీకేం అపకారంచేసాడు?' దానిమీద పెట్రోనవ్వి బల్లెం పెట్టిపొడిచాడు. ఇవాన్ పిల్లవాడితోసహా అగాధంలో పడి పోయాడు. పెట్రో అతని సంపదనంతా తీసుకుని పాపాలాగా జీవించసాగాడు. ఆతనికి ఉన్న గుర్రాలవంటివి యెవరికీ లేవు. అతనికి వున్నటువంటి గొర్రెలమందలు ఎవరికీలేవు. ఇలా జీవితం గడిపి పెట్రోకూడా చనిపోయాడు.

"పెట్రోచనిపోయిన తరువాత భగవంతుడు విచారణ నిమిత్తం ఆ సోదరుల ఆత్మలు రెంటినీ పిలిపించాడు. 'యితడు మహాపాపి!' అన్నాడు దేవుడు, 'యివాన్! యితడికి శిక్ష యేం విధించాలో ఆలోచించడానికి నాకు చాలాకాలంపడు తుంది. కాబట్టి నువే శిక్ష ఆలోచించి చెప్పు!' ఏం శిక్ష విధిం చాలా అని ఇవాన్ చాలాసేపు ఆలోచించి చివరికి అన్నాడు:

" వీడు నాకు చాలా అపకారం చేసాడు. * జూడాస్ లాగా సోదరుడికి ద్రోహంచేసాడు. వంశనాశనం చేసాడు. జ్ఞానులు సంతానం లేకపోవడం భూమిలో విత్తనాలు నాటినా మొలవని విధంగా వుంటుంది. అది మొలవకపోతే విత్తనం వేసిందీ లేనిదీకూడా తెలియదు.

"యీ భూమ్మీద వాడి సంతతివారెవరూ సుఖపడకూడదని శపించు. వాడి వంశంలో ఆఖరివాడు కనీవినీ యెరగని సంతటి పాపి అగుగాక! వాడు పాపం చేసినపుడల్లా వాడి పితృదేవతలు సమాధులలో వుండలేక మానవుడెవరూ అనుభవించని బాధపడుతూ సమాధులలోనుంచి పైకిలేచెదరుగాక! యింక యీ ద్రోహి పెట్రో పైకి లేవలేక యింకా వేయింతలు తీవ్రమయిన బాధ అనుభవించుగాక! పిచ్చివాడిలా భూమిని కరుచుకుని లోపలే కొట్టు మిట్టాడుగాక!

"వాడిపాపం పూర్తిగా పండినపుడు అగాధంలో నుంచి శిఖరాగ్రానికి నేను గుర్రంమీద లేచి వాడిని పట్టుకుని అగాధంలోకి తోసివేసేటట్లు అనుగ్రహించు భగవాన్! వాడి పితృదేవతలు బతికివుండగా యెక్కడ నివసించినా ఆయా దేశాలనుంచి వచ్చి వాడి శవాన్ని పీక్కుతిందురుగాక! నేనా దృశ్యంచూసి పరమానంద భరితుడవుతాను. యిక యీ ద్రోహి పెట్రో భూమిలోనించి పైకి లేవలేక ఆ శవాన్ని పీక్కు తినాలనే కాంక్షతో కొట్టుకుపోయి తననుతనే పీక్కుతినుగాక ! కాలం గడచినకొద్దీ అతని కళేబరం

* ఏసుక్రీస్తును పట్టియిచ్చిన అనుచరుడు.

పెరుగుతూ బాధ యింకా యినుమడించుగాక! ఆబాధ అంతటి అధ్వాన్నమయింది మరివుండదు. ప్రతీకారం తీసుకోవాలనే కాంక్ష, అసక్తతకంటె తీవ్రమయిన బాధ మరేం వుంటుంది?"

"మానవుడా! మహాఘోరమయిన శిక్ష విధించావు!" అన్నాడు భగవంతుడు. 'సరే నువ్వు కోరినట్లే జరుగుగాక! కాని నువ్వు నీగుర్రంమీద అనంతకాలం కూర్చుండి పోతావు. స్వర్గంలో అడుగుపెట్టే అవకాశం వుండదు!' ఆ విధంగానే అంతా జరిగింది. ఆవింత రౌతు కార్పేథియా పర్వతాలలో ఇప్పటికీ గుర్రంమీద కూర్చునే ఉన్నాడు. అగాధంలో శవాన్ని పితృదేవతలు పీక్కుతినడం చూస్తూ ఆనందిస్తున్నాడు. పెట్రో చనిపోయి భూమిలోపల పెరిగిపోతూ భయంకరమయిన బాధతో తనకాయాన్ని తానే పీక్కుతింటూ భూమిని కంపింపజేయడం చూస్తున్నాడు."

అంధగాయకుని పాట పూర్తి అయింది. తిరిగీ తీగలను మోగించుతూ ఖోమా, యెరెమా, స్టాకోజాలమీది వీరగీతాలు పాడసాగాడు. కాని శ్రోతలు, పెద్దలుపిన్నలు మనోపరిభ్రమంనుంచి మేలుకోలేదు. పూర్వం ఎన్నడో జరిగినకథనే తలుచుకుంటూ తలలు వంచుకుని నిలబడిపోయారు.





# భార్యలు!

ఈ కథనుగురించి ఒక కథ ఉంది. గాడియాచ్ నుంచి వచ్చిన స్టెపాన్ ఇవనోవిచ్ కురోచ్కా మాకీకథ చెప్పాడు. నాకు మతిమరుపు ఎక్కువ. నాకే విషయమయినా చెప్పినా ఒకటే. జల్లెడతో నీళ్ళు తోడినట్టే. అందుకని నోటుపుస్తకంలో ఈ కథ వ్రాసిపెట్టమని ఆయనగారిని వేడుకున్నాను. భగవంతుడు ఆయనగారికి ఆయురారోగ్యాలు ప్రసాదించుగాక! ఆయనకి నేనంటే ఎప్పుడూ దయే! సరే అలాగేనని వ్రాసిపెట్టాడు. మా యింట్లో చిన్న ఉన్న మేజాబల్ల సొరుగులో దానిని దాచాను. మీకు తెలిసే ఉంటుంది. గుమ్మంలోనుంచి లోపలకు వస్తూంటే ఆ మూలఉందే ఆ మేజాబల్ల. అరే, ఇంతకీ మీరు మా ఇంటికి ఎన్నడూ రాలేదనే విష

యమే మరిచిపోయాను! దాచుకుని ప్రయోజన మేమిటి? మా ముసిలిదానికి చదవడం రాదు. అది ఒకవిధమయిన కాగితం మీద బజ్జీలు వండడం కనిపెట్టాను. బజ్జీలు ఎంత బాగా చేస్తుందనుకున్నారు! వహ్వా! ఈ ప్రపంచంలో ఎక్కడా అంత రుచికరమయినవి దొరకవనుకోండి. ఒకమాటు బజ్జీ తిప్పిచూసాను ఏం కనిపించాయనుకున్నారు? మాటలు! అంతరాత్మ ప్రబోధించినట్లు మేజాబల్ల దగ్గరకు వెళ్ళి చూసాను. పుస్తకంలో సగమే అక్కడ ఉంది! తక్కిన సగం బజ్జీలు వండడానికి తీసుకుపోయింది. ఏం చేయను? ఇంత వయసు వచ్చిన తరవాత పోట్లాట పెట్టుకోవడం చిలిపితనంగా ఉండదూ?

కిందటి సంవత్సరం గాడియాచ్ గుండా ప్రయాణం చేయవలసి వచ్చింది. ఆ పుస్తకం విషయం స్టెపాన్ ఇవనో విచ్‌ని అడగడం మరిచేపోకుండా ఉండేందుకుగాను జేబు రుమాలుకు ముడివేసాను. అంతేకాదు ఆ పట్నంలో అడుగు పెట్టీపెట్టగానే ఆ విషయం ముందుగా చూస్తానని ఒట్టు వేసుకున్నాను. కాని ఏం లాభం? పట్టణంలో అటూ ఇటూ తిరిగాను. తుమ్మాను, ముక్కు చీదుకున్నాను. ఏం లాభం? ఆ విషయమే జ్ఞాపకం రాలేదు. పట్టణంనుంచి బయలుదేరి ఆరు వెర్స్టుల దూరం వెళ్ళిన తరవాత జ్ఞాపకం వచ్చింది. ఇక చేసేదేవుంది? చివరిభాగం లేకుండానే అచ్చు వేయించాను. కాని చివరికి ఏమయిందీ తెలుసుకోవాలని ఎవరి కయినా బుద్ధిపుడితే గాడియాచ్ వెళ్ళి స్టెపాన్ ఇవనోవిచ్‌ని

అడగవలసిందే! సంతోషంతో మొదటినుంచి చివరిదాకా చెపుతాడు. రాతిచర్చికి దగ్గరలోనే అయనగారి ఇల్లు. చర్చి పక్కనే చిన్న సందు ఉంది. సందులోకి తిరిగితే ఆయన గారి ఇల్లు రెండోదో మూడోదో. ఇంకా గుర్తుకావా లంటే—ఆయనగారి ఇంటి ఆవరణలో పెద్ద స్తంభం, స్తంభంమీద కోలంకిపిట్ట కనిపిస్తాయి. ఆకుపచ్చని లంగాతొడుక్కుని ఒక బొద్దుపాటి స్త్రీ స్వాగత మిస్తుంది (ఇంతకీ ఆయనగారు అవివాహితుడని ముందే చెప్పడం మంచిది). అయినా - బజారులో కూడా ఆయన గారిని కలుసుకోవచ్చు. ప్రతిరోజూ ఉదయం తొమ్మిదిగంటల కల్లా చేపలు, కూరలు కొనడానికి బజారు వెళతాడు. అక్కడ ఫాదరీ ఆంటిప్‌తోనో, యూదుముస్తాజనుతోనో బాతాఖానీ కొడుతూంటాడు. చూడగానే ఇట్టే గుర్తు పట్టేయవచ్చు. ఇంకెవరూ రంగుపంట్లాం, పసుపుపచ్చ కోటూ వేసుకోరు. అంతేగాదు ఇంకో ఆనవాలుకూడా ఉంది. నడిచేటపుడు చేతులు ఊపుతాడు. ఇదివరలో సుంకాధికారిగా పనిచేసిన డెనిస్ పెట్రోవిచ్ దూరాన్నుంచి ఆయనగారిని చూడగానే అనేవాడు: 'అదిగో చూడండి. మన గాలిమర వస్తోంది' అని.



# 1

# ఇవాన్ ఫయిదొరోవిచ్ ష్టోంకా

ఇవాన్ ఫయిదొరోవిచ్ సైన్యంలో పనిచాలించుకుని నాలుగు సంవత్సరాలయింది. పని చాలించుకోగానే తన స్వంత వ్యవసాయ క్షేత్రంలో నివసించడానికి వెళ్ళాడు. చిన్నప్పుడు అతనిని వాన్యూషా అని పిలిచేవారు. గాడియాచ్ జిల్లా పాఠశాలలో చదువుకున్నాడు. మంచి బుద్ధిమంతుడు. కష్టపడి చదివేవాడు ఆ పాఠశాలలో రష్యన్ వ్యాకరణం బోధించే నికిఫోర్ టిమొఫెయెవిచ్ డెయెప్రిచాస్టీ పాఠశాలలోని పిల్లలంతా ష్టోంకాఅంత శ్రద్ధగాచదివితే గంగిరేణి చెక్క అడుగుబద్ద తరగతిలోకి తీసుకురావలసిన అగత్యం పట్టేది కాదనీ, సోమరిపోతు పిల్లవాళ్ళ చేతులమీద, అల్లరి పిల్లవాళ్ళ చేతులమీద కొట్టీ కొట్టీ విసుగెత్తిందనీ అనేవాడు. ష్టోంకా వ్రాతపుస్తకాలు పరిశుభ్రంగా ఉండేవి. ఎక్కడా మరక అంటూ కనిపించేదికాదు. ఎప్పుడూ చేతులు కట్టుకుని ఉపాధ్యాయుడుమీదే దృష్టి నిలిపి అల్లకీ గిల్లకీ చేయకుండా కూర్చునేవాడు. ముందుకూర్చున్న కుర్రవాడి వీపుకు కాగితం ముక్కలు అంటించేవాడు కాదు. పాఠశాల నియమాలను ఉల్లంఘించేవాడు కాదు. ఉపాధ్యాయుడు తరగతిలోకి రాక ముందు పిల్లలనుతోసుకువచ్చేవాడు కాదు. పెనసలు చెక్కుకోవలసివస్తే చాకు ఇమ్మని విద్యార్థులు ఇవాన్ ఫయి

డొరొవిచ్‌నే అడిగేవారు. అతనిదగ్గర ఎప్పుడూ చాకు ఉండేది ఇక ఇవాన్ ఆ రోజుల్లో వాన్యూషా అని పిలిచేవారు కదూ - వాన్యూషా బూడిదరంగుకోటు బొత్తానికి తగిలించు కున్న తోలుసంచిలోనుంచి చాకు తీసి ఇస్తూ బాగా పదునుగా ఉన్న అంచుతో చెక్కవద్దనీ రెండో అంచు పెనసలు చెక్కేందుకు కొంచెం మొద్దుగా అట్టేపెట్టానని చెప్పేవాడు, అతని మంచి నడవడి లాటిన్ ఉపాధ్యాయుడిని ఆకర్షించింది. ఆయనగారు నడవలోదగ్గితే చాలు, తరగతిలోకి అడుగు పెట్టకముందే కుర్రవాళ్ళంతా గడగడా వణికిపోయేవాళ్లు. ఆయనగారు ఉన్నికోటు తొడుగుకునేవాడు. మొహంమీద స్ఫోటకం మచ్చలుఉండేవి. ఎప్పుడూ బల్లమీద రెండు కట్టల పేముబెత్తాలు అట్టే ఉంచేవాడు. సగంమంది విద్యార్థులను గోడకుర్చీ వేయిస్తూండేవాడు. ఇవాన్ కంటె సమర్థులయిన విద్యార్థులు ఉన్నా అతనిని తరగతికి అంతకూ పెద్దను చేసాడు.

ఇవాన్ ఫయిడోరోవిచ్ జీవితం అంతటిమీదా ప్రభావం నెరపిన ఒకానొక సంఘటనను ఇక్కడ ప్రస్తావించక తప్పదు. ఒక కుర్రవాడు ఒకరోజున పాఠం చదువుకురాలేదు. కాని చదువుకువచ్చినట్లు వ్రాయమని ఇవాన్‌కి లంచంగా వెన్న రాసిన అట్లు కాగితంలో చుట్టపెట్టి ఇచ్చాడు. మామూలుగా ఇవాన్ నిక్కచ్చి మనిషేగాని ఆ సమయంలో ఆకలిగాఉన్నాడేమో లొంగిపోయాడు. అట్టు తీసుకుని పుస్తకం అడ్డంపెట్టుకుని తినసాగాడు. తినడంలో పూర్తిగా నిమగ్నుడయి ఉన్నాడేమో, సూదివేస్తే వినిపించేటంత

నిశ్శబ్దం తరగతిలో నెలకొన్నదని గమనించలేదు. ఉన్ని కోటు వేయి వచ్చి చెవి పుచ్చుకుని తరగతి మధ్యకిలాగే సరికి భయపడిపోయాడు. "ఊఁ - అట్లు యిలా యిచ్చెయ్! యిచ్చెయ్! నీచుడా!" అన్నాడు ఉపాధ్యాయుడు. వెన్న పూసిన అట్లు వేళ్ళతో తీసుకుని కిటికీలోనుంచి బయటికి విసిరివేసాడు. అంతేగాక ఎవరూ దానిని ముట్టకూడదని గట్టిగా ఆనపెట్టాడు. ఆతరవాత ఇవాన్ చేతులు వాచేటట్లు కొట్టాడు. చేతుల మీద కొట్టడం సబబు కూడానూ, ఎందుకంటే అట్లు తీసుకుంది చేతులేకదూ! ఏమయినా ఇవాన్ అసలే భయస్తుడేమో ఆనాటినుంచీ భయం ఎక్కువయింది. అతను ప్రభుత్వ కచేరీలలో ఉద్యోగంలో చేరడానికి ఇష్టపడక పోవడం ఈ సంఘటన మూలంగానేమో! తప్పు కప్పిపుచ్చు కోవడం సాధ్యంకాదని అనుభవం ద్వారా గ్రహించాడు.

పదిహేనేళ్ళు వచ్చాయి. రెండోఫారంలో చేరాడు. ఆ తరగతిలో లెక్కల చతుస్సూత్రాలకి, సంక్షిప్త ప్రశ్నోత్తరాలకు బదులు మానవుని విద్యుక్తధర్మం మీద పాఠాలు, భిన్నాల మీద లెక్కలు అభ్యసించ సాగాడు. అడవి వెళ్ళినకొద్దీ దట్టమవుతుందనే సామెతను బట్టీ, తండ్రి చనిపోయాడనే వార్త రాబట్టీ రెండు సంవత్సరాలు మాత్రమే పాఠశాలలో చదివి తల్లి అనుమతి మీద సైన్యంలో చేరాడు.

అతను చేరిన పటాలం మామూలు పదాతిదళాల వంటిదికాదు. గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువగా ఉన్నా ఏ విధంగానూ ఏ ఆశ్వికదళానికీ తీసిపోదు. ఆ దళాధికారులలో చాలామంది శుభ్రమయిన సారా తాగేవారు.

యూదులను జులపాలు పట్టుకుని లాగడంలో ఆశ్వీక దళానికి చెందినవారి కేమీ తీసిపోయేవారు కాదు. వారిలో కొంతమంది మజుర్కానాట్యంకూడా చేసే వారు. పదిమందితో మాట్లాడేటపుడు ఆ పటాలం కల నల్ మాటమాటకూ పొట్టమీద తట్టుకుంటూ "మా వుద్యో గులలో చాలామంది నాట్యం చేయగలరు!" అని చెప్పకుండా ఉండేవాడుకాదు. ఆ పటాలంలోనివారి సంస్కృతీ పరిమా ణాన్ని మా పాఠకులకు తెలియజేయడం మంచిది ఇద్దరికి పేకాటంటే మహాపిచ్చి. దుస్తులు, టోపీలు, ఓవరు కోట్లు, కత్తిముడులు, చివరికి లోదుస్తులుకూడా పేకాటలో ఒడ్డేవారు.

అయితే ఇటువంటివారిమధ్య తిరుగుతున్న ఇవాన్ ఫయిడొరొవిచ్ కి పిరికితనంమాత్రం వదలలేదు. శుభ్రమయిన సారా తాగేవాడుకాదు. భోజనానికి ముందు మామూలు వోడ్కా ఒకగ్లాసు పుచ్చుకునేవాడు. నాట్యం చేసేవాడు కాదు, చీట్లపేకఆడేవాడుకాదు. అందుచేత ఒంటరిగా కాలం గడపవలసి వస్తూండేది. తక్కినవారు అద్దె గుర్రాలమీద తిరుగుతూ, పెద్ద ప్రముఖులుగాని భూస్వాములను చూడడానికి వెళుతూంటే అతనుమాత్రం ఇంటిదగ్గరనే కూర్చుని సాధు స్వభావులకు తగిన పనులలో కాలం వెళ్ళబుచ్చేవాడు, గుండీ లకు మెరుగు బెట్టుకునేవాడు, జ్యోతిష గ్రంథాలు చదివే వాడు. గదిమూలలలో ఎలుక బోనులు పెట్టేవాడు, సైనిక దుస్తులు తీసివేసి హాయిగా పడుకునేవాడు.

అయితేనేం పటాలంలోకల్లా వేళకి పనిచేసేవా డితడొ కడేనని పేరుపొందాడు. అంతేకాదు కవాతు చేయించడంలో

ఆదర్శప్రాయుడని కమాండరు అతనిని ప్రస్తుతిస్తూండేవాడు. ఈ కారణాలవల్ల త్వరలోనే అంటే పతాకధికాగా చేరిన పద కొండు సంవత్సరాలకు రెండో లెఫ్టినెంటు అయ్యాడు.

ఇంతలో తల్లి చనిపోయిందనే వార్త వచ్చింది. పిన తల్లి చిన్నప్పుడు అతనిని పెంచింది. గాడిట్యూచ్‌లో ఉన్నప్పుడు ఎండు బేరిపళ్ళు, స్వయంగా తయారుచేసిన తేనె రొట్టెలు, మహారుచి అయినవి పంపుతుండేది. అక్కా చెల్లెళ్లకు సరిపడకపోవడంవల్ల ఇవాన్ ఆమెనుచూసి చాలా కాల మయింది. ఆ పినతల్లి అతని ఆస్తిపాస్తులను చూసిపెట్టడానికి అంగీకరించి ఆ విషయం ఉత్తరం ద్వారా తెలియజేసింది.

ఇవాన్ ఫయిడోరోవిచ్‌కి పినతల్లి వ్యవహార జ్ఞానంలో విశ్వాసం హెచ్చు. అందుకని సైన్యంలో పని చాలించుకో లేదు. ఉన్నత పదవిలోకి రాగానే సామాన్యంగాచాలామందికి గర్వం ఏర్పడుతుంది. కాని ఇవాన్‌కి మాత్రం గర్వం అంటే ఎలాఉంటుందోకూడా తెలియదు పతాకఅధికారిగాఉన్నప్పుడు ఎలా ఉన్నాడో రెండవ లెఫ్టినెంటు పదవి వచ్చినా అలాగే ఉన్నాడు. తల్లి చనిపోయిన తరవాత నాలుగు సంవత్సరాల పాటు ఆ పటాలంలోనే పనిచేసాడు. మొజిల్యోవ్ రాష్ట్రం నుంచి పటాలంతో రష్యా వెళ్ళనున్న సమయంలో ఈ క్రింది ఉత్తరం వచ్చింది.

"ప్రియమయిన ఇవాన్ ఫెయిడోరోవిచ్!

నీకు అయిదు జతల మేజోళ్ళు నూలు, నాలుగు చొక్కాలుయిందులో పంపుతున్నాను. అంతేగాదునీతోముఖ్య

మయిన విషయం మాటాడవలసివుంది. నీవుచాల ప్రధాన మయిన పదవి పొందావు. కాకపోయినా నీభూమిపుత్రుల వ్యవ హారం చూచుకోతగిన వయసూ వచ్చింది. అందుచేత నువ్వు యిక సైన్యంలో పనిచేయవలసిన అగత్యం కనిపించడంలేదు. నేనూ ముసలి దానిని అయిపోతున్నాను. నీ వ్యవహారాలు చూసే ఓపిక లేదు. పైగా నీతో స్వయంగా మాటాడవల సింది యెంతో వుంది.

కాబట్టి వాన్యూషా, యింటికి వచ్చేసెయ్. నిన్ను చూడాలని కాంక్షిస్తున్న.

నీ ప్రియమైన పిన్ని
వాసిలీసా సుప్చెవస్కా

పరా; మన పెరడులో అద్భుతమయిన టర్నిపు దుంపలు వున్నాయి. అవి తమాషాగా వుండడమేగాక యెక్కువగా ఆలూగడ్డలను పోలివుంటాయి."

ఈ ఉత్తరం అందిన వారం రోజులకు ఇవాన్ ఫెయిడో రోవిచ్ ఈ కిందివిధంగా జవాబు వ్రాసాడు;

"పూజ్యురాలయిన పిన్నికి,

నువు పంపిన బట్టలు అందాయి. కృతజ్ఞుణ్ణి. నాకు జోళ్ళు పాతవయిపోయాయి. నాతయినాతి నాలుగుసార్లు వాటిని కుట్టాడు. అందుచేత బాగా బిగుతు అయిపోయాయి. యిక నేను సైన్యంలో పనిచేసేవిషయంలో నీ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కాగితాలు పై అధికారు లకు పంపాను. నన్ను పనిలోనుంచి విడుదల చేయగానే బండి

కట్టించుకుని బయలుదేరుతాను. సైబీరియారకం గోధుమ విత్తనాలు తెమ్మంటివా, అవి మోగిల్యోవ్ రాష్ట్రంలో యెక్కడా దొరకవు. యిక యిక్కడి పందుల విషయం: యిక్కడి పందులకు కొద్దిగా బీరుకలిపి బార్లీ అంబలి పోస్తారు. నమస్కారములతో.

స్నే

ఇవాన్ ష్టోంకా."

చివరికి ఎలాగయితేనేం ఇవాన్‌కి లెఫ్టనెంటు పదవి ఇచ్చి పనినుంచి పంపించివేసారు. మొజిల్యోవ్‌నుంచి గాడీ యాచ్‌కి తీసుకు వెళ్ళడానికి నలభయి రూబుళ్ళకి ఒక యూదు బండిని కుదుర్చుకుని బయలుదేరాడు సరిగ్గా ఆ సమయానికే చెట్లు చిగిర్చాయి. భూమియావత్తు నవనవ లాడుతూ ఆకుపచ్చరంగు దాల్చింది. పొలాలలో వసంతకాలపు వాసన గుప్పుమంటోంది.



# 2

# ప్రయాణం

ప్రయాణకాలంలో చెప్పుకోతగ్గ సంఘటన ఏమీ జరగ లేదు. బయలుదేరి పదిహేను రోజులు దాటింది. ఇంకా తొందరగానే ఇంటికి చేరుకునే వారేగాని యూదు శనివారం శనివారం సబాతు పాటిస్తూ గుర్రపుతోలు తలమీద కప్పు కుని ఇరవయినాలుగు గంటలూ ప్రార్థనలు చేసేవాడు. ఇది వరకే చెప్పేగదూ, ఇవాన్ ఫెయిడోరోవిచ్ ఒక్క నిమిషం కూడా గోళ్లుగిల్లుకుంటూ కూర్చోలేడని. అందుకని పెట్టెలు తెరిచి లోదుస్తులు సరిగా ఉతికి మడతలు పెట్టిందీ లేనిదీ బాగా పరీక్షించాడు. భుజపట్టీలులేని కొత్త మిలటరీ దుస్తుల మీది పొలుసుతీసి పారవేసి మళ్ళీ జాగ్రతగా మడతలుపెట్టి పెట్టెలోపెట్టాడు అతనికి పుస్తకాలు చదవాలనే తహతహ లేదు. ఎప్పుడయినా చదివితే జ్యోతిష గ్రంథాలు చదివే వాడు చాలాసార్లుచదివిందే మళ్ళా చదవడం తఅనికిసరదా. ఇదేమాదిరిగానే పట్టణాలలోనివసించేవారు ప్రతిరోజూక్లబ్‌కు వెళుతూంటారు. ఎందుకు? కొత్త విషయాలు విందామని గాదు. స్నేహితులను కలుసుకుని అలవాటు ప్రకారం పిచ్చా పాటీ మాటాడుకోవడానికి. ఈ విధంగానే కచేరీ గుమాస్తా చిరునామాలజాబితా ఎంతో సంతృప్తిగా రోజూ అనేకసార్లు

చమత్కృతుంటాడు. కారణం ఏమీ ఉండదు. అచ్చులో ప్రశ్న జాబితా చదవడమే ఆ గుమస్తాకి వేడుక "ఆఁ-యివాన్ గ్రావి లోవిచ్ ఫలానా!" అని తనలో తాను గొణుగుకుంటాడు. "ఊఁ—" అంటాడు. మళ్ళీ అదే ఆశ్చర్యంతో చమత్కృతాడు.

పదిహేనురోజుల ప్రయాణాంతరం ఇవాన్ ఫెయిడొరో విచ్ గాడియాచ్‌కి నూరు వెస్ట్రాటదూరంలో ఉన్న ఒక చిన్న గ్రామం చేరుకున్నాడు. బండి విశ్రాంతి గృహాల చేరుకునేసరికి సూర్యుడు అస్తమించి చాలాసేపయింది.

మామూలుగా గ్రామాలలో ఉండే విశ్రాంతి గృహాల లాంటిదే ఇదీనీ. ప్రయాణీకులకు ఇక్కడ గుర్రాలకి వేసినట్టు ఇంతగడ్డీ ఓట్లు ఆహారంగా ఇస్తూంటారు. కాని ఉన్నవా ళ్ళలాగా భోజనం చేయాలనుకుంటే మాత్రం భవిష్యత్తుకు వాయిదా వేసుకోవలసిందే! ఇవాన్ ఫెయిడొరోవిచ్‌కి ఈ విషయం తెలుసు. అందుకనే కూడా రొట్టె చుట్టలు, మాంసపు కూరలు తెచ్చుకున్నాడు. సరే, విశ్రాంతి గృహా లలో వోడ్కాకి లోటు ఉండదుగా, ఒక గ్లాసు వోడ్కా అడిగి పుచ్చుకుని నేలమీద కదలకుండా బిగించిన దేవదారు బల్లముందు కూర్చుని భోజనం ప్రారంభించాడు.

ఇంతలో బండి ఆగినచప్పుడయింది. గేటు తలుపులు కిర్రుమన్నాయి. ఆవరణలోకి బండి చాలాసేపటికి గాని రాలేదు. ఆ విశ్రాంతి గృహయజమానురాలిని ఒకవ్యక్తి బిగ్గ రగా తిట్టసాగాడు. "లోపలికి రావడానికేం" అనే మాటలు ఇవాన్‌కి వినిపించాయి. "వస్తాను కాని ఒక్క నల్లి కుట్టినా,

ముసిలిముండా, నీవీపు చిట్లగొట్టేస్తాను. గడ్డికింద చిల్లి గవ్వయినా యివ్వను!"

ఒక నిమిషం తరవాత తలుపు తెరుచుకుంది. ఆకు పచ్చని కోటు వేసుకుని బొద్దుపాటి మనిషి ఒకడు లోపలకు తోసుకువచ్చాడు. మెడ కురచ, దానిమీద తల కదలకుండా పీఠం వేసుకున్నట్లు ఉంది. గవదకండలు తెగ పెరిగాయేమో మెడ మరింత లావుగా కనిపిస్తోంది. ఆకారాన్నిబట్టి చూస్తే అతను చిన్నచిన్న విషయాలను పట్టించుకోని వర్గానికి చెందిన వాడనీ జీవితం సాఫీగా నడిచిపోతోందనీ తోస్తుంది "నమస్కారం!" అన్నాడు ఇవాన్ ఫెయిడొరోవిచ్‌ని చూడగానే.

ఇవాన్ ఫెయిడొరోవిచ్ మాటాడకుండా వంగి నమస్కరించాడు.

"నేనెవరితో మాటాడుతున్నదీ తెలుసుకోవచ్చా," అని అడిగాడు బొద్దుపాటి నూతన్న ఆగంతకుడు.

ఇలా అడిగేసరికి ఇవాన్ లేచి కలనల్ ఏదయినా ప్రశ్న అడిగినపుడు టంచనుగా నిలబడ్డట్టు నిలబడ్డాడు.

"పనినుంచి విరమించుకున్న లెఫ్టెనెంటు ఇవాన్ ఫెయిడొరోవిచ్ ష్టోంకా" అని జవాబిచ్చాడు.

"తమరు యెక్కడికి వెళుతున్నారు?"

"నా స్వంత వ్యవసాయక్షేత్రం వి[క్రెంచెకికి."

"వి[క్రెంచెంకీ!" అన్నాడు ఆ అపరిచయస్తుడు.

"అలా అయితే" అన్నాడు ఇవాన్‌దగ్గరకు వెళుతూ అడ్డు తొలగించుకున్నట్టు, జనసమూహంలో దోవచేసుకుం

టున్నట్టు చేతులు అడిస్తూ. ఇవాన్ దగ్గరికి వెళ్ళి కావలించుకుని కుడిచెంప, తరవాత ఎడమచెంప, ఆతరవాత మళ్ళీ కుడిచెంప ముద్దిసుకున్నాడు. ఆ ఆగంతకుని పెద్ద పెద్ద చెంపలు మెత్త మెత్తగా పెదవులకు తగిలాయేమో, ఇవాన్‌కి ఇదంతా మహా సంతోషం కలిగించింది.

"క్షమించండి, నన్ను నేనే పరిచయం చేసుకుంటాను" అంటూ కొనసాగించాడు ఆ బొద్దుపాటి మనిషి. "గాడియాచ్ జిల్లాలో నాకూ భూపతి నీ భూమి పక్కనేవుంది. విక్రెచెంకికి అయిదు వెర్సుటల దూరంలోని ఖోర్టిశ్చె అనే గ్రామంలో నివసిస్తూంటాను. నా పేరు గ్రిగరీ గ్రిగోర్యెవిచ్ స్టార్చెంకో. మీరు తప్పకుండా మా ఖోర్టిశ్చె వచ్చి తీరాలి. మీరు రాకపోతే యిక మీతో మాటాడేది లేదు. నే నిపుడు వ్యవహారాల్కతొందరలో వున్నాను. అరె! యేవిటిది?" అన్నాడు మందస్వరంతో సవాకీ కుర్రవాడిని చూసి. ఆ కుర్రవాడు కోసక్ చొక్కా తొడిగాడు. చొక్కా మోచేతికి మాసికలు ఉన్నాయి. ఆశ్చర్యపోతూ బల్లమీద కొన్ని సంచులు, పెట్టెలు పెట్టాడు. "యేవిటది? దీని అంతరార్థం యేవిటి?" గ్రిగొరి గ్రిగోర్యెవిచ్ గొంతులో క్రమ క్రమంగా బెదిరింపు ధ్వనించింది. "వీటిని తెచ్చి యిక్కడ పెట్టమన్నానా? వెధవా! కోడిపిల్లను ముందుగా వండమని చెప్పలా! పో, వెళ్ళిపో!" అంటూ కేకలువేస్తూ నేలతన్నాడు. "ఆగు, కోతిమొహం కుంక! సీసాల బుట్టయేదీ. ?యివాన్ ఫెయిడొరోవిచ్" అన్నాడు గ్లాసులోకి సారాపోస్తూ.

"యీ మధువు కా స్త సేవించండి!"

"అబ్బే! ఊహుఁ- యిప్పటికే-" అంటూ ఇవాన్ ఫెయొడోరోవిచ్ మొదలుపెట్టాడు తటపటాయిస్తూ.

"మీ మాట ఒక్కటీ వినదలచుకోలేదు" ఆ భూస్వామి గొంతువిప్పి అన్నాడు. "ఒక్క మాటకూడా వినను. మీరు దీనిని సేవించేదాకా యిక్కడనుంచి కదలనే కదలను!"

తిరస్కరించడం సాధ్యంకాదని గ్రహించి ఇవాన్ సంతోషంతో గ్లాసు ఖాళీచేసాడు.

"యిదిగోనండి!" అంటూ మొదలుపెట్టాడు బొద్దు పాటి మనిషి. ఆ పెద్ద కొయ్యపెట్టెలో దానిని కోసివేస్తూ "మరోవిషయం చెప్పాలి. మా వంటిపుట్టి యపడోకా వుందే అది మధ్య మధ్య చుక్క వేసుకుంటూంది. అటువంటపుడు వంటపని పట్టించుకోదు. అరే కుర్రాడా!" కోసక్ చొక్కా తొడిగి మెత్తటి పరుపు తలగడాలు తీసుకువస్తున్న ఆ సవారీ కుర్రవాడిని సంబోధిస్తూ అన్నాడు:"గదిమధ్యలో నేలమీదనే నా పక్క వేయి. తలగాడకింద గడ్డిబాగాకుక్కు! చెవులో పెట్టు కోడానికి పంటికర్రనుంచి యింత దూది పట్టుకురా. ఒకమాటు యేమయిందనుకున్నారు? ఒకరష్యన్ హోటలులోపడుకున్నా, యెడమ చెవిలోకి ఒక వెధవ బొద్దింక దూరింది. అప్పటి నించీ రాత్రిళ్లు చెవుల్లో దూది పెట్టుకుంటున్నా. ఆ తరవాత తెలిసింది. ఆ గడ్డపాళ్ళు బొద్దింక పులుసుకూడా తాగుతా రట ! ఛీ! అపుడు యేం జరిగిందీ వర్ణించడం నాతరం కాదను కోండి. చెవిలో ఒకటే కిచకిచలు! పిచ్చెత్తిపోయిం దను

కోండి. మా ప్రాంతంలోని ఒక ముసలమ్మ యిట్లే నయం చేసింది. యెలా నయంచేసిందో తెలుసా? నా చెవిలో యేదో గొణిగింది. యింకేంవుంది, బొద్దింక బయటకు చక్కా వచ్చింది. యింతకీ వైద్యుల విషయంలో మీ అభిప్రాయ మేమిటంటారు? వాళ్ళు మనల్ని మోసగిస్తున్నారు. వెర్రి వెంగళప్పల్ని చేసి వదులుతున్నారు. యీ వైద్యు లందరి కంటే ముసలమ్మలకి పదిరెట్లు యెక్కువ తెలుసు. యేమం టారు?"

"అవునవును. మీరు చెప్పింది అక్షరాలా నిజం. చాలాసార్లు—" ఇక్కడ తగినమాటతోచనట్లు ఇవాన్ కొంచెంసేపు ఆగాడు.

ఇవాన్ మాటకారి కాదని చెప్పడం ఇక్కడ అసం గతం కాదనుకుంటా. దీనికి కారణం బిడియమూ కావచ్చు. లేదా సొగసుగా మాటాడలనే ఉద్దేశం అయి ఉండవచ్చు.

"గడ్డి సరిగా దులుపు, దులుపు!" అన్నాడు గ్రిగోరీ గ్రిగొర్యెవిచ్ సేవకునితో, "యిక్కడి గడ్డి మంచిదిగాదు. పుడకలు వుంటాయి. యిప్పుడే శెలవు తీసుకుంటా. రేపు యిక కలుసుకునేది లేదు. తెల్లవారకముందే లేచి వెళ్ళిపోతాను. రేపు శనివారం. మీయూదు సాబతు పాటిస్తాడు. అందుకని మీరు మంచుకుపోయినట్లు పెందలాడే లేవక్కర్లేదు. నా ఆహ్వానం మరిచేపోయేరు! ఖోర్టిశ్చెలో నన్ను కలుసుకోక పోతే యిక మీతో మాటాడేది లేదు."

ఇంతలో గ్రిగొర్యెవిచ్ నౌకరు ఆయనకోటు, ఎత్తు బూట్లు ఊడదీసి వాటిబదులు పెద్దగౌను కప్పాడు. గ్రిగోరీ

గ్రిగోర్యెవిచ్ కాళ్ళు చాచుకుని పండుకున్నాడు. మెత్తటి శయ్యలు ఒకదానిమీద ఒకటి పరచినట్టుంది!

"అరే, యెక్కడ చచ్చావురా, వెధవ! యిలారా, వచ్చి పరుపు సరిగా పరుచు. తలకింద గడ్డిపెట్టు, గుర్రాలకి యింకా నీళ్లు పెట్టలా? యింకా కాస్త గడ్డితే! యిక్కడ, యీ పక్కన పెట్టు, పరుపు సరిగా పరుచు! ఊం - సరే - కానీ!"

ఆ తర్వాత గ్రిగోరీ గ్రిగోర్యెవిచ్ రెండుసార్లు నిట్టూర్చాడు. ముక్కులోనుంచి ఈలవేసినట్టు శబ్దం పెద్దగా వెలువడి గదినంతా నింపివేసింది. మధ్య మధ్య బిగ్గరగా గురకకొట్ట సాగాడు. ఆ గురకకు స్టోవ్‌మీద కునుకు తీస్తున్న ఒక ముసలమ్మ హఠాత్తుగా మేలుకొని కళ్ళునిండా తెరుచుకుని తేరిపార జూసి ఏమీ కనిపించకపోయేసరికి తిరిగి నిద్రలో మునిగి పోయింది.

మర్నాడు ఉదయం ఇవాన్ మేలుకునేసరికి ఆ బొద్దు పాటి భూస్వామి కనిపించలేదు. ప్రయాణంలో చెప్పుకోదగ్గ సంఘటన ఇది ఒకటే. రెండు రోజుల తరవాత ఇవాన్ తన వ్యవసాయక్షేత్రం చేరుకున్నాడు.

గాలి మరడమాను కదలాడుతూ కనిపించేసరికి అతని గుండె టకటకా కొట్టుకుంది. యూదు కొండపైకి బండి ఎక్కించేసరికి కింద విల్లో చెట్ల వరసలు గోచరించాయి. ఆ చెట్లగుండా కొలను మెరిసిపోతూ పొడగట్టింది. దాని నుంచి చల్లగాలి వీచింది ఇక్కడ ఈ కొలనులో ఇవాన్

పూర్వం స్నానం చేసేవాడు. రైతు కుర్రాళ్ళతో కలిసి రొయ్యలు పట్టుకోవడానికి కంఠం లోతుదాకా నీళ్ళల్లోకి వెళ్ళేవాడు. బండి ఆనకట్ట ఎక్కింది. పూర్వ కాలపు తరహాలో కట్టిన పూరిల్లు, ఆపిలు, రేగిచెట్లు గోచరించాయి. చిన్నప్పుడు ఆ చెట్లుఎక్కి అతను ఆడుకునేవాడు. ఇంటి ఆవరణలోకి బండి ప్రవేశించగానే రకరకాల కుక్కలు నీరుకావిరంగువి, నల్లవి, బూడిద రంగువి, మచ్చల మచ్చలవి –నలువైపులనుంచీ పరుగెత్తుకుంటూ వచ్చాయి. కొన్ని మొరుగుతూ గుర్రాల డెక్కలకిందకు దూరాయి. బండి ఇరుసుకు పంది కొవ్వు పూయబడి ఉండడం పసికట్టి తక్కిన కుక్కలు బండి వెనకకు పరుగెత్తాయి. వంటింటిదగ్గర ఒక బొమికమీద కాలుపెట్టి నిలబడ్డ ఒక కుక్క బొంగురు గొంతుతో మొరిగింది. ఇంకోకుక్క తోక ఆడిస్తూ అటూ ఇటూ పరుగెత్తుతూ, మొరుగుతూ, "చూడండి క్రైస్తవులారా, యెంత చక్కనిదానో" అని చెప్పుతున్నట్లుంది. మురికి చొక్కాలు తొడుక్కున్న పిల్లలు చూడడానికి బయటికి పరుగెత్తుకువచ్చారు. పదహారు పిల్లలతో ఆవరణలో తిరుగుతున్న పంది ముట్టెపైకెత్తి మామూలుగాకంటె బిగ్గరగా గుర్రుమంది. ఆవరణలో గోధుమలు, జొన్నలు, బార్లీ నారపట్టాల మీద ఎండబెట్టారు. ఇంటిపైకప్పుమీద అడవిచికోరీ లాంటి మూలికలు ఎండుతున్నాయి.

వీటన్నిటినీ పరిశీలనగా చూడడంలో నిమగ్నుడయిపోయాడు ఇవాన్. యూను బండి దిగుతూంటే మచ్చల కుక్క అతని పిక్క మీద కరిచింది. నౌకర్లు అంటే వంట

వాడు, ఒక స్త్రీ, ఉన్ని పావడాల బాలికలు ఇద్దరు - బయటికిపరుగెత్తుకొచ్చి ఆశ్చర్యం ప్రకటిస్తూ, "చిన్నదొర!" అనుకున్నారు. ఆయన పినతల్లి పలాష్కా అనే బాలికతోనూ, ఒమెల్కా అనే బండివాడితోను వరివిత్తనాలు జల్లడానికి వెళ్ళిందని చెప్పారు. ఒమెల్కా తోటపని, కాపలాపని కూడా చేస్తుంటాడు. కాని అతని పినతల్లి దూరాన్నుంచే బండి రావడం చూసి పరుగెత్తుకుంటూ వచ్చి ఇవాన్‌ని నేలమీదనుంచి చేతులతో పైకెత్తింది. ఇవాన్‌కి ఆశ్చర్యంవేసింది. ముసిలిదానిని అయిపోయాను, అసభ్యురాలిని అని వ్రాసింది ఈమేనని నమ్మలేకపోయాడు.



# 3

# పినతల్లి

ఇవాన్ పినతల్లి వాసిలీసా కాష్పొరోవ్నాకి ఇప్పుడు యాభై ఏళ్ళు, ఆమె పెళ్ళిచేసుకోలేదు. అన్నిటికంటె కన్యాత్వం తనకు ఎక్కువ విలువయినదిగా భావిస్తున్నట్లు చెపుతూండేది. కాని నాకు బాగా జ్ఞాపకం, ఎవరూ ఆమెను వివాహమాడడానికి ముందుకురాలేదు. ఆమెముందు పురుషులు ఒకవిధమయిన భయానికి లోనయి పోయేవారు. అందుకని ఎవరూ పెళ్ళి విషయం ఆమెతో ఎత్తలేదు. 'వాసిలీసా కాష్పొరోవ్నా బుద్ధిమంతురాలు' అనేవారు యువకులు. నిజం. ఎవరినయినా ఇట్టే లొంగదీసుకునేది. మొగరాయుడు! ఎందుకూ పనికిరాని తాగుమోతు పిండిమర మనిషిచేత రోజూ పిలక ఎక్కదీసి మరీ పనిచేయించేది. ఆమెది బ్రహ్మాండమయిన కాయం. ఆ కాయానికి తగిన స్థూలం, బలం! ఆమెను ఆడదానిగా పుట్టించి ప్రకృతి క్షమించరాని తప్పు చేసిందని అనిపిస్తుంది. బొర్రమీసాలు, ఎత్తుబూట్లు ఆమెకి తగిపోయేవి. అంతేకాదు ఆమె ఆకారానికి తగినట్లే కార్యకలాపాలూ ఉండేవి. పడవ స్వయంగా నడిపేది. తెడ్లువేయడంలో పల్లెవాళ్ళెవళ్ళూ ఆమెతో సాటిరారు. వేటాడేది.

కూలీలు చేలు కోస్తూంటే కనిపెట్టి చూసేది. పెరడులో ఉన్న ఖర్జూజాపళ్ళ సంఖ్య ఖచ్చితంగా చెప్పేసేది. ఆనకట్ట మీాద నుంచి వెళ్లే ప్రతి బండికీ అయిదు కోపెక్కుల సుంకం వసూలు చేసేది. చెట్లు ఎక్కి బేరిపళ్ళు రాల్చేది. సోమరి పోతు నౌకర్లను చేతితో చితకకొట్టేది. మళ్ళీ ఆ చేతితోనే అర్హులయిన వారికి వోడ్కా అందించేది. ఒకే సమయంలో కుట్టడం, నూలుకు రంగు వేయడం, వంటింటిలోకి పరుగెత్తడం, బియ్యపు సారా కాయడం, తేనెతో తాండ్ర చేయడం లాంటి పనులు అనేకం చేస్తూండేది. ఒక్క నిమిషం కూడా ఊరికే కూర్చునేదికాదు. సకాలంలో పనులు చేయిస్తూం డేది. వీటిన్నిటి ఫలితంగా కిందటి జనాభా లెక్కలప్రకారం పద్దెనిమిది మంది దాసులతో ఉన్న ఇవాన్ జమీా దిన దిన ప్రవర్ధమాన మయింది. అంతేకాదు అక్కకొడుకంటే ఆమెకు అమిత ప్రేమ. అతనికోసరమని కోపెక్కు కోపెక్కు ఆవాల ముద్దచేసి పెట్టేది.

ఇంటికి చేరుకున్న దగ్గరినుంచీ ఇవాన్ ఫెయిడొరో విచ్ జీవితం పూర్తిగా మారిపోయి కొత్త దోవకు వచ్చింది. పద్దెనిమిది మంది దాసుల్ని, జమీా విషయాలు చూసుకో డానికే అతను పుట్టాడా అనిపిస్తుంది. మంచి ఒడుపయిన రైతుగా తయారవగలడని అతని పినతల్లి కనిపెట్టిందిగాని - అతనిని జమీా వ్యవహారాలన్నింటిలో జోక్యం చేసుకోనివ్వ లేదు. "యింకా పసికూన!" అనేది, నిజానికి ఇవాన్‌కి దరి దాపు నలభయి ఏళ్ళు వచ్చినా. "వాడికి యివన్నీ యేం తెలుస్తాయ్" అనేది పైగా.

కాని ఎల్లప్పుడూ పొలాలలో నాట్లు నాటేవారితో, కోతలు కోసేవారితో ఉండడం అతనికి పరమానందంగా ఉండేది. తళ తళలాడే కొడవళ్ళు ఏ డజనో ఆడుతూంటే, పనలు పనలుగా గడ్డి కింద పడుతూంటే నాట్లు వేసేవారి బృందగానం, అతిథికి స్వాగతమిస్తున్నవులాగా సంతోష దాయకంగా, వియోగమప్పటిలాగా విషాదదాయకంగా మధ్యమధ్య వెలువడుతూంటే అతనిమనసు అనిర్వచనీయమైన ఆనందం అనుభవించేది. ఇక ప్రశాంతమయిన, నిర్మలమయిన కాలం! అహా! ఏం సాయంకాలం! ఏం సాయంకాలం! గాలి స్వేచ్ఛగా చల్లగా వీస్తోంది. ప్రతిదీ ఎలా తేరుకుందనీ! మైదానం ఎర్రబారింది. ఎర్రబారి ముదురు నీలిరంగుగా మారింది. మళ్ళీ వివిధ రంగులతో ప్రకాశించింది. కోలంకి పిట్టలూ, బట్టమేక పక్షులూ, నీటికాకులు, మిడతలు, వేలవేల పురుగులు ఈలలు వేసాయి. ఝుమ్మని, కిచకిచ లాడాయి. చివరికి హఠాత్తుగా అన్నీ కలిసి శ్రావ్యమైన బృందగానంగా తయారయాయి. ఒక్క క్షణికంకూడా నిశ్శబ్దంగాలేదు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. సూర్యాస్తమయం ఎంత కొంగ్రొత్తగా, ఎంత సంతోషదాయకంగా ఉందని! పొలాలలో అక్కడక్కడా నెగళ్ళు వెలిగాయి. వాటిమీద కాగులుపెట్టి మీసాల కోతకూలీలు చుట్టూ కూర్చున్నారు. బోండాల ఆవిరి పైకి లేచింది. సాయం వెలుగు బూడిదరంగు తాల్చింది,... అటువంటపు ఇవాన్ ఫెడొరోవిచ్ మనసులో ఎట్టి ఊహలు పుట్టేవో ఎవరికీ తెలియదు. ఇవాన్‌కి బోండా లంటే మహా ఇష్టం. అయినా రుచిచూడాలని బుద్ధిపుట్టేది

కాదు. కదలకుండా నిలబడి ఆకాశంలో కాకి కనుమరుగు కావడం చూస్తోనో, పొలంలో చుక్కలు చుక్కలుగా ఉన్న పశువులు చూస్తూనో కాలం గడిపేవాడు.

ఇవాన్ ఫెడొరోవిచ్ మంచి సమర్థుడయిన రైతని తొందరలోనే పేరు వచ్చింది. అతని పినతల్లి అతన్ని చూసుకుని మురిసిపోయేది. అతనినిగురించి సగర్వంగా చెప్పే అవకాశం జారవిడిచేదికాదు. ఒకరోజున కోతలకాలం ఆఖరున అంటే జూలై ఆఖరిరోజులలో – వాసిలీసా కాషొవ్రోవ్నా ఏదో మర్మంగా ఇవాన్ చేయి పట్టుకుని చాలా కాలంగా మనసులో మెసలుతున్న విషయం అతనితో మాట్లాడాలని ఉందని చెప్పింది.

"నీకు తెలుసుగా, ఇవాన్!" అంటూ ప్రారంభించింది. "జనాభా లెక్కల ప్రకారం నీ వ్యవసాయ క్షేత్రంలో పద్దెనిమిదిమంది దాసులున్నారుగాని నిజానికి యింకా యెక్కువమందే, సుమారు యిరవయి నలుగురున్నారు. అయితే అసలు విషయం అదికాదు. మన జమీ అవతల వున్న చిట్టడవి చూసావుగా, దాని అవతల విశాలమైనదానంవుంది, అదీ చూసేవుంటావు. అదంతా యిరవయి డెసియాటిన్ల* వైశాల్యం వుంటుంది. గడ్డి చాలా ప్రశస్తమయింది. గడియాచ్‌లో అశ్వికదళాన్నే గనక అట్టేబెట్టితే ఆ గడ్డికి సంవత్సరానికి నూరు రూబుల్లు వస్తాయి."

"అవునవును, పిన్నీ! గడ్డి మహా ప్రశస్తమయింది, నాకు తెలుసు."

---

*డెసియాటిన్ = 2.7 ఎకరాలు.

"గడ్డి మహా ప్రశస్తమయిందని నువ్వు నాకేం చెప్ప క్కర్లేదు. నాకు తెలుసు కాని ఆ భూమంతా న్యాయంగా నీదేనని నీకు తెలుసా? అలా తేరిపార జూస్తావేం? విను. నీకు స్టెపాన్ కుజ్మిచ్ గ్యాపకం వున్నాడనుకోంటా! అరె! నీకెలా గ్యాపకంవుంటుంది! అప్పుడు నీకు సరిగా మాటలేరావు. అవునవును. భోగిపండగకు నేనువచ్చి నిన్ను యెత్తుకునేసరికి నా దుస్తులు పాడుచేసేవాడవయ్యావు. నవయ్యాకి అదృష్టం కొద్దీ నిన్ను నీదాది మ్యాట్రియోనా చేతికి యిచ్చాను కాబట్టి సరిపోయింది. అపుడు నువ్వు యెంత దారుణంగా వుండేవాడివని! కాని అసలు విషయం అదికాదు. మన వ్యవసాయ క్షేత్రం అవతలభూమి, ఖోర్టిష్చ్ గ్రామం స్టెపాన్ కుజ్మిచ్‌ది నువ్వు పుట్టకముందు, అతను మీ అమ్మను చూడడానికి వస్తుం డేవాడు. అదీ మీనాన్న యింటిదగ్గర లేనపుడు. నింద మోపా లనికాదుగాని – దాని ఆత్మకు శాంతికలుగుగాక! మీఅమ్మకి నేనంటే యెప్పుడూ పడేదికాదు. కాని అసలు విషయం అదికాదు. నేనిపుడు చెప్పిన జమీ స్టెపాన్ కుజ్మిచ్ నీకు దానపట్టా రాసియిచ్చాడు. కాని మీ అమ్మవుందే – మళ్ళా యెవరితోనూ అనకు – విచిత్రమయిన మనిషి! దాని మనసులో యేమ్వుందో భగవంతుడికి కూడా తెలీదు. ఆ దాన పట్టా యేంచేసిందో యెవరికీ బోధపడదు. ఆ ఘోటక బ్రహ్మ చారి గ్రిగొర్యేవిచ్ చేతికి చిక్కిందనుకుంటాను ఆ బాన కడుపు వెధవ జమీఅంతా కాజేసాడు. ఆపట్టా యెక్కడో దాచేసి వుంటాడు, సందేహం లేదు."

"విశ్రాంతి గృహంలో నాకు పరిచయమయిన స్టోర్చెంకో యీాయనేకదూ ?"

దానిమీాద ఇవాన్ స్టోర్చెంకోతో తనకు పరిచయమవడం అదీ వర్ణించి చెప్పాడు.

"యేమో యెవరికి తెలుసు?" అంది అతని పినతల్లి ఒక నిమిషం ఆలోచించి. "బహుశా అతను దుర్మార్గుడు కాకపోవచ్చు. యీా వేపున నివసించడానికి వచ్చి ఆరునెలలే అయింది. యింత తొందర్లో మనిషి యెటువంటివాడో తెలుసుకోలేం. అతని తల్లి మంచి తెలివయిందని విన్నాను. దోసావకాయ వేయడంలో సిద్ధహస్తురాలు. ఆమె దాసీలు మంచి మంచి తివాసీలు నేయగలరు నిన్ను వాళ్లింటికి రమ్మని స్నేహభావంతో ఆహ్వానించాడని చెప్పావుగా, తప్పకుండా వెళ్ళు. ఆ పాపిష్టి ముసిలాడు అంతరాత్మ చెప్పినట్లు విని నీ ఆస్తి నీకు యిచ్చేస్తాడేమో! కావాలంటే మనబండిలో వెళ్లు. కాకపోతే అల్లరిపిల్లలు వెనక మేకులు వూడదీసేసారు. బండిమనిషి ఓమెల్కొతో తారువేసి మేకులు బిగించమని చెపుతాలే."

"యెందుకు పిన్నీ! నువ్వు వేటకు యెక్కి వెళ్లే బోను తీసుకువెళితే సరిపోతుంది."

అంతటితో సంభాషణ ముగిసింది.



## 4

# ఐ ం దు

ఇవాన్ ఫెయిడొరోవిచ్ ఖోర్టిష్కో గ్రామం చేరుకునే సరికి మధ్యాహ్నం భోజనం వేళ అయింది. మిరాసీదారు ఇల్లు సమీపించిన కొలదీ భయం ఎక్కువయింది. అది పెద్ద ఇల్లు. ఇరుగు పొరుగు ఇళ్ళలాగా పూరికొంపకాదు. కొయ్య కప్పు. ఆవరణలోని రెండు ధాన్యపు కొట్లకికూడా కొయ్య కప్పులే. నృత్యప్రదర్శనానికి వెళ్ళిన షోకిల్లా ప్రతివాడూ తన కంటె బాగా ముస్తాబయినాడని అనుకున్నట్లే ఇవాన్ కూడా అనుకున్నాడు. గౌరవసూచకంగా బోను ఒక ధాన్యపు కొట్టు దగ్గర ఆపి సింహద్వారం వద్దకు నడిచి వెళ్ళాడు.

"ఆఁ- యివాన్ ఫెయిడొరోవిచ్!" అన్నాడు గ్రిగొర్యేవిచ్ ఆవరణ దాటుతూ. ఆ సమయంలో మెడపట్టీగాని, వేస్టుకోటుగాని, కాసెకోకగాని ధరించిలేడు. కాని ఈదుస్తులే అతని భారీకాయానికి భారంగా ఉన్నాయి. చెమటకాలవ గట్టుతోంది. "ఊా పిన్నినీ చూచి వెంటనే యిక్కడకు వస్తానన్నావు, రాలేదేం!" అన్నాడు. దాంతో ఇవాన్ మెత్తబడి "యెదో వ్యవసాయం అదీ చూసుకోవడంలో తీరికలేకపోయింది. యిపుడయినా యెదో ఒక నిమిషం వుండిపోదామని వ్యవహారపు పనులుండి వచ్చాను."

"ఓ నిమిషమా! అదేం కుదరదు అరే, కుఁరాడా!" అని కేకవేసాడు ఆ బొద్దుపాటి పెద్దమనిషి. ఆపిలుపుకు వంటిం టిలోనుంచి కోసక్ చొక్కా తొడుక్కుని వెనకటి కుఁరాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. "గేటు గట్టిగా బందు చేయమని కాస్త్యాన్‌తో చెప్పు. వినిపించిందా? తొందరగా యీాయన గారి గుఁర్రాన్ని తక్షణమే వూడిదీయి. లోపలికి రండి! బయట వేంఁడంగావుంది. చెమటతో నాచొక్కా తడిసిపోయింది."

లోపలకు వెళ్ళగానే కాలం వృధా పుచ్చరాదనీ, సిగ్గు విడిచిపెట్టి నిష్కర్షగా మాటాడాలనీ ఇవాన్ నిశ్చయించు కున్నాడు.

"మా పిన్నిగారు చెప్పింది - స్టెపాన్ కుజ్మిచ్ చని పోయేముందు దానపట్టారాసి —"

ఈ మాటలు వినేసరికి గ్రిగోరీ గ్రిగోర్యెవిచ్ మొహం ఎలా ముడుచుకుందో వర్ణించడం కష్టం!

"అబ్బే! నాకేం వినిపించి చావదు." అని జవాబి చ్చాడు. "నా యెడమ చెవిలోకి బొద్దింక దూరింది. ఆగడ్డం రష్యావాళ్ళు తమ గుడిసెల్లో బొద్దింకల్ని పెంచుతారు. యెంత హైరానా పడిపోయానో వర్ణించడం సాధ్యంకాదు. చెవులో ఒకటే కితకితలు! ఒక ముసిలిది సులువుగా నయం చేసింది."

గ్రిగోరీ గ్రిగోర్యెవిచ్ విషయం తప్పిస్తున్నాడని గ్రహించి ఇవాన్ సాహసంతో అడ్డువచ్చి "స్టెపాన్‌కుజ్మిచ్ వీలునామాలో దాన పట్టా ప్రస్తావన వుందట. దానిని బట్టి నాకు—"

"నాకు తెలుసు. మీ పిన్ని యీ కథ నీకు చెప్పింది కదూ! అంతా అబద్ధం. వొట్టు! మా బాబాయి అటువంటి దాన పట్టా యేమీ రాయలేదు. వీలునామాలో దాని ప్రస్తావన వుందిగాని అది యెదీ? యెవరూ దాన్ని బయట పెట్టలేదు. త్రికరణశుద్ధిగా నీ క్షేమం కోరే యీ మాట చెపుతున్నాను. వొట్టు! అదంతా పచ్చి అబద్ధం!"

పినతల్లిపొరబడిఉంటుందనేభావంతోఇవాన్ మరిమాటాడలేదు.

"అరుగో, మా అమ్మ. మా చెల్లెళ్ళూ! భోజనం వడ్డించే వుంటారు. వెళదాంపద!"

ఇలా అని గ్రిగొరీ గ్రిగొర్యేవిచ్ ఇవాన్ చేయిపట్టుకుని ఒక గదిలోకి తీసుకు వెళ్ళాడు. ఆ గదిలో బల్లమీద వోడ్కా, మంచి మంచి పదార్థాలు వడ్డించి ఉన్నాయి.

ఆ సమయానికే ఒక పొట్టి ముసలమ్మ, ఇద్దరు యువతులు వచ్చారు. ఆ ముసలమ్మ టోపీపెట్టుకుంది. గ్లాసులకి గ్లాసులు కాఫీతాగే రకం మనిషి. ఇక ఆ పడుచుపిల్లలలో ఒకామె శరీరవర్ణం చక్కన, రెండో ఆమెది చిక్కన. ఇవాన్ ఫెయొడొరోవిచ్ మర్యాదస్తుల బిడ్డలాగా వెళ్ళి ముందుగా ఆ ముసిలావిడ చేతిని, ఆ తరవాత ఆ యువతుల చేతులను ముద్దిడుకున్నాడు.

"యీయన మన పొరుగు పెద్దమనిషి. యివాన్ ఫెయొడొరోవిచ్ ష్పోంకా, అమ్మా!" అని చెపుతూపరిచయం చేసాడు గ్రిగొర్యేవిచ్.

ఆ వృద్ధురాలు ఇవాన్ కేసి సాపేక్షగా చూసింది, లేదూ అలా అనిపించింది. ఆమెలో మంచితనం,

నిరాడంబరత్వం మూర్తీభవించాయి. "యీ శీతాకాలానికి యెన్ని దోసకాయలు మీరు వూరేసారు?" అని ఇవాన్‌ని అడగదలచినట్టు కనిపించింది.

"వోడ్కా పుచ్చుకున్నారా?" అని అడిగింది.

"నీకు సరిగా నిద్రపట్టలేదనుకుంటా, అమ్మా!" అన్నాడు గ్రిగొరీ. "యేమన్నా పుచ్చుకున్నారా అని అతిథులను అడగొచ్చా? పుచ్చుకోమని చెప్పాలిగాని. పుచ్చుకోవడమా, మానడమా అనేది మేం ఆలోచించుకోవలసినవిషయం. యివాన్ ఫెయిడొరొవిచ్! మీకు యేరకం వోడ్కా కావాలి? సెంటారీ రకమా, ట్రొఫిమోవ్ రకమా? యేది మీకుయెక్కువ యిష్టం. యికనువ్వు, యివాన్ యివనోవిచ్, యిక్కడ నిలబడ్డావేం?" అన్నాడు గ్రిగరీ వెనకకు తిరిగి. అలా సంబోధింపబడిన పెద్దమనిషి వోడ్కా దగ్గరికి వెళ్ళాడు. అతను పొడుగాటిఅంచులవదులుకోటుతొడిగాడు. నిక్కబొడుచుకున్న పెద్దకాలరు. కాలరు మెడ అంతా ఆక్రమించింది. తల బండిలో కూర్చున్నట్టు ఉంది.

ఇవాన్ ఇవనోవిచ్ వోడ్కా దగ్గరకు వెళ్ళి చేతులు రుద్దుకుని, గ్లాసు జాగ్రతగా పరీక్షించి, వోడ్కాతోనింపి. వెలుతురులో చూసి, ఒక్కసారే అంతా నోట్లో పోసేసుకున్నాడు. కాని అంతా ఒక్కసారే మింగలేదు. మింగే ముందు నోరంతా శుభ్రంగా పుక్కిలించాడు, కొద్దిగా రొట్టి, కుక్కగొడుగు ఊరగాయతిని ఇవాన్ ఫెయిడొరొవిచ్ కేసి తిరిగాడు.

"మీరు యివాన్ ఫెయిడొరోవిచ్ షప్పోంకాగారూ!"

"అవునండీ" అని ఇవాన్ ఫెయిడొరోవిచ్ సమాధాన మిచ్చాడు.

"కిందటి తడవ నేను చూసినప్పటి కంటె బాగా మారిపోయారు అవును. బాగా గ్యాపకం, యింత యెత్తు వుండేవారు" ఇలా అని నేలమీద గజం ఎత్తున చేయి పైకి పెట్టాడు. "పాపం! మీ నాన్న-ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక! — విచిత్రమయిన మనిషి. ఖర్బుజా పళ్ళు పండించేవాడు. అటువంటివి యీ రోజుల్లో చూదామన్నా కనిపించవనుకో. చూడు, వుదాహరణకు" పక్కకు తీసుకు వెళ్ళి ఇంకా అన్నాడు: "యిక్కడ కూడా ఖర్బుజాపళ్ళు వడ్డిస్తారు. ఖర్బుజాపళ్లు! వాటివంక చూడాలని బుద్ధే పుట్టదు! యింతలేసి ఖర్బుజాపళ్లు పండించే వాడంటే నీకు నమ్మకం కలగదు" అన్నాడు. ఈ మాటలు ఏదో మర్మంగా ఉచ్చరించి లావుపాటి చెట్టుబోదెను కావలించుకోబోతున్నట్టు చేతులు జాపాడు.

"భోజనానికి పదండి" అన్నాడు గ్రిగోరీ ఇవాన్ ఫెయిడొరోవిచ్‌ని చేయి పట్టుకుని తీసుకు వెళుతూ.

అంతా భోజనాల గదికి బయలుదేరారు.

గ్రిగోరీ గ్రిగొర్యేవిచ్ బల్లముందు తాను మామూలుగా కూర్చునే స్థానంలో కూర్చున్నాడు. బల్లమీద పెద్ద వస్త్రం కప్పిఉంది. అదంతా చూస్తే మంగళ్ళు తమ దుకాణం బల్లమీద వేయించే పీరుడిలా గ్రిగోరీ అవుపించాడు. ఇవాన్ ఫెయిడొరోవిచ్ సిగ్గుపడుతూ ఆఇద్దరు యువతులకు

ఎదురుగా అతనికోసం ప్రత్యేకించిన ఆసనంలో కూర్చు న్నాడు. ఇవాన్ ఇవనోవిచ్ అతని పక్కన కూర్చునే అవకాశం జారవిడవలేదు. తనకు తెలిసిన సమాచారం అంద జేయడానికి మనిషి దొరికాడుగదా అని లోలోపల ఉప్పొంగి పోయాడు.

"మెరసారా యేంకాదు, సీమకోడి!" అంది ఆ ముసలమ్మ ఇవాన్ ఫెయిడొరోవిచ్‌ని సంబోధిస్తూ, నల్లటి అతుకువేసిన బూడిదవాన కోయిలతోకలాంటి అంగీ వేసు కుని ఒక నౌకరు పళ్ళెంతో అందిస్తూంటే.

"వీపు తీసుకో."

"అమ్మా! మధ్య నువు జోక్యం చేసుకుంటా వెందుకు?" అంటూ వ్యాఖ్యానం మొదలుపెట్టాడు గ్రిగొరీ గ్రిగొర్యేవిచ్. "యేం తినాలో మన అతిధికి తెలియదను కున్నావా? యివాన్ ఫెయిడొరోవిచ్, రెక్క తీసుకో. అదిగో రాతిసంచిలో వున్న అది. అరె! అంతకొద్దిగా తీసు కున్నావేం? కాలుకాలూ తీసుకో. అలా పళ్ళెం పట్టుకుని నోరు తెరుచుకు చూస్తావేం! వారిని అడుగు. మోకరిల్లు వెధవ! 'యివాన్ ఫెయిడొరొవిచ్ కాలు తీసుకోండి' అనిచెప్పు."

"యివాన్ ఫెయిడొరోవిచ్, కాలు తీసుకోండి!" అని అరిచాడు నౌకరు మోకరిల్లి.

"ఊఁ - యిది సీమకోడే అంటారా?" అంటూ ఇవాన్ ఇవనోవిచ్ గొణిగాడు మెల్లగా నిరసన భావంతో గ్రిగొరీ ఫెయిడొరోవిచ్ వంకకు తిరిగి "సీమకోడి యిలానే

వుంటుందా? నా కోళ్ళను చూస్తేనా! యిలాంటివి డజను అయినా నా ఒక్కకోడికి సరికావు. అంత కొవ్వుపట్టివున్నాయి నావి. దొడ్లో తిరుగుతూంటే చీదర పుడుతుంది."

"యివాన్ యివనోవిచ్, నువ్వు అబద్ధం చెపుతున్నావ్!" అన్నాడు గ్రిగొరీ గ్రిగొర్యేవిచ్ ఈమాటలు విని.

గ్రిగొరీ గ్రిగొర్యేవిచ్ చెప్పింది వినిపించనట్టు నటిస్తూ ఇంకా అన్నాడు. "కిందటి సంవత్సరం గడియాచ్ పంపితే ఒక్కొక్కదానికీ యాభై కోపెక్కులు యిస్తామన్నారు. కాని నేను తీసుకోలేదు."

"యివాన్ యివనొవిచ్, మళ్ళీ అబద్ధం చెపుతున్నావ్!" అన్నాడు గ్రిగొరీ గ్రిగొర్యేవిచ్ స్పష్టంగా వినిపించాలని ప్రతిఅక్షరం ఒత్తి పలుకుతూ, ఇంకా బిగ్గరగా.

కాని ఇవాన్ ఇవనోవిచ్ ఆ మాటలు తనకు సంబంధించినవి కానట్టు నటిస్తూ వెనకటి మాదిరిగానే మళ్ళీ మొదలుపెట్టాడు. కాని ఈతడవ గొంతుస్థాయి తగ్గించాడు.

"అవును. తీసుకోలేదు. గడియాచ్‌లో—"

"యివాన్ యివనోవిచ్ నువ్వు వట్టి పిచ్చిపుల్లాయివి. నిజం." అన్నాడు గ్రిగరీగ్రిగొర్యేవిచ్ బిగ్గరగా. "ఆవిషయం నీకంటె యివాన్ ఫెయిడొరోవిచ్‌కే బాగా తెలుసు. నీ మాటలు నమ్మడులే."

దీంతో ఇవాన్ ఇవనోవిచ్‌కి నిజంగానే కోపంవచ్చింది. మరి మాటాడలేదు. చిరాకు కలిగించేవాటంత కొవ్వు పట్టకపోయినా ఆసీమకోడిని దిగమింగడంలో పడిపోయాడు.

కొంతసేపటివరకు సంభాషణ బదులు కత్తులు, చెంచాలు, పళ్ళాల గోలతో సరిపోయింది. భౌమిక మాంసం లోని గుజురు గ్రిగొరీ గ్రిగొర్యెవిచ్ పీలుస్తుంటే అయిన చప్పుడు అన్నిటినీ మించిపోయింది

"మీరు" అంటూ అడగసాగాడు ఇవాన్ ఇవనోవిచ్ కొంచెంసేపు మౌనం తరవాత బండిలాంటి మెడపట్టిలోనుంచి తల ముందుకు పెట్టి. 'పుణ్యక్షేత్రానికి కొరోచినికోవ్ ప్రయాణం' అనే గ్రంథంచదివారా? మనసుకు యెంతో ఆహ్లాదం ఒనగూరుస్తుంది. అటువంటి పుస్తకాలే యీ రోజుల్లో కరువయినాయి. అది యే సంవత్సరంలో రాయబడిందో సరిగా చూడలేదు."

పుస్తకం అనే మాట వినిపించేసరికి ఇవాన్ ఫెయిడొరోవిచ్ శ్రద్ధగా వ్యంజనం తినసాగాడు,

"సామాన్య పౌరుడు ఆ ప్రదేశాలన్నీ చూసిరావడం నిజంగా ఆశ్చర్యకరమయిన విషయం. మూడువేల వెర్స్టుల దూరం! మూడువేల వెరుసుటల దూరం! భగవంతుడి అనుగ్రహం వల్లనే పాలస్తీనా, జెరూసలేం చేరుకున్నాడనుకోండి."

"అలానా?" అన్నాడు ఇవాన్ ఫెయిడొరోవిచ్. జెరూసలెంను గురించి తన త్రైనాతీవల్ల చాలా చాలా విన్నాడు. "జెరూ సలెం వెళ్ళ గలిగాడా?"

"యేమిటి అంటున్నారు యివాన్ ఫెయిడొరోవిచ్!" అని గ్రిగొరీగ్రిగొర్యెవిచ్ అడిగాడు. ఆ చివరనుంచి.

"ప్రపంచాలో యెంతమారప్రు ప్రదేశాలున్నా యోపరి శీలించే అవకాశం నాకు చిక్కింది" అన్నాడు ఇవాన్ ఫెయి డోరోవిచ్, అంతక్లిష్టమయిన పెద్దవాక్యం చెప్పగలిగినందుకు నిజంగానే సంతృప్తి చెందుతూ.

"ఆయనగారి మాటలు నమ్మకు" అన్నాడు గ్రిగోరీ గిగోర్యెవిచ్, ఇవాన్ చెప్పినది సరిగా వినిపించక. "యెప్పుడూ అబద్ధాలు చెపుతూనే వుంటాడు."

ఇంతలో భోజనాలు పూర్తయాయి. గ్రిగోరి గ్రిగోర్యెవిచ్ మామూలు ప్రకారం కునుకు దీయడానికి తన గదికి చక్కాపోయాడు. ఇక అతిథులు ఆ వృద్ధురాలిని యువతులను అనుసరించి కచేరీ గదిలోకి వెళ్ళారు. అంతకు ముందు వోడ్కా ఉంచిన మేజాబల్ల విచిత్రంగా మారి పోయింది. ఇపుడు దాని మీాద రక రకాల తాండ్ర, రేగి పళ్ళు, ఖర్బుజాపళ్లు పెట్టి ఉన్నాయి,

గ్రిగోరీ గ్రిగోర్యెవిచ్ లేని కొరత ప్రతిదాంట్లోనూ గోచరించింది. ఆ ముసలమ్మకు బాతాఖానీ అంటే మహా ఇష్టం. అడగకుండానే సీమరేగి జున్ను చేయడం గురించీ, బేరిపళ్ళు ఎండబెట్టడంగురించీ చెప్పింది. యువతులుకూడా మాట్లాడసాగారు. చక్కని వర్ణం యువతి అక్కకంటె ఆరేళ్ళ చిన్నదానిలా ఉంది. సుమారు ఇరవయి అయిదేళ్ళుం టాయి. ఆమె ఎక్కువగా మౌనం వహించింది.

కాని ఇవాన్ ఇవనోవిచ్ అందరికంటె ఎక్కువగా మాట్లాడాడు. అందరికంటె చురుకుగా ఉన్నాడు. ఎవరూ

తనకు వ్యతిరేకంగా మాట్లాడరు, ఎవరూ తనను నోరు మూయించరు అనే ధీమాతో దోసకాయలను గురించీ, ఆలూ గడ్డ నాటడం గురించీ, పూర్వకాలంలోని తెలివయినవాళ్ళను గురించీ–ఈరోజుల్లో మనుషులకీ వాళ్ళకీ పోలికేమిటి? కాలం గడిచినకొద్దీ ప్రతీదీ అభివృద్ధి పొందడం గురించి, క్లిష్టమయిన విషయాలు తెలుసుకోవడం గురించి చెప్పాడు. నిజానికి సంభాషణ కొనసాగించడమంటే అతనికి మహానందం. ఏవిషయం మీదపడితే ఆ విషయంమీద మాటాడగలడు. సంభాషణ గంభీరమయిన విషయాలమీదకు, పవిత్రమయిన విషయాల మీదకు మళ్లితే మాటమాటకీ నిట్టూర్చి, కొద్దిగా తల ఊపే వాడు. కాని విషయం గృహసంబంధమయిందయితే బండి లాంటి మెడ పట్టీలోనుంచి తల ముందుకు జాపి మొహం రక రకాలుగా పెట్టేవాడు. ఆ మొహాలనుబట్టి బెరిసారా వండడం ఎలాగో, అతను చెప్పిన ఖర్బూజాపళ్లు ఎంతపెద్దవో, అతని దొడ్లో తిరిగే సీమకోళ్లు ఎంత కొవ్వుపట్టినవో తెలుసుకో వచ్చు.

ఎలాగయితేనేం చివరికి అతి కష్టంమీద సాయం కాలం ఇవాన్ ఫెయిడొరోవిచ్ ఇంటికి వెళ్ళడానికి శెలవు తీసుకున్నాడు. మామూలుగా అతనిది మెత్తపడే స్వభావమే. బలవంతాన ఆ రాత్రికి అక్కడివారు అట్టేవుంచేవారే కాని ఇవాన్ వెళ్లిపోవాలని పట్టుపట్టాడు. పట్టు నెగ్గించుకుని ఇంటకి వెళ్ళాడు.



# 5

# కొత్త ఎత్తు

"సరేగాని, ఆ ముసిలి పాపిష్టి చచ్చినానాడి దగ్గిరనించి దానపట్టా గుంజుకు వచ్చావా?"ఇవాన్ ఫెడొరోవిచ్ ఇంటికి వెళ్ళగానే పినతల్లి వేసిన ప్రశ్న ఇది. అతనికోసమని గంటల తరబడి మెట్లుమీాదనిలబడి ఎంతసేపటికీ రాకపోయేసరికి గేటు బయటికి వెళ్ళకుండా ఉండలేకపోయింది,

"లేదు, పిన్నీ!" అన్నాడు ఇవాన్ బోనులోనుంచి దిగుతూ." గ్రిగొరీ గ్రిగొర్యెవిచ్ దగ్గిర అటువంటిదేదీ లేదే!"

"యింకేం నువ్వు నమ్మేశావ్! వెధవ, అన్నీ అబద్ధాలే. యెప్పుడో ఒకప్పుడు నా కంటపడడూ! పడితే యీా చేతుల్తో వాడిని చితకబాత్తాను. కొవ్వు వదిలిస్తాను. వాడిని కోర్టుకు లాగడానికి వీలుందేమో మన ప్లీడరుతో ముందు సంప్రదించాలి. యిప్పుడు ఆ విషయం యెందుకుగాని, విందు యెలావుంది, బావుందా?"

"బలే బావుంది, పిన్నీ!"

"సరే, యేమేమి వండారు? చెప్పు. ఆ ముసిలిది వంటలో ఆరితేరిన చెయ్యి! నాకు తెలుసులే!"

"పుల్లమీగడతో పెరుగుముక్కలు! పిన్నీ! పావురాల పులుసుకూర!"

"యెండు రేగిపళ్ళతో సీమకోడికూడాకదూ?" అంది పినతల్లి. ఆమె ఆ పదార్థం వండడంలో బహు నేర్పరి.

"ఆఁ- సీమకోడినికూడా వడ్డించారు. చాలా అందమయినయువతులు–గ్రిగొరీ గ్రిగొర్యెవిచ్ చెల్లెళ్ళు ముఖ్యంగా చక్కటి రంగు యువతి—"

"ఆహా!" అని పినతల్లి, ఇవాన్ ఫెయిదొరోవిచ్ వంక సాపేక్షగాచూసింది. ఇవాన్ సిగ్గుపడుతూకిందచూపు బరపాడు. ఆమె మనసులో కొత్త ఆలోచన తళుక్కుమంది. "అయితే చెప్పు"అంది ఆదుర్దాగానూ, కుతూహలంతోనూ."ఆమె కనుబొమలు యెలావున్నాయ్?"

ఆడదాని అందానికి కనుబొమలు చాలా ముఖ్యమని ఆమె అభిప్రాయం.

"ఆమె కనుబొమలు? వయసులో నీ కనుబొమలు వుండేవని చెప్పావే, అచ్చంగా అలాగే వున్నాయి. ఆమె మొహంనిండా చిన్నచిన్న పుట్టుమచ్చలు!"

"ఆహాఁ!" అందామె. ఆ యువతిని మెచ్చుకుంటున్నాననే ఉద్దేశంతో ఇవాన్ అలా చెప్పలేదు. అయినా అంత జాగ్రతగా పరిశీలించినందుకు పినతల్లికి సంతృప్తి కలిగింది. "ఆమె యెటువంటి దుస్తులు వేసుకుంది? యీ గౌనుగుడ్డలాంటిది యీ రోజుల్లో దొరకడం కష్టమేననుకో! కాని అసలు విషయం అదికాదు. సరేగాని, ఆమెతో యేమఁయినా మాట్లాడావా?"

"మాట్లాడడం! యేవిఁటి పిన్నీ నీవుద్దేశం? బహుశా నువ్వు అనుకుంటూండొచ్చు-"

"ఊఁ-అయితేనేం? అందులో విచిత్రం యేంవుంది? అది భగవదేచ్ఛ! అది నీ పెళ్ళామని నువ్వు పుట్టినప్పుడే నొష్టన దేవుడు రాసాడేమో?"

"యిటువంటి మాటలు యెలా అనగలుగుతున్నావో అర్థం కావడంలేదు పిన్నీ! అంటే నువ్వు నన్ను సరిగా అర్థం చేసుకోలేదన్న మాట!"

"ఒహో! కోపంవచ్చిందీ" అనుకుంది. "యింకా చిన్నతనం వదలలేదు. అన్నెమూ పున్నెమూ తెలీదు. యిద్ద రినీ ఒకచోటకు చేర్చాలి. ఒకరి నొకరు అర్థం చేసుకునేటట్లు చేయాలి!"

ఆ తరవాత పినతల్లి వంటింటి పనులు చూడడానికి వెళ్ళింది. ఇవాన్ ఫెయిడొరోవిచ్ ఒంటరిగా ఉండిపోయాడు. ఆనాటినుంచీ, 'ఇవాన్‌కి ఎప్పుడు పెళ్ళి అవుతుందీ, ఎప్పుడు పిల్లల్ని లాలిద్దామా' అని ఆమెకు ఒకటే ఉబలాటం! పెళ్ళి యత్నాల ధ్యాసలో మనసు మునిగిపోయింది. పూర్వాం కంటె హడావిడిగా తిరగసాగింది. భక్ష్యాలు స్వయంగా చేసేది. వంట మనిషిని చేయనిచ్చేది కాదు. తరుచు భక్ష్యాలు వండుతూంటే మనమడు పక్కన నిలబడి పెట్టమని అడుగుతున్నట్టు భావనా ప్రపంచంలో ఊహించుకుని మంచి భక్ష్యం ముక్క అందించడానికి చేయి చాచేది. ఈ అదను కనిపెట్టి ఇంటికుక్క ఆ ముక్కను నోటితో గుంజుకునేది. అది

నమలే చప్పుడుకు ఆమె మళ్ళీ లౌకిక ప్రపంచంలో పడి కుక్కను చావకొట్టేది. అభిమాన మయిన పనులుకూడా మానుకోసాగింది. వేటకు వెళ్లి కౌజుపిట్టకు బదులు కాకిని కూల్చి నప్పటినుంచీ వేటకు వెళ్ళడంకూడా మానుకుంది.

నాలుగు రోజుల తరవాత కొట్టాంలోనుంచి బండి ఆవరణలోకి వచ్చింది. బండి మనిషి ఒమేల్కో ఉదయాన్నుంచీ తోలువేసి కొడుతూ చక్రాలను నాకడానికి వచ్చిన కుక్కలను తోలాడు. ఆదంఎక్కి తిరిగిన బండి ఇదేనని పాఠకులకు తెలియ జేయడం నా విద్యుక్తధర్మం అనుకుంటాను. ఆదం ఎక్కి తిరిగింది ఈ బండికాదు, ఇంకొకటి అని ఎవరయినా అంటే అది పచ్చి అబద్ధం. అతని బండి నికారసయిందికాదు. ప్రళయం నుంచి ఎలా తప్పించుకుందో వేరే చెప్పనవసరం లేదనుకుంటాను. నోవా పడవలో బండికి ప్రత్యేకం కొట్టాం ఏర్పాటయి ఉండిఉంటుంది. పాఠకులకు దాని సజీవచిత్రం కనులకు కట్టేటట్టు చేయలేకపోతున్నందుకు విచారిస్తున్నాను.

ఆ బండి నిర్మాణం వాసిలీనా కాషోవ్కోవ్నాకి సంతృప్తి కలిగించిందని చెపితే చాలుననుకుంటా. పూర్వకాలపు తరహా బళ్ళు నేడు వాడుకలోలేనందుకు ఎపుడూ విచారం వెలిబుచ్చుతూండేది. బండి ఒకపక్క ఎత్తు ఒకపక్క పల్లంగా తయారు చేయబడింది. పొడుగాటివాళ్ళు ఒక పక్కనుంచీ, పొట్టివాళ్లు రెండోపక్కనుంచీ ఎక్కడానికి అనువుగా ఉంటుందని చెపుతూ సంతృప్తి వెల్లడించేది. ఇక బండిలోపల ఒకపాటివారయితే అయిదుగురు, ఆవిడలాంటివారయితే ముగ్గురు కూర్చోడానికి స్థలం ఉంది.

మిట్టమధ్యాహ్నానికి బాడిబాగుచేసి బండికంటె ఎత్తు తక్కువ గుర్రాలు మూడింటిని గుర్రపుశాలలోనుంచి బయటికి తెచ్చి బాడివాడు వాటిని బండికి కట్టసాగాడు. ఇవాన్ ఫెయిడోరోవిచ్, అతని పినతల్లి, ఒకరు ఎడమవేపునుంచీ, ఒకరు కుడివేపునుంచీ ఎక్కి కూర్చున్నారు. బండి బయలు దేరింది. రోడ్డుమీద ఎదురైన రైతులు ఈ విధమయిన మార్పు (ఆమె ఎన్నడూ బండిలో వెళ్ళేదికాదు) చూసి గౌరవంగా టోపీలుతీసి వేసుకుని వంగి నమస్కరించాడు

రెండు గంటలతరవాత బాడి ఆగింది. స్టోర్చెంకో ఇంటిముందు ఆగిందని వేరే చెప్పాలా? గ్రిగొరీ గ్రిగొర్యెవిచ్ ఆ సమయంలో ఇంట్లోలేడు. ఈ ఆగంతకులకు స్వాగత మీయడానికి గ్రిగొరీ తల్లి, చెల్లెళ్ళు భోజనాలగదిలోకి వచ్చారు. ఇవాన్ పినతల్లి దర్జాగా అడుగులు వేసుకుంటూ గదిలోకి ప్రవేశించి బహునేర్పుగా ఒకపాదం ముందుకుపెట్టి బిగ్గరగా అంది:

"స్వయంగా వచ్చి మిమ్మల్ని దర్శించుకోగలిగినందుకు చాలా సంతోషంగా వుంది. మా అబ్బాయికి మీరిచ్చిన ఆతిథ్యానికి కృతజ్ఞత చూపే అవకాశంకూడా యీ విధంగా కలిగింది. మావాడు మీరిచ్చిన ఆతిథ్యాన్ని యెంతో పొగిడా డనుకున్నారు! మీ తోకగోధుమబలేబావుంది. వూళ్ళో వస్తూ చూసాను. యెన్ని కట్టలయితే డెసియాటిన్ అవు తుంది?"

ఆ తరవాత ఒకరునొకరు ముద్దిడుకున్నారు. అంతా కచేరి గదిలో కూర్చోగానే ఆ వృద్ధురాలు, "ఆతోకగోధుమ

గురించే నాకేం తెలీదు. అదంతా గ్రిగోరీ చూసుకుంటు న్నాడు. దాని విషయం నేను చాలాకాలం కితమే వదిలే సాను. పెద్దదాన్నయిపోయాను. యిక నేను చేయలేను. వెన కటి రోజుల్లో తోకగోధుమ నిలువెత్తు పెరిగేది. యిప్పుడు పూర్వంకంటే బావుందంటారుగాని, యేం బాగో?" అంది. అలా అని నిట్టూర్చింది. జాగ్రతగా పరిశీలిస్తే ఆ నిట్టూర్పు గతకాలపు అంటేపద్దెనిమిదోశతాబ్దపు నిట్టూర్పులాతోస్తుంది.

"మీ దాసీకన్యలు తివాసీలు బహుపసందుగా తయారు చేయగలరని విన్నాను?" అంది వాసిలీనా కాష్టారోవ్నా, ఇలాఅని వృద్ధురాలి మనసును చూరగొన్నది. దీంతో ఆ వృద్ధురాలి మొహం వికసించింది. నూలుకు ఎలా రంగు వేయాలో, దారం ఎలా తయారుచేయాలో చెప్పసాగింది.

తివాసీలనుంచి సంభాషణ దోసకాయ ఊరవేయడం మీదికి, బేరిపళ్లు వరుగుచేయడం మీదికి మళ్లింది. క్లుప్తంలో చెప్పాలంటే ఒక గంటసేపటికల్లా పుట్టినప్పటినుంచీ ఒకరి నొకరు బాగా ఎరిగున్నవారిలాగా మాటాడుకోసాగారు. వాసి లీనా కాష్టారోవ్నా చాలా తగ్గుస్థాయిలో మాటాడిందేమో ఏమి మాటాడిందీ ఇవాన్ ఫెయిడోరోవిచ్‌కి వినిపించలేదు.

"ఆఁ-వాటిని చూడాలని లేదూ?" అందా వృద్ధు రాలు లేచి నిలబడుతూ

ఆ యువతు లిద్దరూ, వాసిలీనా కాష్పోరోవ్నా కూడా లేచి దాసీల గదివైపు బయలుదేరారు. వెళుతూ, ఇవాన్ ఫెయిడోరోవిచ్‌కి పినతల్లి అక్కడే ఉండిపొమ్మని సైగచేసి ఆ వృద్ధురాలితో తగ్గుస్థాయిలో ఏదో చెప్పింది.

"మాషెంకా!" అందా ముసలమ్మ చక్కటి జుట్టు యువతిని సంబోధిస్తూ "యిక్కడేవుండి, వీరికి విసుగు పుట్ట కుండా పిచ్చాపాటి మాట్లాడు."

చక్కని జుట్టు యువతి సోఫామీద కూర్చుంది. ఇవాన్ ఫెయిడోరోవిచ్ ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చు న్నాడు. సిగ్గుతో చూపు కిందకు దిగింది. కాని ఆ యువతి ఇదేమీ గమనించినట్టులేదు. ఏమీ పట్టనట్టు సోఫాలో కూర్చుని కిటికీలు గోడలు సూక్ష్మంగా పరిశీలించింది. కుర్చీల కింద పిల్లి భయపడుతూ భయపడుతూ అటూ ఇటూ తిరగడం కనిపెట్టి చూడ సాగింది.

ఇవాన్ ఫెయిడోరోవిచ్ ధైర్యం తెచ్చుకుని సంభా షణకు ఉపక్రమించేవాడే గాని మాటలు దారిలో జారి పోయినట్లనిపించింది. ఏం మాట్లాడాలో తోచలేదు.

ఈవిధంగా పావుగంటసేపు మౌనంగా గడిచింది. ఆ యువతి యథాప్రకారం సోఫాలో కూర్చునే ఉంది.

చివరికి ఇవాన్ ఫెయిడోరోవిచ్ ధైర్యం తెచ్చుకుని, "వేసవిలో యెన్ని యీగలని!" అన్నాడు. స్వరం కంపిం చింది.

"ఓ – కాసినీ కూసినీనా, బోలెడు!" అని జవాబి చ్చిందా యువతి. "అమ్మయ్యో పాత చెప్పుతో అన్నయ్య యీగల్ని చంపే అట్ట తయారు చేసాడు. అయినా యెక్కడా తరగడంలేదు.

ఆపైన సంభాషణ సాగలేదు. ఇవాన్ ఫెయిడోరో విచ్ ఇంకేం మాటాడాలో బొత్తిగా తోచలేదు.

ఆ వృద్ధురాలు, అతని మేనత్త, నల్లజుట్టు యువతి తిరిగి వచ్చారు. ఇంకా కొంచెం సంభాషణ జరిగిన తరవాత రాత్రికి ఉండిపొమ్మని వాసిలీనాని ఆ వృద్ధురాలు బ్రతిమాలింది. కాని వాసిలీనా ఉండడానికి వీలులేదని చెప్పి సెలవు తీసుకుంది. సాగనంపడానికి ముగ్గురు ఆడంగులూ మెట్ల మీదకు వచ్చారు. ఇవాన్, అతని మేనత్త బండిలో ఎక్కి కూర్చున్నారు. ఆ ముగ్గురు వారివంక కొంతసేపు తల పంకించి సాగనంపారు.

"సరేగాని, యివాన్, ఆ అమ్మాయితో ఒంటిరిగా వున్నపుడు యేం మాటాడావ్?" అని పినతల్లి దోవలో అడిగింది.

"మేరియా గ్రిగొర్యెవ్నా, చాలా తెలివిగలది, మర్యాదస్తురాలు." అన్నాడు ఇవాన్ ఫెయిడొరోవిచ్.

"సరే విను ఇవాన్! నీతో గట్టిగానే మాటాడ దలచాను. నీకు ముప్ఫయియేడేళ్ళు వచ్చాయి. పెద్ద ఉద్యోగం చేశావ్. యిక పిల్లల విషయం ఆలోచించే సమయం వచ్చింది. నువు పెళ్ళి చేసుకోవాలి."

"యేమిఁటి పిన్నీ!" అని అరిచాడు ఇవాన్ భయంతో. "పెళ్ళి? ఊహుఁ – సిగ్గుపడేట్టు చేస్తున్నావు. నాకు పెళ్ళి కాకపోతేనేం?"

"నీకే తెలిసొస్తుంది, యివాన్, తెలిసొస్తుంది." అంది పినతల్లి మందహాసంచేస్తూ." వట్టి చంటిపిల్లాడు. యేమీ తెలీదు, పాపం!" అని తనలోతాను అనుకుంది. "అవును యివాన్," అంటూ కొనసాగించింది బిగ్గరగా. "మేర్యా

గ్రిగోర్యెవిచ్ కంటెమంచిపెళ్ళాం దొరకుతుందనుకోను. పైగా నీ మనసు ఆమెమీద లగ్నమయింది కూడా. ఆ ముసిలి దాంతో యీ విషయం చాలా సేపు మాట్లాడాను. నువ్వు అల్లుడి వయితే ఆమె వుప్పొంగిపోతుంది ఆ దుర్మార్గపు వెధవ గ్రిగొరి గ్రిగొర్యెవిచ్ యిందుకు యేమంటాడో తెలీదు. కాని వాడి మాటకేం! కట్నం యివ్వనంటే వ్యాజ్యంవేసి మరీ పుచ్చుకుందాం.''

బండి వారి ఇంటిఆవరణంలోకి ప్రవేశించింది, శాలకి చేరుకున్నామని ఆ ముసిలి గుర్రాలు చురుకు వహించాయి.

"ఒమెల్కో! ముందు గుర్రాలకి బాగా విశ్రాంతి యివ్వు. వూడదీసీ వూడదీయగానే నీళ్ళు పెట్టేవుసుమా! వుడికెత్తిపోయి వున్నాయి,''

"సరేగాని, యివాన్'' అంది బండిదిగుతూ "బాగా ఆలోచించుకో. వంటింటోకి నేను తొందరగా వెళ్ళాలి. భోజనానికి యేం వండాల్సిందీ సాలోఖాకి చెప్పడం మర్చిపోయాను. దాందుంపతెగ! దానంతటదే యేమీ ఆలోచించి చేసిచావదు!''

ఇవాన్ నివ్వెరపోయి అలానే నిలబడ్డాడు. మేర్యా గ్రిగొర్యెవిచ్ మంచి అందమయింది. నిజమే. కాని పెళ్ళి చేసుకోవడం! పెళ్ళి చాలా విచిత్రంగా, కొత్తగా కనిపించింది. అసహ్యం వేసింది. పెళ్ళాంతో కాపరం! ఊహింపరాని విషయం! ఆ తరవాత గదిలో ఒంటరిగా ఉండడానికి వీలు లేదు. ఇద్దరూ ఉండవలసిందే! ఆలోచనలో పూర్తిగా మునిగి పోయాడు. మొహంమీద చెమటపోసింది.

మామూలుకన్న పెందలాడే వెళ్ళి పడుకున్నాడు. ఎంత కొట్టుకున్నా నిద్రపట్టలేదు. చివరికి ఎలాగయితేనేం సమస్త మానవకోటికీ శాంతి ప్రసాదించే నిద్రాదేవత ఆవహించింది. కాని ఏం నిద్ర! ఎన్నడూ అంత అసంబద్ధమయిన కలలురాలేదు. ప్రతిదీ ధ్వనిచేసుకుంటూ తన చుట్టూ గిర్రున తిరుగుతున్నట్లు ముందుగా కలవచ్చింది. పిక్కబలం అంతా చూపుతూ పరుగెత్తాడు. దమ్ము ఆఖరుకావచ్చింది. హఠాత్తుగా ఎవరో అతని చెవి పట్టుకున్నారు. "ఆచ్! మెవరువారు?"

"నేనూ, నీ, భార్యని!" అని ఒక గొంతు బిగ్గరగా అతని చెవిలో మారుమోగింది. మెలకువ వచ్చింది. తనకు పెళ్ళి అయినట్టు, చిన్న ఇంటో ప్రతీదీ ఎంతో విచిత్రంగా, కొత్తగా ఉన్నట్టు, ఒకరికి సరిపోయే మంచం బదులు ఇద్దరికి సరిపోయేది గదిలో ఉన్నట్టు, ఊహించుకున్నాడు. అతని భార్యా కుర్చీమీద కూర్చుని ఉంది. అతనికి అంతా విపరీతంగా తోచింది. ఆమె దగ్గరకు ఎలా వెళ్ళాలో, ఏమి మాట్లాడాలో తోచలేదు. ఆమె మొహం బాతు మొహంలా ఉండడం గమనించాడు. యాదృచ్ఛికంగా పక్కకు తిరిగాడు. ఆ పక్కన ఇంకో బాతు మొహం భార్య కనిపించింది. ఇంకోవైపుకు తిరిగాడు. ఇంకో భార్య కనిపించింది. వెనక ఇంకో భార్య! భయంవేసిపోయింది. తోటలోకి ఉరుకుతుంటూ వెళ్ళాడు. అక్కడ వేంద్రంగా ఉంది. హాటు తీసివేసుకున్నాడు. హాటులో ఇంకో భార్య కూర్చుని ఉంది! మొహం మీద చెమటపోసింది. జేబు

రుమాలు కోసం జేబులో చేయిపెట్టుకున్నాడు. అక్కడా భార్యే ఉంది! చెవిలోనుంచి దూది తీసాడు. అక్కడా భార్య కూర్చుని ఉంది. తరవాత హఠాత్తుగా ఒంటికాలి మీద ఎగరసాగాడు. అతని పినతల్లి చూసి దర్జాగా, "అవును. యిక ఒంటికాలి మీద యెగరవలసిందే, పెళ్ళి అయింది కదూ!" అంది. ఆమె వేపు బయలుదేరాడు. కాని అతని పినతల్లిగా కనిపించలేదు గంటల గోపురంలాగా కని పించింది. ఎవరో తనను తాడుతో గోపురం మీదుగా లాగు తున్నట్టు అనిపించింది, "యెవరు నన్ను లాగుతున్నది?" అని ఇవాన్ ఫెయిడోరోవిచ్ అడిగాడు ఏడుపుకంఠంతో. "నేను, నీ భార్యని! నువు గంటవి. అందుకే నిన్ను లాగు తున్నా." "నేను గంటను కాను. నేను ఇవాన్ ఫెయిడోరో విచ్ ని." "అవును. నువు గంటవే!" అన్నాడు ఆ దారిన పోయే పదాతిదళ కలనల్. హఠాత్తుగా భార్య మనిషి కాదనీ ఒక రకమయిన ఉన్నివస్తువనీ కలవచ్చింది. కలలో అతను మోగిల్యూవ్ లోని ఒక దుకాణంలోకి వెళ్ళాడు. "నీకు యే రకం కావాలి?" అని దుకాణదారు అడిగాడు. "భార్యని తీసుకో. యీ రోజుల్లో, యెక్కువ వాడుకలో వున్నదదే. బాగా మన్నుతుంది. ప్రతివాడూ దాంతో కోట్లు కుట్టించు కున్నాడు" దుకాణాదారు కొలిచి ఒక భార్యని చింపి ఇచ్చాడు. ఇవాన్ ఫెయిడోరోవిచ్ ఆమెను చంకకింద పెట్టు కుని ఒక యూదు దర్జీ దగ్గరకు వెళ్ళాడు. "ఉహుం—" అన్నాడు యూదు. యిది మంచిరకం కాదు. దీంతో యిపుడు యెవరూ కోట్లు కుట్టించుకోవడంలేదు."

మహాభయంవేసి ఇవాన్ నిద్రమేలుకొన్నాడు. ఎక్కడ ఉన్నదీ తెలియలేదు. చల్లటి చెమటలో మునిగిపోయాడు.

ఉదయం మేలుకోగానే జ్యోతిష గ్రంథం తీసాడు. దానిచివర ఒకమంచి పుస్తక విక్రేత సంక్షిప్త స్వప్నశాస్త్రం చేర్చాడు. ఈ అసంబద్ధ స్వప్నాన్ని పోలినది అందులో ఎక్కడా కనిపించలేదు.

ఈ లోపున అతని మేనత్త మనసులో కొత్త ఎత్తు రూపొందింది. తరవాత అధ్యాయంలో దాని గురించి ఇంకా మీరు వింటారు.



# దెయ్యాలతో పు

## బాండారి చెప్పిన యధార్థ గాథ

ఏ ఒట్టుబడితే ఆ ఒట్టు! కథలు చెప్పీ చెప్పీ నాకు విసుగత్తిపోయింది! అవును విసిగత్తకేం జేస్తుంది? నిజంగా విసుగే. కథతరవాత కథ ఆదేపనిగా చెప్పుకుపోవడం! బయటపడేమార్గంలేదు. సరే, కానీండి కథచెప్తాను. కాకపోతే ఇదే ఆఖరిసారి. జ్ఞాపకం ఉంచుకోండి. మనిషికి దెయ్యాన్ని లొంగదీసుకునేశక్తినిగురించి మాటాడుకుంటున్నాం గదూ? ఆ మాటకొస్తే ప్రపంచంలో రకరకాల విషయాలు జరుగుతూంటాయి. అలా చెప్పడంకూడా మంచిదికాదు. దెయ్యమే గనక మనిషిని వంచించదలిస్తే వంచించి తీరుతుంది—

చూచారూ, మా నాన్నకి మేం నలుగురం సంతానం. అప్పుడు నేను ఏదో చిన్న పిల్లవాడిని. పదకొండు ఏళ్ళు నిండాయో లేదో! నాకు బాగా జ్ఞాపకం, ఇవాళ జరిగినట్లే అనిపిస్తోంది. కుక్కలాగా నాలుగు కాళ్ళతో పరుగెత్తుతూ నేను అరుస్తూంటే మా నాన్న కేకలువేస్తూ, తల ఆడిస్తూ అన్నాడు: "చూడు, ఫోమా! నీకు పెళ్ళి యీడొచ్చింది. కాని యింకా జ్ఞానం రాలేదు." మా తాత అప్పటికి ఇంకా బతికే ఉన్నాడు. పరలోకంలోనయినా ఆయన ఎక్కిళ్ళు

ఉపశమించుగాక! బలంగానే ఉన్నాడు. మధ్య మధ్య ఏదో భ్రమపడుతూండేవాడు.

కాని కథచెప్పే క్రమం ఇది కాదనుకుంటూ? గంట సేపటినుంచీ చూస్తున్నా. ఒకరు పైపులో వేసుకోడానికి స్టోవ్‌లో నిప్పు కదుపుతున్నారు. ఇంకొకరు ఎందుకో ధాన్యపు కొట్ల వెనకకు వెళ్ళారు. ఏమిటిదంతా? కథ చెపుతా వినమని మిమ్మల్ని నేనేం బలవంతం చేసానా? మీ అంతట మీరేగా కథ చెప్పమని పట్టుపడితిరి! మీకు వినాలని ఉంటే సరిగా వినండి

వసంతరుతువు ప్రారంభంలో మా నాన్న క్రిమియాలో అమ్మడానికని పుగాకు బళ్ళమీదికి ఎక్కించాడు. రెండుబళ్ళో మూడుబళ్ళో నాకు జ్ఞాపకంలేదు. ఆరోజుల్లో పుగాకుకు మంచిధర వచ్చేది. మా తమ్ముడు మూడేళ్ళవాడిని వ్యాపారం నేర్పడానికని కూడా తీసుకువెళ్ళాడు. మా తాత, మా అమ్మా, నేను, ఇద్దరు తమ్ముళ్ళు ఇంటిదగ్గర ఉండి పోయాం. రోడ్డుపక్కన ఒక చెక్కలో మా తాత ఖర్బూజా పెట్టాడు. అందుకని అక్కడి గుడిసెలో ఉండడానికి వెళ్ళి పోయాడు. తోటలోకి రాకుండా పిచ్చుకలను, కొండకాటి పక్షులను పారదోలడానికి కూడా మమ్మల్ని తీసుకు వెళ్ళాడు. అందువల్ల మాకేంలోటురాలేదు. పైగా దోసకాయలు, ఖర్బూజాపళ్ళు, దుంపలు, ఉల్లిపాయలు, బటాణీలు తినగా తినగా కడుపుల్లో కోళ్ళు కూస్తున్నట్లుండేది. అంతేగాదు తోట లాభదాయకంగాకూడా ఉండేది. రోడ్డుమీద ప్రయాణం చేసేవాళ్ళు ఖర్బూజాలు తినాలని ఉబలాటపడే

వారు. పక్క పొలాలలోనుంచి కోళ్ళు, సీమకోళ్ళు, కోడి గుడ్లులు తెచ్చి ఇచ్చి మా తోటలో కూరలు తీసుకుపోతుండే వారు. మా పని బాగానే ఉంది.

మా తాతకి వీటన్నింటికంటె ఇష్టమయింది దేనితో తెలుసా? ప్రతిరోజూ యాత్రయిమంది బళ్ళు కట్టుకుని ఆ దోవంటే వెళ్ళేవారు. వాళ్ళు ప్రపంచాన్ని చూసిన బాపతు. కథ చెప్పడం మొదలుపెడితే చెవులు దోరచేసుకుని వినవల సిందే! మా తాతకి ఆ కథలు ఆకలి గొన్నవాడికి పప్పులు లాగా ఉండేవి. ఒకొకప్పుడు చిరపరిచయస్తులు కలిసేవారు. మా తాతను అంతా ఎరుగున్నారు. ముసిలివాళ్ళు కలుసు కుంటే ఎలా ఉంటుందో మీకు తెలిసిందేగా! పిచ్చాపాటీ మాటాడుకుంటారు. బాతాఖానీ సాగుతూనే ఉంటుంది. ఎప్పు డెపుడో జరిగిన విషయాలుకూడా జ్ఞాపకం తెచ్చుకుంటారు.

ఒకనాటి సాయంకాలం – ఇవాళ జరిగినట్టేఉంది – సూర్యాస్తమానం అవుతోంది. మా తాతతోటలో తిరుగుతూ ఎండకు కమిలిపోకుండా ఖర్బుజాలమీద కప్పిన ఆకులు తీసి వేస్తున్నాడు

"చూడు, ఒస్టాప్!" అన్నాను నా తమ్ముడితో "బళ్లవాళ్ళు వస్తున్నట్టున్నారు."

"బళ్ళవారేరీ?" అని అడిగాడు తాత, పిల్లలు తిన కుండా పెద్ద ఖర్బూజాపండు ఒకదానిమీద గుర్తుపెడుతూ.

రోడ్డువెంట ఆరుగురు బండివాళ్ళు కాళ్ళీడ్చుకుంటూ వస్తున్నారు. అందులో ఒకతను, మీసాలు నెరిసాయి, అంద

రికి ముందుండి నడిచివస్తున్నాడు. పది అడుగుల దూరంలో టపీమని ఆగిపోయాడు.

"నమస్కారం, మాక్జిమ్! యిక్కడ మనం కలుసుకోవాలని భగవంతుడి సంకల్పం అయివుంటుంది!"

మా తాతకళ్ళు కుంచించుకుని చూసి "ఓ సమస్కారం! యెక్కడనించి రావడం? అరె. బొల్యాచ్కా కూడా వచ్చాడే! నమస్కారం భాయీ! అరె: అంతా యిక్కడికే వచ్చారె! క్రుటో|ట్రిషెంకో, పెచిరిస్ట్యా, కొవెలెక్, స్టెటోస్కా! నమస్కారం, నమస్కారం!" ఒకరినొకరు ముద్దిడుకున్నారు.

ఎద్దులను ఊడదీసి మేయడానికి వదిలేసారు బళ్లు రోడ్డు మీద వదిలివేసి గుడిసెముందు వలయాకారంగా కూర్చుని పైపులు వెలిగించారు వారిమనసు పైపులమీదేం లేదు. కథలు చెప్పుకుంటూ, పిచ్చాపాటీ మాటాడుకుంటూ పైపు పూర్తిగా తాగారని నమ్మలేం.

భోజనాల అనంతరం తాతయ్య వాళ్లందరికీ ఖర్బూజాలుపెట్టి ఉత్సాహం కలిగించాడు. ఒక్కొక్కరు ఒకొక్క ఖర్బూజాపండు తీసుకుని చాకుతో చక్కగా తోలు తీశారు. (అందరూ ఆరితేరిన ఘటాలే, దేశాలు తిరిగినవారే. నలుగురిలో ఎలా తిరగాలో వారికి తెలుసు. గొప్పవాళ్ల సరసన కూర్చుని తినడానికి వారు సిద్ధమే.) ఖర్బూజాపళ్లు చక్కగా ఒలిచి, వేలితో దానికి కన్నం పొడిచి రసం తాగారు. ఆ తరవాత ముక్కలు ముక్కలుచేసి తిన్నారు.

"అలా నోళ్ళు తెరుచుకుని చూస్తూ నిలబడ్డారేం, కుర్రాళ్లు!" అన్నాడు మా తాత. "నాట్యం చేయండి! ఒస్టాప్, నీ వెదురు పిల్లంగోవి యేదీ? సరే, కోసక్ నాట్యం చేయండి! ఫోమా చేతులు నడుంమీద పెట్టుకో! ఊఁ - ఆఁ- అదిగదీ! కానీ డి!"

ఆరోజుల్లో నేను మహాచురుకుగా ఉండేవాడిని. వెధవ ముసిలితనం! యిప్పుడు యిదివరంలోలాగా అడుగు వేయలేను. చిందు వేయబోతే నాకాళ్ళు జారిపోతాయి. తాళం తప్పు తుంది. బళ్ళవాళ్ళతో కూర్చుని మా తాత చాలాసేపు మా నాట్యం చూసాడు. ఆయనగారి కాళ్ళు కదులుతూండడం నేను గమనించాను. ఏదో వాటిని పట్టుకుని లాగుతున్నట్లుంది.

"చూడు ఫోమా!" అన్నాడు ఒస్టాప్.

"ముసిలాయననాట్యంచేయడం మొదలట్టేట్టున్నాడు."

ఈమాటలు అన్నాడో లేదో ముసిలాయన ఇక ఆగ లేకపోయాడు. బళ్ళవాళ్ళకు నాట్యంచేసి చూపెట్టాలని ఆయన గారి కోరిక.

"యిలాగేనా నాట్యం చేయడం! కుర్రకుంకలు! నాట్యం చేయడం యిలాగూ!" అంటూ మా తాత లేచి చేతులుజోడించుకుని మడమలతో చిందులువేయసాగాడు.

సేనాధిపతి భార్యతో నాట్యం చేసినా అంతకంటె బాగా చేసేవాడు కాదనేది నిర్వివాదాంశం. పక్కకు అడుగు వేసాడు. దోసపాదుల పక్కన నున్నటి నేలమీద గిరగిరా తిరగసాగాడు. మధ్యకువెళ్ళి సుడిగుండంలా తిరుగుతూ

తన శక్తి అంతా చూపెట్టాలని యత్నించాడుగాని ఎంత కొట్టుకున్నా పాదాలు నేలమీదనుంచి పైకి లేవలేదు. ఛీ! ముందుకూ వెనకకూ తిరిగాడు. మళ్ళీ మధ్యకు వెళ్ళాడు. ఊఁ- లాభంలేదు. కొయ్యతో చేసినట్లు కాళ్ళు కదలందే! "చూడండి, యిక్కడెవరో చెల్లించి పెట్టారు. యిది దెయ్యాల తోపు! మానవజాతికి శత్రువయిన హెరోడ్‌కు యిందులో యేదో సంబంధం వుంది" అన్నాడు.

బళ్ళవాళ్ళముందు ఇట్టి అవమానం జరిగితే భరించ గలడా! ఉహుఁ- మళ్ళీ చిందులుతొక్కడం ప్రారంభించాడు. కనులపండువుగా ఉంది మళ్ళీ మధ్యకు వెళ్ళాడు. కాళ్లు ఆడలేదు. నాట్యం చేయలేకపోయాడు.

"ఛీ! వెధవ సైతాన్! కుళ్ళిపోయిన ఖర్బుజాపండు నీ గొంతుక్కి అడ్డుపడిచావా! పుట్టినపుడే నువుగిట్టివుంటే పీడా వదిలేది! యీ వృద్ధాప్యంలో నన్నింత అవమానంపాలు చేస్తావా!" ఎవరో వెనకనుంచి పక్కున నవ్వారు. నిజం!

చుట్టూ చూసాడు. ఖర్బుజా తోట కనిపించలేదు. బళ్ళవాళ్ళు లేరు. ఏమీలేదు! వెనకా, ముందూ, ఇరు ప్రక్కలా చదునయిన భూమి పొడగట్టింది. "అరె! యెన్నడూ!" అంటూ ప్రారంభించాడు కళ్ళు కుంచించు కుంటూ. ఆ ప్రదేశం అపరిచితమయిందిగా లేదు. ఒకవైపు చిట్టడవి. చిట్టడవి వెనక ఆకాశంలోకి పొడుచుకుని ఒక విధ మయిన స్తంభం, దాన్ని తగలెయ్య! అది ఫాదరీ ఇంటి పెరడులోని పావురాల గూడు! అవతలవైపున ఏదో బూడిద రంగుది కనిపించింది. పరీక్షగా చూసాడు. అది జిల్లా

గుమాస్తా దంపుడుకొట్టు. అక్కడికా ఆదయ్యం ఈప్పుకు వెళ్ళింది! గిరున తిరుగుతూంటే చిన్న బాట తగిలింది. చంద్రుడు ప్రకాశించడంలేదు. చంద్రునికి బదులు కాసు మేఘం గుండా తెల్లటి చుక్క తళతళా మెరుస్తోంది.

"రేపు పెద్దగాలి వీస్తుంది" అనుకున్నాడు మా తాత. హఠాత్తుగా ఆ బాటకు కొద్ది దూరంలోని ఒక గోరీమీద కొవ్వొత్తి వెలిగింది." సరే, సరే!" మా తాత కదలకుండా నిలబడి, నడుం మీద చేతులు వేసుకుని, దానివంక తేరి పారజూసాడు. కొవ్వొత్తి ఆరిపోయింది. దూరాన ఇంకొకటి మినుకు మినుకుమంది. "నిధి!" అని అరిచాడు మా తాత. "అది నిధే, సందేహం లేదు. యేం పందెం పడితే ఆ పందెం!" తవ్వడానికని చేతిమీద ముందుగా ఉమ్మి వేసుకొనే వాడేగాని పారలేదని జ్ఞాపకం వచ్చింది. "ఆరే యేం ఖర్మం! పైపైన కాస్త చెక్కితే చిక్కేదేమా! సరే, యింతకి చేసేదేవుంది! మర్చిపోకుండా గుర్తు పెడతాను."

గాలికి విరిగి పడిన చెట్టుకొమ్మ ఒకటి పెద్దది లాగి కొవ్వొత్తి వెలిగిన గోరీ మీద పెట్టి ఆ బాటవెంబడే బయలుదేరాడు. సిందూరపు అడివి పల్చబడింది. కోరడి పొడగట్టింది. "అది గదీ, యిది ఫాదర్ పెరడు అని వేరే చెప్పాలా!"అనుకున్నాడు తాత. "యిదిగో కోరడి, ఖర్బుజా మడికివెళ్ళు దూరం కూడా లేదు."

ఇంటికి తిరిగి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది. బోండాలు తినలేదు. మా తమ్ముడు ఒస్టాపీని లేపి 'బళ్ళ

వాళ్లు వెళ్ళి చాలాసేపయిందా!' అని అడిగి గొర్రె చర్మంలో దూరి పడుకున్నాడు: ఒస్టాప్ అడిగాడు: "నే దెయ్యమన్నా పట్టి అట్టే పెట్టిందా యేం నిన్ను!" "ఆ విష యమేం అడగొద్దు" అని జవాబిచ్చాడు మా తాత గొర్రె చర్మం ఇంకా దగ్గరకు లాక్కుంటూ. "అడగద్దు. జవాబు చెప్పానా భయంతో నీ జుట్టు నెరిసిపోతుంది."

బిగ్గరగా గురక సాగించాడేమో, ఆ గురకకు ఖర్బుజా మడిమీదవాలే పిచ్చుకలు చెదిరి చెల్లాచెదరయ్యాయి. కాని నిద్ర ఏలాపడుతుంది ? మా తాత వట్టి జిత్తులమారి – ఆయన గారి ఆత్మకు శాంతి కలుగుగాక !– ఎంతటి చిక్కులోనుంచి అయినా ఇట్టే బయట పడగలడు. ఒకొక్కప్పుడు ఆయనగారు తీసేదారం చూస్తే శరీరం పులకరిస్తుంది.

మర్నాడు చీకటి పడీపడగానే మా తాత చొక్కా తొడుక్కుని. పటకా నడుముకు బిగించుకుని, పార చంకలో పెట్టుకుని, టోపీ పెట్టుకుని, బియ్యపు సారా ఒక ముంతెడు తాగి, చొక్కా అంచుతో మూతి తుడుచుకుని ఫాదరీ పెరడుకు బయలుదేరాడు. కోరడిని, సిందూరపు అడవిని దాటాడు. చెట్లమధ్యగా ఆరుబయటికి ఒకబాట వెళ్ళడం కనిపించింది. సరిగ్గా ఆలాగేఉంది. చిట్టడవి దాటాడు. ఆప్రదేశం అచ్చంగా నిన్నటిలాగానే ఉంది. పావురాల గూడు కనిపించింది. కాని దంపుడుకొట్టు కనిపించలేదు. "ఊహుఁ– ఆ స్థలంకాదు. యింకాకొంచెం ముందువుండి వుంటుంది. దంపుడుకొట్టువేపుకు కొద్దిగా తిరగాలనుకుంటూ" వెనకకు తిరిగి ఇంకోబాటవెంట నడిచాడు. దంపుడుకొట్టు కనిపించిందిగాని పావురాలగూడు

కనిపించలేదు. మళ్ళీ వెనకకు తిరిగాడు. పావురాల గూటికి దగ్గరగా ధాన్యపుకొట్టు మసుగ్గుపడి ఉంది.

కసి తీర్చుకోవడానికా అన్నట్లు వాన చినుకులు పడ సాగాయి దంపుడుకొట్టుకేసి మళ్ళీ పరుగెత్తాడు. పావురాల గూడు మాయమయింది. పావురాలగూడువైపు పరుగెత్తాడు. దంపుడుకొట్టు మాయమయింది.

"వెధవ సైతాన్! నీ పిండంపెట్టు!" అని అరిచాడు.

కుంభవృష్టిగా వాన కురుస్తోంది. అందుకని కాలికిఉన్న కొత్తబూట్లు ఊడదీసి తడిసిపోకుండా జేబురుమాలులో మూటగట్టి పందెపు గుర్రంలాగా పరుగుచ్చుకున్నాడు. ఆపాదమస్తకం తడిసిపోయి గుడిసెలోదూరాడు. గొర్రెచర్మం కప్పుకుని గొణుక్కుంటూ నానాతిట్లూ దెయ్యాన్ని దిట్టాడు. అటువంటి తిట్లు నా జన్మలో ఎన్నడూ నేను వినలేదు. ఇదంతా పట్టపగలే గనక జరిగిఉంటే సిగ్గుతో తల వంచుకునేవాడిని.

మర్నాడు ఉదయం నేను నిద్రలేచేసరికి మా తాత ఏమీ జరగనట్టు ఖర్బూజా మడిలో తిరుగుతూ వాటిమీద ఆకులు కప్పుతున్నాడు. మధ్యాహ్నం భోజన సమయంలో మా తాత బాతాఖానీ మొదలుపెట్టాడు. ఖర్బూజాపండు ఇచ్చి కోడిని తీసుకునేబదులు నిన్నిచ్చి తీసుకుంటాానని మా తమ్ముడు ఒస్టాప్‌ని జడిపించాడు. భోజనాలయాక పిల్లం గ్రోవి తయారుచేసి ఊదాడు. మమ్మల్ని సంతోషపెట్టడానికి పాములాగా మూడు మెలికలు తిరిగిన ఖర్బూజాపండు మాకు ఇచ్చి అది టర్కీదని చెప్పాడు. అటువంటి ఖర్బూజాపండు

ఈ రోజుల్లో కావాలన్నా దొరకదు. ఎక్కడో దూరప్రదేశం నుంచి తెప్పించాడు.

సాయంకాలం భోజనంచేసి మా తాత ఆలస్యంగాకాచే గుమ్మడికి పాదు తవ్వడానికని పార తీసుకుని బయలుదేరాడు. ఆ దెయ్యాల తోపును దాటుతూ, "వెధవ స్థలం!" అని తిట్టకుండా ఉండలేకపోయాడు. ఆ స్థలంమధ్యకు అంటే నిన్న నాట్యం చేయలేకపోయిన చోటుకు వెళ్ళి కోపంకొద్దీ పారతో ఒక్కదెబ్బ కొట్టాడు. మెరుపు మెరిసినంతలో చుట్టూ వెన కటి ప్రదేశం కానవచ్చింది. ఒకవైపున పావురాల గూడు, రెండోవైపున దంపుడుకొట్టు! "పార తేవడం మంచిదే అయింది. అదిగో బాట, అదిగో గోరీ. అదిగో గోరీమీద కొమ్ము, అల్లదిగో కొవ్వొత్తి, నేను పొరబడలేదుగదా?"

ఖర్బూజా మడిలోకి ముట్టెపెట్టిన పందిని కొట్టడానికా అన్నట్లు పార పైకెత్తి దొంగచాటుగా పరుగెత్తి గోరీ ముందు ఆగాడు. కొవ్వొత్తి ఆరిపోయింది.

"ఆ రాతిని పైకి యెత్తాలి" అనుకుని మా తాత దానిచుట్టూ తవ్వాలని యత్నించాడు. ఆ వెధవరాయి పెద్దది. నేలమీద పాదాలు గట్టిగామోపి గోరీ మీదనుంచి ఆ రాతిని తోసివేసాడు.

"ఓఓ" ఆ లోయంతా ప్రతిధ్వనించింది. "ఆ దారే నువు పట్టవలసింది. యిక పని చురుకుగా సాగిపోతుంది!"

మా తాత ఆగి, కొమ్ము బయటికి తీసి, చేతిలో కాస్త నశ్యం వేసుకుని ముక్కుదగ్గర పెట్టుకోబోయాడు. ఇంతలో హఠాత్తుగా అతని నెత్తిమీద తుమ్ము వినిపించింది. ఆ

తుమ్మికు చెట్లు అల్లల్లాడాయి. మా తాత మొహం మీద తుంపరలు పడ్డాయి.

"తుమ్మ వస్తే పక్కకి తిరిగి తుమ్మద్దూ!" అన్నాడు మాతాత కళ్ళు తుడుచుకుంటూ. చుట్టూ చూసాడు. ఎవరూ లేరు. "దెయ్యానికి నశ్యం సరిపడ్డట్టులేదు" అనుకున్నాడు కొమ్ము చొక్కాజేబులో పెట్టుకుని పార తీసుకుంటూ. "వట్టి దద్దమ్మ! వాడి అబ్బ, తాత యిలాంటి నశ్యం చిటికెడయినా పీల్చిచూస్తేగా!"

తవ్వనారంభించాడు. నేల మెత్తగా ఉంది. పార ఇట్టే దిగింది. ఖంగుమని చప్పుడయింది. మట్టి పక్కకు తోసివేయగానే కాగు కనిపించింది.

"ఆఁ- యిక్కడే వున్నావా!"అంటూ మాతాత దాని కిందకు పారపోనిచ్చాడు.

"అఁ యిక్కడే వున్నావా!" అంటూ ఒక పక్షి అరిచింది కాగును ముక్కుతో పొడుస్తూ.

మా తాత పక్కకు తప్పుకుని పార కిందపడవేసాడు.

"ఆఁ- యిక్కడే వున్నావా!" ఒక గొర్రె చెట్టుమీద నుంచి అరిచింది.

"ఆఁ- యిక్కడే వున్నావా!" అని ఒక ఎలుగుగొడ్డు బొబ్బరించింది, చెట్టు వెనకనుంచి తొంగిచూస్తూ.

మా తాత ఆపాదమస్తకం కంపించిపోయాడు.

"యిక్కడ నోరుమెదపడానికే భయం వేస్తోందే!" అని తనలో తాను గొణుక్కున్నాడు.

"యిక్కడ నోరు మెదపడానికే భయం వేస్తోందే!" అని పక్షి కూసింది.

"యిక్కడ నోరు మెదపడానికే భయంవేస్తోందే!" అని గొర్రె అరిచింది.

"యిక్కడ నోరు మెదపడానికే భయంవేస్తోందే!" అని బొబ్బరించింది, ఎలుగుగొడ్డు.

"హుం!"అన్నాడు మాతాత. అన్నాడే గాని విపరీతమయిన భయంవేసింది.

"హుం" అని కూసింది పక్షి.

"హుం" అని గొర్రె అరిచింది.

"హుం" అని ఎలుగుగొడ్డు బొబ్బరించింది.

భయంతో మా తాత వెనకకు తిరిగాడు. అరె భగవంతుడా! ఏం రాత్రి, ఏం రాత్రి! నక్షత్రాలులేవు, చంద్రుడు లేడు. చుట్టూగోతులు. పాదాలదగ్గర అంతులేనిఅగాధం! తలపైన పర్వత శిఖరం. ఏ నిమిషంలోనయినా విరిగి పడవచ్చు. దాని వెనకనుంచి భయంకరమయిన మొహం తొంగిచూస్తున్నట్లు మాతాతకు అనిపించింది. "ఓ! ఓ!"కమ్మరితిత్తిలాంటి ముక్కు. ఒక్కొక్క ముకు పుటంలో బొక్కెనెడు నీళ్ళుపడతాయి. పెదవులు దుంగలలాగా ఉన్నాయి. ఎర్రగా పత్తికాయల్లా గుడ్లు ముందుకు పొడుచుకు వచ్చాయి నాలుక జాపి వెక్కిరిస్తోంది.

"నిన్ను దెయ్యం యెత్తుకుపోను" అన్నాడు మా తాత కాగును వదిలిపెట్టి. "యీ నిధిని తగలేయా!

అసహ్యం!'' పరుగెత్తుకు వెళ్ళిపోదామనుకుని మళ్ళీ చుట్టూ చూసాడు. అంతా మునపటిలాగానే ఉండేసరికి ఆగాడు. "దెయ్యం నన్ను భయపెడుతోంది!"

మళ్ళీ కాగు పెళ్ళగించాలని యత్నించాడు. అబ్బ! మోయలేని బరువు! ఏం చేయాలి! వదిలిపెట్టి వెళ్ళిపోతే ఎలా? బలమంతా ఉపయోగించి గట్టిగా లేపాడు.

"ఊఁ-ఊఁ-'' ఎలాగయితేనేం బయటికి లాగాడు. "ఊఫ్ - పట్టు నశ్యం వేసుకోవాలి!''

కొమ్ము బయటికితీసి నశ్యం చేతులో వేసుకునేముందు ఎవరన్నా ఉన్నారేమోనని చుట్టూ చూసాడు. ఎవరూ లేరని తోచింది. కాని చెట్టుబోదె ఎగఊపిరి తీసింది. ఉఫ్ మని ఊదింది. చెవులు మొలిచాయి. ఎఱ్ఱటి కళ్ళు, బొర్ర ముక్కు పుటాలు, వంకరముక్కు! తుమ్మబోతున్నట్టుంది! "ఉహుఁ-నశ్యం పీల్చకూడదు'' అనుకున్నాడు మా తాత కొమ్ము జేబులో పెట్టుకుంటూ. "మళ్ళీ సైతాను నా కళ్ళల్లో తుమ్ముతాడు.'' తొందర తొందరగా కాగు లేపి తీసుకుని పిక్కబలంకొద్దీ పరుగెత్తసాగాడు. వెనకనుంచి కాళ్ళమీాద రెమ్మతో గోకుతున్నట్లనిపించింది.

"ఆచ్ అచ్!'' అనిమాత్రమే అరిచాడు పరుగెత్తుతూ. ఫాదరీ పెరడు దగ్గరకు వెళ్లి దమ్ము వదిలాడు.

"తాతయ్య యెక్కడికి వెళ్ళి వుంటాడు?'' అని మేం ఆశ్చర్యపోయాం, ఆయన కోసరమని మూడుగంటలు కాచు కూర్చుని. పొలంనుంచి మాఅమ్మ తిరిగివచ్చి చాలాసేప యింది. వచ్చేటప్పుడు కుండనిండా వేడివేడి బోండాలు

తెచ్చింది. అప్పటికీ తాతయ్యా జాడా లేదు. ఆయన రాకుండా మేం భోజనాలు చేయవలసివచ్చింది. భోజనాలు అయ్యాక మాఅమ్మ కుండకడిగి, ఇంటిచుట్టూ ఖర్బూజా మడు లున్నాయో, కడుగునీళ్ళు ఎక్కడ పోదామాఅని చూస్తోంది. ఇంతలో సూటిగా ఆమెవేపే ఒకపీపా నడిచివస్తూండడం చూసింది. ఆ పీపా వెనక ఎవరో కొంటెకుర్రాడు దాగిఉండి ఆమెకేసి తోస్తున్నాడనుకుంది. "బలే, కడుగునీళ్ళు దాంటో పోస్తాను" అనుకుని వేడివేడి కడుగునీళ్లు పోసింది.

"ఓ –" అని ఒక గొంతు బొబ్బపెట్టింది. అరే, తాతయ్యా! తాతయ్యాని ఎలా తెలుస్తుంది? ఒట్టు. పీపా నడిచి వస్తుందనుకున్నాం. అంటే పాపంగాని, తాతయ్యా తెల్లజుట్టు కడుగునీళ్ళతో తడవడం, పైన ఖర్బుజా తొక్కలు నిలవడం బలే తమాషాగా ఉంది!

"రాక్షసిముండ" అని అరిచాడు మా తాత చొక్కా అంచుతో తల తుడుచుకుంటూ. "పందిమీద పోసినట్టు వేడి వేడి నీళ్లు పోసింది. సరే, అబ్బాయిలూ, యిదిగో రొట్టె ముక్కలు, సరిగదుస్తులు యిక వేసుకుందురుగాని. యేం తెచ్చానో చూడండి!" అంటూ కాగు మూతతీసాడు.

అందులో ఏముందనుకున్నారు? బాగా ఆలోచించి మరీ చెప్పండి, చూదాం. ఏం, బంగారమా? బంగారమేం కాదు. చెత్తా చెదారం, అదేమిటో చెప్పడానికే నాకు అసహ్యం వేస్తోంది. మాతాత తుబుక్కున ఉమ్మివేసి, కాగు దూరంగా పారవేసి, చేతులు కడుక్కున్నాడు.

ఆనాటినుంచీ దెయ్యాన్ని నమ్మమని మా చేత ఒట్టు వేయించాడు.

"యెన్నడూ దాన్ని నమ్మకండి" అని తరచు మాతో చెపుతూండేవాడు. "మన క్రీస్తుప్రభువు శత్రువుందే అది చెప్పేదంతా అబద్ధమే. కుక్క సంతానం! పిసరంతయినా నిజం వుండదు."

ఎక్కడయినా పరిస్థితులు చక్కగా లేవని వింటూంటే అనేవాడు: "రండి, రండి, శిలువగుర్తు వేదాం. అగ్గదీ, బలే!" ఇలాఅని శిలువగుర్తు వేసేవాడు. ఆ వెధవ స్థలం – మాతాత నాట్యం చేయలేకపోయాడే ఆ స్థలంచుట్టూ కంచె వేసి అందులో చెత్తాచెదారం, ఖర్బూజా మడిలోనుంచి పీకిన కలుపు ముక్కలు పాతేయమని చెప్పాడు.

చూడండి, దెయ్యం మనిషిని ఎలా లొంగతీసుకో గలదో! ఆస్థలం నేను బాగా ఎరుగున్నదే. తరవాత తరవాత మా తాతదగ్గరనుంచి ఇరుగుపొరుగు కోసక్‌లు కవులుకు తీసుకుని ఖర్బూజా వేసారు. నేల మంచి సారవంతమయిందేమో విపరీతంగా కాసేది. కాని ఆ చిల్లంగి స్థలంలో మాత్రం పనికి వచ్చేదేమీ మొలిచేదికాదు. ఎంత జాగ్రతగా నాటినా చివరికి మొలిచేది ఖర్బూజాకాదు, గుమ్మడి కాదు, దోసకాదు! అదేవిఁటో ఆ దెయ్యానికే తెలియాలి!



